డిసెంబరు 2015
రూ. 15/-

# చతుర



సన్నీలియోన్
సౌందర్య రహస్యం ..122

★ హోతా పద్మినీదేవి
నవల గుట్టు .... 6

★ కాలాతీతం
కాన్వర్జేషన్ ఇన్ ది కెథడ్రల్ .... 111

★ నవలావలోకనం
జీవనది .... 116







RAMOJI
GROUP

## ప్రతి ఇంటా 'ప్రియ ఆయిల్ తోనే వంట'

ఈ పండుగ సంబరాలను ప్రియ రైస్‌రిచ్ / సన్‌ఫ్లవర్ / రిచ్‌హెల్త్ స్మార్ట్ ఆయిల్ లలో ఏవైనా రెండు 1 లీ. ప్యాకెట్లు కొనుగోలు పై ఒక స్క్రాచ్ కార్డ్ పొందండి, విలువైన బహుమతులు గెలుచుకోండి.*




Offer Valid from 1st Nov 2015 to 31st Jan'2016




పండుగ స్పెషల్ డ్రా ద్వారా ఈ క్రింద విలువైన బహుమతులు గెలుచుకొనే అవకాశం...



40 అమృత వెట్ గ్రైండర్స్



10 ఉషా ఎయిర్ ఫ్రైయర్స్

15 కార్బన్ ఏ-9 మొబైల్స్





ప్రతివారం జరిగే 'లక్కీ డ్రా' ద్వారా కళ్యాణ్ జ్యూయలర్స్ వారి ఒకగ్రా॥ 'గోల్డ్ కాయిన్స్' 16 మంది విజేతలకు అందించబడును

ఇంతే గాక మీ కొనుగోలు పై రూ.5/- లేదా రూ.10/- స్పాట్ డిస్కౌంట్ పొందే అవకాశం.

Panasonic
Karbonn SMART






USHA INFINITICOOK HALOGEN OVEN
AMIRTHAA GRINDER & MIXIE

బంపర్ డ్రా 9 ఫిబ్రవరి 2016

*Terms & conditions apply / Images shown are indicative only.

# సముద్రంపై వంతెన!




'మానవుడే మహనీయుడు' అని ఓ సినీకవి చెప్పినదాన్ని రుజువు చేసేలా ఉందీ వంతెన. నార్వేదేశ ఇరవయ్యో శతాబ్దపు మహత్తర నిర్మాణంగా నిలిచింది 8.3 కిలో మీటర్ల పొడవున్న ఈ సేతువు. అట్లాంటిక్ సముద్రంలోని అనేక చిన్న చిన్న ద్వీపాలను కలుపుతూ దీన్ని 1989లో నిర్మించారు. మనిషి ప్రకృతితో సంఘర్షించి ఎంతటి అద్భుత సౌందర్యాన్ని సృష్టించగలడనే దానికిదో సాక్షీభూతం!

# మనసున ఉన్నదీ...

★ నవంబరు చతుర ముచ్చటగా మూడు నవలికల్ని అందించి ఆహ్లాదపరిచింది. 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' రాజమండ్రి నుండి భద్రాచలం వరకు గోదావరిలో ప్రయాణం చేయించింది. లాంచి సర్వీసువాళ్లు ప్రయాణికులకందించిన సేవల్ని, ఆప్యాయతల్ని అనుభవించాం. ప్రయాణంలో కొందరి జీవిత సమస్యలు పరిష్కారం కావడం విశేషం. రచయిత రామారావు అభినందనీయులు.

పెళ్లిళ్లు స్వర్గంలో నిర్ణయమవుతాయంటూ 'మేడ్ ఇన్ హెవెన్' మళ్లీ నిరూపించింది. తన వల్ల ఒకమ్మాయి పెళ్లి ఆగిపోయి, వారి కుటుంబం బాధలకు గురికావడంతో ప్రశాంత్ కృష్ణన్, ఆ అమ్మాయినే ఇష్టంగా పెళ్లాడ్డం మలయాళ రచయిత జాయ్‌సీ సింప్లిసిటీకి నిదర్శనం. నవలిక 'విలువ' అద్భుతంగా ఉంది. విలువలతో కూడిందే జీవితం. 'విలువ' లేని జీవితం వ్యర్థం అని తెలిపింది.

– *ధఫ్ఫూరి శ్రీధరాచార్యులు*, హైదరాబాద్

★ అనుష్క ముఖచిత్రంతో వెలువడిన గత నెల సంచిక దీపావళి సందడిలా అపూర్వంగా అలరించింది. 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' నవల ఎంతో సుందరంగా గోదావరిపై వీచే పిల్లతెమ్మెరలా.. పాపికొండల నడుమ ప్రయాణం ఎంతో ఉద్వేగంగా సాగింది. రచయిత సృష్టి కన్నుల పండుగగా కొనసాగింది. కొత్తగాలి నుంచి మంచి కవితలు వెలుగులోకి రావడం ముదావహం.

– *పక్కి బాలకృష్ణ*, విజయనగరం

★ అందాలతార అనుష్క ముఖచిత్రంతో వెలువడిన చతుర నవలాస్రవంతి చక్కని కథలనే కెరటాలతో ఆద్యంతం మమ్మల్ని సుమధురలోకాలకు తీసుకెళ్లింది. ముఖ్యంగా 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' సిబ్బంది ప్రయాణికుల పట్ల ఎంతో వినయవిధేయతలతో ప్రవర్తించి అన్ని విధాలుగా మర్యాదలు చేసి చివరికి సురక్షితంగా గమ్యం చేర్చడం అభినందనీయం. ప్రయాణికులు తోటివారిని తమవారిగా భావించడం ఎంతో ముదావహం. ఆయా ప్రదేశాలను ప్రత్యక్షంగా చూస్తున్న అనుభూతి కలిగింది. ఇంతమంచి నవలను అందించిన చతురకు అభినందనలు.

– *కరణం శివానందరావు*, కర్నూలు

★ 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' నవలలో రకరకాల మనసులు గల ప్రయాణికుల కష్టసుఖాలను వివరంగా తెలిపారు. లాంచి ప్రయాణాన్ని పురస్కరించుకుని ముఖ్యంగా కవిరాజు అడవిపిల్ల ప్రేమకథ రసవత్తరంగా సాగింది. చేయితిరిగిన రచయిత రామారావుగారికి ధన్యవాదాలు. 'భమిడిపాటి హాస్యవల్లరి' బాగుంది.

– *వెలగా రాజేశ్వరరావు*,
తాళ్లపాలెం, విశాఖ జిల్లా

★ 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' నవల చదువుతుంటే గోదావరిలో లాంచిలో ప్రయాణించిన అనుభూతి కలిగింది.

– *జి.జి.కె రావు*, శ్రీకాకుళం

★ బి.వి.ఎస్. రామారావుగారి 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' పట్టిసీమ అందాలతో రసరమ్యంగా సాగింది. విభిన్న నేపథ్యాలుగల ప్రయాణికుల గాథలను సందర్భోచితంగా ప్రస్తావించి నవలను రక్తికట్టించారు.

– *సూరి నాగరాజు*, రామవరప్పాడు, కృష్ణాజిల్లా

★ నవంబరు చతుర ఆసాంతం చదివింపజేసింది. మనుషుల విలువలను, అనురాగాలను, ఆప్యాయతలను గుర్తుకు తెచ్చింది. మూడు నవలికలు, నవలావలోకనం, ఇతర శీర్షికలు అలరింపజేశాయి. ముఖ్యంగా 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' ప్రయాణంలో అల్లుకున్న అనుభూతులు చెరగని ముద్రవేశాయి. జాయ్‌సీ 'మేడ్ ఇన్ హెవెన్', సోమర్‌సెట్ మామ్ 'విలువ' నవలికలు బాగా ఆకట్టుకున్నాయి. నవలావలోకనంలో 'తృష్ణ' నవలపై అందించిన విశ్లేషణ బాగుంది.

– *పల్లా పవన్‌కిషోర్*, ప్రొద్దుటూరు

– *వానపల్లి వాసిని*, కశింకోట, విశాఖ జిల్లా

సంపుటి -38,
సంచిక - 11
455వ సంచిక,
పేజీలు : 132, డిసెంబరు 2015

# చతుర



★ ముఖచిత్ర ఛాయాగ్రాహకుడు:
దిలీప్ బెనర్జీ
★ పుస్తకాలంకరణ : రాజు యాట



'అమ్మా! మరి నాకు..' అర్ధరాత్రి తల్లిని లేపి చెప్పబోయింది జయ.

'ఏమిటమ్మా! శాస్త్రిగారు చెప్పిన సంబంధం నచ్చలేదా?' అనునయంగా అడిగింది తల్లి.

అవునన్నట్టు తల ఊపింది జయ.

'..బాగున్న సంబంధమేగా?' సర్దిచెప్పబోయింది తల్లి.

'నేను సూర్యాన్ని ప్రేమించాను' చెప్పింది జయ.

'ఏమిటీ? ఎవరా సూర్యం? ఈ ఊరేనా? మన కులమేనా?' ప్రశ్నల వర్షం కురిపించింది తల్లి శకుంతల.

'ఈ ఊళ్లోనే బ్యాంకులో ఉద్యోగం చేస్తున్నాడు. మన కులం కాదు' చెప్పింది జయ.

'కులం కానివాడిని ప్రేమిస్తావా ?' కోపంగా అడిగింది తల్లి.

'మా పెళ్లి జరిగి తీరాలమ్మా! ఎందుకంటే నేను నెలతప్పా నేమో..' చెప్పింది జయ.

నెత్తిన పిడుగు పడ్డట్టయింది తల్లికి! జయ పెళ్లి సూర్యంతో జరిగిందా? తల్లిదండ్రులు అంగీకరించారా? తరువాత పరిణామాలేమిటి? అత్యంత ఆసక్తిగా సాగే

**హోతా పద్మినీదేవి**

కౌటుంబిక నవల **గుట్టు**

6వ పేజీలో..











'ఎందుకిలా చేశారు? జయ ఊరికెళ్లిందని అబద్ధం చెప్పి ఆమెని చూడనివ్వలేదు. మా పెళ్లిని అంగీకరించినట్టు నమ్మించి వెన్నుపోటు పొడిచారు! జయను శాశ్వతంగా నాకు దూరం చెయ్యాలని ప్రయత్నిస్తున్నారా?' జయ తల్లిదండ్రులను నిలదీశాడు ఆమెను ప్రేమించిన సూర్యం.

'దయచేసి ఇక్కడి నుంచి వెళ్లిపోబాబూ! పరువుగా బతుకుతున్న మమ్మల్ని రచ్చకీడ్చి నలుగురిలోనూ నవ్వులపాలు చెయ్యకు! లేదంటే మా కుటుంబం మొత్తం విషం తాగి చావాలి' చేతులు జోడించింది జయ తల్లి శకుంతల.

'జయను నాతో పంపండి. కులమే అడ్డమైతే మీ పవిత్రమైన కులానికి మా అపవిత్రమైన గాలి కూడా సోకనంత దూరం వెళ్లిపోతాం' అర్థించాడు సూర్యం.

'ఈ ఇంటి పరువు కంటే నా ప్రాణాలేమీ విలువైనవి కావు. నా చావును కళ్లారా చూసి జయను తీసుకెళ్లు'. అంటూ క్షణాల్లో కిరోసిన్ మీద కుమ్మరించుకుని అగ్గిపెట్టె తెరిచింది శకుంతల!

ఆ తర్వాతేమైంది? శకుంతల అనుకున్నట్లు జరిగిందా? జయ జీవితం ఏ మలుపు తిరిగింది?

ఆద్యంతం ఆసక్తిగా సాగే హోతా పద్మినీదేవి కౌటుంబిక నవల **గుట్టు** చతుర డిసెంబరు కానుక!

ఇల్లంతా పెళ్ళిసందడి. గోడలకి, తలుపులకి పెయింట్ వేసిన ఆ ఇల్లు కళకళలాడుతోంది. పెళ్ళికి కొన్న సామాన్లతో గదులన్నీ నిండి వున్నాయి. కూతురికి మంచి సంబంధం నిశ్చయమైందనే ఆనందం, కొన్నిరోజుల్లో ఆమె అత్తారింటికెళ్ళిపోతుందనే బాధ శ్రీదేవిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. రెండు రోజులలో అమృతని పెళ్ళికూతురిని చేస్తారు. ఆరోజుకి దూరపు ఊళ్ళనుంచి బంధువులంతా వస్తారు. ఈలోగా అమృతతో మాట్లాడాలి. అత్తారింట్లో ఎలా మసలాలో చెప్పాలి. శ్రీదేవి కూతురి గదిలోకి నడిచింది.

"అమృతా! నేను నీతో అయిదు నిమిషాలు మాట్లాడాలి.." అంటూ గదిలోకి వచ్చిన తల్లిని చూసి, టైలర్ దగ్గర నుంచి తెచ్చుకున్న జాకెట్లని చీరలలో వేటికవి సర్దుకుంటున్న అమృత "చెప్పమ్మా!" అంది, చేస్తున్న పని ఆపి.

మంచంమీద, కూతురు పక్కన కూర్చుంటూ ఎలాంటి ఉపోద్ఘాతమూ లేకుండా శ్రీదేవి సూటిగా మొదలుపెట్టింది.

"మరి కొన్నిరోజుల్లో నువ్వు అత్తారింటికి వెళ్ళబోతున్నావు! నీకు ఇంతకుముందు పరిచయం లేని వ్యక్తులు.. పరిసరాలు.. ఇల్లంతా కొత్తకొత్తగా వుంటుంది.." అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న తల్లికి మధ్యలోనే అడ్డుపడింది.

"మన ఇంట్లోలాగా పొద్దెక్కేదాకా పడుకోకూడదు. అందరికంటే ముందు లేచి, అందరికీ కాఫీ చేసి ఇవ్వాలి. మా అత్తగారితో వినయ విధేయతలతో మెలగాలి! నాకేమైనా తెలియకపోతే నా సీనియర్.. అదే మా తోటికోడలిని అడిగి తెలుసుకోవాలి! ఇవన్నీ నాకు పెళ్ళి కుదిరిన దగ్గర నుంచీ చెబుతూనే వున్నావు! ఇంతేనా? ఇంకేమైనా వున్నాయా? "

"అన్నింటికంటే అతి ముఖ్యమైన విషయం.. మన ఇంటిగుట్టు ఎవరికీ చెప్పకు! చివరకు నీ భర్తకి కూడా! అలాగే నీ గురించి గొప్పలు కూడా చెప్పద్దు!"

"నీ గురించి ఎప్పుడూ మంచి చెప్పకు! ఓస్! ఇంతేనా? అనుకుంటారు. అలాగే నీ గురించి చెడు కూడా చెప్పకు! ఇంకా ఏదో వుంది అనుకుంటారు. ఈ వాక్యాలని ఏదో పుస్తకంలో, ఎప్పుడో చదివాను. ఆ రచయిత ఎంత బాగా చెప్పాడో చూశావా! ముఖ్యంగా అక్క సంసారంలోని లొసుగులని ఎవరికీ చెప్పకు!"

అక్కని తలచుకోగానే అమృత కళ్ళలో నీళ్ళూరాయి. ఆమె చేసిన ఒకే ఒక్క పొరపాటు, ఆమె జీవితంలో ఎంత కల్లోలాన్ని సృష్టించింది!

శ్రీదేవి కళ్ళలో కూడా నీళ్ళూరాయి. ఆ ఇద్దరూ కొద్దిసేపు అంజలిని తలచుకొని బాధపడ్డారు.

మరునాడు అమృతని పెళ్ళికూతురిని చేస్తారనగా ముందురోజు హైదరాబాదు నుంచి అంజలి, ఆమె భర్త చరణ్ వచ్చారు. చలపతి, శ్రీదేవి అల్లుడికి, కూతురికి మర్యాద చేశారు.

పెళ్ళయి కాపురానికి వెళ్ళిన ఏడాది తరువాత పుట్టింటికి వచ్చిన అంజలి కళ్ళలో ఆనందం కన్నీరయి మెరిసింది. అంజలి ఎవరితో మాట్లాడుతున్నా, చరణ్ చూపు ఆమె మీదే వుండడం గమనించింది శ్రీదేవి. అతని చూపులు చురకత్తుల్లా వున్నాయి. హత్య కేసులో అనుమానితుడైన వ్యక్తిని ఒక పోలీసు ఆఫీసరు ఎలా వెంటాడుతాడో, అతని చూపులు ఆమెని అలా వెంటాడుతున్నాయి.

మధ్యాహ్నం భోజనాలయ్యాక మగవాళ్ళంతా వీధి వరండాలో, ఆడవాళ్ళంతా మధ్య గదిలో కూర్చున్నారు. మగవాళ్ళ సంభాషణ సినిమాల మీదకి మళ్ళింది.

"సినిమాలు చూస్తుంటారా? " అడిగాడు రాజమండ్రి నుంచి వచ్చిన చలపతి తమ్ముడు శంకరం.

"మహేష్‌బాబు కొత్త సినిమా చూశాను. మీ అమ్మాయి మహేష్ అంటే పడిచ స్తుంది" అప్పుడే మంచినీళ్ళ గ్లాసులున్న ట్రేతో అక్కడకి వచ్చిన అంజలి ముఖం లోకి ఓరగా చూస్తూ అన్నాడు చరణ్.

శంకరం కూతురు ఉత్కళ "నాకూ మహేష్‌బాబు అంటే ఇష్టం బావగారూ!" అంది.

"నువ్వు మీ అక్కకి పోటీ వస్తే వూరు కోదు. మరో హీరోని వెతుక్కో!" అన్నాడు.

అంజలి ముఖం నల్లబడింది. చలపతి ముఖంలో నెత్తురు ఇంకిపోయింది. అల్లు డి నోటెంట 'మహేష్' పేరు వినగానే.

"ఏరా! నీకు మహేష్‌బాబు అంటే అంత ఇష్టమా? " శంకరం నవ్వుతూ అడిగాడు అంజలిని.

"చాలా చాలా ఇష్టం! అసలు అతన్నే పెళ్ళి చేసుకోవాలనుకుంది. కుదరక నన్ను చేసుకుంది" అన్నాడు చరణ్ వ్యంగ్యంగా.

అందరూ అతను అన్న మాటలకి నవ్వేరు. అతనా మాటలని వేళాకోళంగా అనలేదని, అంజలి ఇష్టపడింది సినిమా హీరో మహేష్‌ని కాదని చలపతికి తెలుసు. నిస్సహాయతతో కూడిన వేదనతో తల దించుకున్నాడతను.

అంజలి అక్కడి నుంచి లోపలికి వెళ్ళిపో యింది. ఆమె మనశ్శరీరాలు అవమా నంతో దహించుకు పోతున్నాయి. అసలు పెళ్ళికే వెళ్ళక్కర్లేదన్న అతను, అమృత పెళ్ళికి తీసుకొచ్చాడు. తమ బంధువుల మధ్య తండ్రి పరువు కాపాడి, తన మర్యా దని నిలబెట్టుకున్నాడని సంతోషించింది తను. కానీ, ఇలా గూఢార్థాలతో మాట్లాడి తనని హింసిస్తాడనుకోలేదు. ఆమెకి మనుషులెవరూ లేనిచోటకి వెళ్ళి భోరున ఏడవాలని వుంది.

★ ★ ★

"మీరు చాలా అదృష్టవంతులు అక్కయ్యా! మీ అమ్మాయిలకి గొప్పింటి సంబంధాలు దొరికాయి. మా ఉత్కళకి

## కొత్తగాలి...

**తివిరి ఇసుమున తైలంబు**
**తీయవచ్చును, నిజమే!**
**ఇసుక లోంచి కాసుల తైలాన్ని**
**పిండుతున్నారుగా!**

– బిక్కునూరి రాజేశ్వర్,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

కూడా మంచి సంబంధం చూసే బాధ్యత మీదే" అంది వనజ.

"అలాగే లే! ముందు దాన్ని బాగా చదు వుకోమను" అంది శ్రీదేవి.

అంజలి కట్టుకున్న పట్టుచీర చూస్తూ "నీ చీర చాలా బాగుంది అంజలీ! ఎక్కడ కొనుక్కున్నావ్? " అంది వనజ.

"ఇది మా పెళ్ళి చీర పిన్నీ! మా అత్త గారు పెట్టారు"

"హారం బాగుంది! ఎన్ని గ్రాములు? " ఆమె మెడలోని హారాన్ని పట్టి పట్టి చూస్తూ మళ్ళీ అడిగింది.

చెప్పింది అంజలి.

"బాగుంది! మీ ఆయన కొన్నాడా? "

"అవును!"

అంజలి నవ్వులో, ఆమె మాటల్లో ఏదో వెలితి వుందని గమనించింది వనజ. భర్త చెవిలో గుసగుసలాడింది. "అంజలిని ఆ మె భర్త సరిగ్గా చూసుకోడం లేదేమో! దాని ముఖంలో సంతోషమే లేదు"

"నోర్ముయ్! ఎవరైనా వింటే బాగుం డదు! అయినా సంతోషంగా వుండడ మంటే ఎగిరి గంతులేస్తూ వుండాలా? పెళ్ళిలో వేళకి నిద్రాహారాలు లేక అలసట వల్ల అలా వుందేమో!" అన్నాడు శంకరం మందలిస్తూ.

అయినా వనజ అంజలిని పట్టిపట్టి

చూస్తూనే వుంది.

జరీ ముద్దలా వున్న పట్టుచీర, నగలతో ముస్తాబయిన అంజలిని కళ్ళ నిండుగా చూసుకుంటూనే నిట్టూర్చింది శ్రీదేవి. విస్తరి నిండా పంచభక్ష్య పరమాన్నాలని వడ్డించి, విస్తరి చివర ఉమ్మేసినట్టు వుంటుంది అల్లుడి ప్రవర్తన. అంజలికి ఖరీదైన చీరలని, నగలని, కొంటాడు.. కానీ, మాటలతో.. చేతలతో ఆమెకి నరకాన్ని చూపిస్తాడు. అందరూ అంజలి అదృష్టవంతురాలని ఈర్ష్యపడతారు. కానీ ఆమెది మేడిపండు లాంటి సంసారమని ఎవరికి తెలుస్తుంది?

అంజలి విషయంలో దెబ్బతిన్న చలపతి, శ్రీదేవి.. అమృతకి ఈ పెళ్ళి సంబంధాన్ని చలపతి స్నేహితుడు విశ్వం చెప్పగానే నిరాకరించారు.

అమృతని తన ఫ్రెండు పెళ్ళిలో చూశాడట ప్రభాత్! ఆమె తనకి నచ్చిందని, పెళ్ళంటూ చేసుకుంటే ఆమెనే చేసుకుంటానని పట్టుపట్టాడట!

"నేను మధ్యతరగతి వాడిని! వాళ్ళు కోటీశ్వరులు! నా కూతురికి నా తాహతుకి మించిన సంబంధం చెయ్యాలనుకోడం లేదు నేను!" అన్నాడు చలపతి.

"అదేమిట్రా? డబ్బున్న అమ్మాయిని కోడలిగా తెచ్చుకోడానికి ఆలోచించాలి! ఆమె మన ఇంట్లో ఎడ్జెస్ట్ అవుతుందో? లేదో? అని. పిల్లనిచ్చుకోడానికేం? మీ పెద్దమ్మాయికి డబ్బున్న సంబంధం చేశావు! తను సుఖంగా లేదూ?" విశ్వం నచ్చజెబుతున్నట్టు అన్నాడు.

'ఆc! చాలా సుఖంగా వుంది!' విరక్తిగా అనుకున్నాడు మనసులోనే.

"నా ఫ్రెండు జగన్నాథం అని చెబుతుంటాను చూడు! ఆ జగన్నాథం కొడుకే ప్రభాత్! నాకు వాళ్ళ కుటుంబం బాగా తెలుసు! చాలా మంచివాళ్ళు!"

"ఆయన పోయారన్నావుగా!" అడిగాడు.

"అవును! జగన్నాథం పోయి నాలుగేళ్ళ వుతోంది! అతని భార్య కృష్ణవేణి చాలా మంచిమనిషి. వాళ్ళకిద్దరు అబ్బాయిలు. పెద్దబ్బాయికి పెళ్ళయింది. ఇతను రెండో అబ్బాయి. అన్నదమ్ములిద్దరూ కలిసే బిజినెస్ చేస్తున్నారు.

విశ్వం తన ఆప్తమిత్రుడు. తనని మోసం చెయ్యడనే ధైర్యంతో ఈ పెళ్ళి సంబంధానికి వెళ్ళడం తప్ప, వాళ్ళ గురించి తనకేమీ తెలియదు! చలపతి ఆలోచిస్తున్నాడు.

"ఒరేయ్! నేను చెప్పేది చెప్పాను! తరువాత నీ ఇష్టం!" అన్నాడు విశ్వం.

"అబ్బాయి ఏం చదువుకున్నాడు?" అప్రయత్నంగా అడిగాడు.

"నేను వివరాలన్నీ కృష్ణవేణిగారిని కనుక్కుని చెబుతాను!" అన్నాడు విశ్వం.

అబ్బాయి వివరాలు తెలుసుకుని వూరుకోలేదు. పెళ్ళిచూపుల నుంచి పెళ్ళి వరకు అన్నింటా తనే పెద్దదిక్కయి నిలిచాడు.

అమృతని అత్తవారికి అప్పగిస్తున్నప్పుడు కూడా కన్నీరు పెట్టని శ్రీదేవి- అంజలి భర్తతో ప్రయాణమయినప్పుడు కన్నీళ్ళు ఆపుకోలేకపోయింది. చలపతికి కూడా దుఃఖం వచ్చింది.

ఫ్లయిట్‌లో చరణ్ పక్కన కూర్చున్న అంజలికి తను ప్రయాణమయి వస్తుంటే కన్నీళ్ళు పెట్టుకుంటున్న తల్లీ, తండ్రీ కళ్ళ ముందు కనిపిస్తున్నారు. ఆమెకి చరణ్‌తో తన పెళ్ళి గుర్తుకొస్తోంది.

★ ★ ★

అంజలికి పెళ్ళి ప్రయత్నాలు మొదలుపెట్టాడు చలపతి. ఆ ప్రయత్నంలో భాగంగా మేరేజి బ్యూరోలలో కూతురి వివరాలతో బాటు ఆమె ఫోటో కూడా ఇచ్చాడు. అందంగా, ఆకర్షణీయంగా వున్న అంజలికి చాలా సంబంధాలే వచ్చాయి. వాటిల్లో కొన్ని జాతకాలు నప్పక, కొన్ని సంబంధాలు చలపతికే నచ్చక- ఏవీ పెళ్ళిచూపుల

# సొంత సూర్యుడి వెలుగు!




ప్రపంచంలో కొన్ని వింత గ్రామాలున్నాయి. వీటి గురించి తెలుసుకుందాం.

★ మధ్య చైనాలోని పర్వతాల్లో గల గన్సీ డాంగ్ అనే చిన్న గ్రామంలోని ప్రజలందరికీ కుంగ్‌ఫూ వచ్చు! క్రూర మృగాల నుంచి వారి పశువులని కాపాడుకోవడానికి వారు తరతరాలుగా కుంగ్‌ఫూని నేర్చుకుంటున్నారు. వారి కుంగ్‌ఫూ కదలికలు పెద్దపులి, చిరుతపులి, పాములని పోలి ఉంటాయి!



★ మేఘాలయలోని మాసిండ్రామ్ అనే గ్రామం, ప్రపంచంలోనే అతి తడి ప్రాంతం. ఏటా 467 అంగుళాల (40 అడుగుల) వర్షపాతం పడడమే అందుకు కారణం.

★ ఇటలీలోని డిజనెల్లా అనే గ్రామం తన సొంత సూర్యుడ్ని ఏర్పాటు చేసుకుంది! ఓ లోయలో ఉండే ఆ గ్రామం మీద చలికాలం మూడు నెలలూ కొండ నీడ పడుతూ ఉంటుంది. దాంతో నవంబర్ నుంచి ఫిబ్రవరి దాకా చీకటిగా ఉండే ఆ గ్రామానికి వెలుతురు కోసం 2006లో 1.1 టన్ను బరువు గల అద్దాన్ని కొండకు బిగించారు. ఆ గ్రామం మీద ప్రతిబింబంగా వెలుతురు పడుతోందిపుడు.

★ ఇటలీలోని డెమెన్షియా అనే గ్రామంలోని ప్రజలందరికీ అల్జిమర్స్ వ్యాధి ఉంది. జ్ఞాపకశక్తి నశించడం ఆ వ్యాధి లక్షణం. ఆ గ్రామ జనాభా 152. డెమెన్షియా అంటే వృద్ధాప్యపు మతిమరుపు.

★ స్పెయిన్‌లోని జుజుకార్ అనే గ్రామంలోని ఇళ్లన్నీ నీలం రంగులోనే ఉంటాయి. 2011లో గ్రామస్థులు ఈ నిర్ణయం తీసుకున్నారు. ఇప్పుడది పర్యాటక ఆకర్షణ అయింది.

★ కజకస్థాన్‌లోని కలాచీ అనే ఊళ్ళోని ప్రజలంతా నిద్రకి తూగుతుంటారు! ఎన్‌సెఫలిటిస్ అనే రోగం వారికి సోకడం అందుకు కారణం.

★ నెదర్లాండ్స్‌లో గైతుర్న్ అనే గ్రామంలో రోడ్లు లేవు. కేవలం నాలుగుమైళ్ల కాలువలు ఉన్నాయి. ఈ గ్రామవాసులు ప్రయాణానికి పడవలే ఉపయోగిస్తారు!

వరకు రాలేదు. రెండు నెలల తరువాత ఒక మేరేజి బ్యూరో నుంచి ఆయనకి ఫోన్ వచ్చింది. అంజలికి మంచి సంబంధం వుందని, తమ ఆఫీసుకి వస్తే వివరాలు చెబుతామని! చలపతి, శ్రీదేవి ఆ మేరేజి బ్యూరోకి వెళ్ళారు. బ్యూరోలో పనిచేసే అతను కంప్యూటర్‌లో అబ్బాయి ఫొటో, వివరాలు చూపించారు.

అబ్బాయి పేరు చరణ్! ఇంజినీరింగు అయ్యాక అమెరికాలో ఎం.బి.ఎ. చదివి, హైదరాబాద్‌లో సొంతంగా బిజినెస్ చేస్తున్నాడు. తల్లికి ఒక్కడే సంతానం. అతనికి ఏడేళ్ళ వయసులోనే తల్లి సంధ్య భర్త నుంచి విడిపోయింది. ఆవిడ బెంగళూరులో ఫ్యాక్టరీ చూసుకుంటోంది. వధువు అందం, కుటుంబ సంప్రదాయం ముఖ్యం. కట్నకానుకలు అవసరం లేదు.

శ్రీదేవికి ఆ సంబంధం నచ్చింది. తమ తాహతుకి కూతురికి అలాంటి సంబంధం తీసుకురాలేరు. ఆవిడ సాభిప్రాయంగా భర్తవైపు చూసింది.

చలపతికి ఎందుకో ఆ సంబంధం పట్ల ఆసక్తి కలగలేదు. అబ్బాయికి తండ్రి లేడు. తల్లి బెంగళూరులో, కొడుకు హైదరాబాదులో! నలుగురున్న కుటుంబమైతే ఒకరి కొకరు తోడుంటారు. ఒక్కడే అబ్బాయి!

ఆయనకి నచ్చలేదు. పైగా వాళ్ళు ఎక్కడి వాళ్ళో తెలియదు. ముక్కూముఖం తెలీని వాళ్ళతో వియ్యమందాలనుకోలేదాయన.

"ఇంకేమైనా సంబంధాలున్నాయా? " అనడిగేడు.

మేరేజి బ్యూరో అతను కంప్యూటర్ ఆఫ్ చేసి ఒక పెద్ద ఫైలు తెచ్చి ఆయన ముందుంచాడు.

శ్రీదేవికి భర్త ధోరణి అర్థంకాలేదు. 'ఇంత మంచి సంబంధం పట్ల ఆసక్తి లేదేమిటి ఈయనకి? ' అనుకుంది. ఇంటికి వచ్చాక అడిగింది.

"ఆ సంబంధం మీకు నచ్చలేదా? "

"నీకు నచ్చిందా? " తిరిగి ప్రశ్నించాడు.

"సంబంధం మంచిదే కదా!"

"వాళ్ళ డబ్బు, హోదా చూసి నువ్వు ఫ్లాటయిపోయావా? అబ్బాయికి తండ్రి లేడు. ఆవిడ విడాకులు తీసుకుంది. అది నేరమని అనను. సింగిల్ పేరెంట్ పెంపకం! అతను ఎలా పెరిగాడో? తెలియదు. పైగా ఆవిడొకచోట, అబ్బాయి మరోచోట! నాకు నచ్చలేదు. పాతరోజుల్లో లాగా నలుగురు పిల్లలు కాకపోయినా, కనీసం ఇద్దరయినా పిల్లలుండాలి! ఒకళ్ళకొకళ్ళు తోడుంటారు! ఆస్తి లేకపోయినా అబ్బాయికి మంచి ఉద్యోగం వుంటే చాలు!" అన్నాడు చలపతి.

భర్త తన సందేహాలని వ్యక్తం చెయ్యడంతో శ్రీదేవి మాట్లాడలేకపోయింది.

వారం తర్వాత మేరేజి బ్యూరో నుంచి ఫోన్ వచ్చింది. ఆ పెళ్లి సంబంధం వాళ్ళు వైజాగ్ వచ్చారట! అంజలిని చూడాలనుకుంటున్నారట!

"మాకు ఇంట్రెస్ట్ లేదని వాళ్ళకి చెప్పండి!" అన్నాడు చలపతి.

"మీ సంబంధం వాళ్లకి నచ్చిందట!"

చలపతి ఫోన్ పెట్టేసి, విషయం భార్యకి చెప్పాడు.

"పోనీ చూసి వెళ్ళనియ్యండి! ఆవిడతో ప్రత్యక్షంగా మాట్లాడి, అన్నీ తెలుసుకుని, నచ్చకపోతే వదిలేద్దాం!" అంది శ్రీదేవి.

ఆయన అయిష్టంగానే అంగీకరించాడు.

ఆ మధ్యాహ్నం సంధ్య, చరణ్ ఇద్దరూ వచ్చారు. అంజలికి పెళ్ళి చూపులని చెప్పలేదు. ఎవరో ఫ్రెండ్స్ వస్తున్నారని చెప్పారు. ఆమె పొద్దుట స్నానం చేసి వేసుకున్న చుడీదార్‌లో వుంది. అమృత కాలేజీకి వెళ్ళింది.

సంధ్యని చూస్తే చరణ్‌కి తల్లిలాకాక, అక్కలా వుంది. మైసూర్ క్రేప్‌చీర కట్టుకున్న ఆమె, మెడ దగ్గరగా కత్తిరించిన జుట్టుతో ఆధునికంగా వుంది. చరణ్ ఆకర్షణీయంగా వున్నాడు. అంజలిని చూడగానే అతని కళ్లలోని వెలుగు, సంధ్య ముఖంలోని సంతృప్తి చూసిన శ్రీదేవికి అర్థమైంది వాళ్ళకి ఆమె బాగా నచ్చిందని!

చరణ్ చూపులు అంజలిపై అతుక్కుపోడం చలపతికి నచ్చలేదు. "నువ్వు లోపలికి వెళ్లమ్మా!" అన్నాడు.

ఆమె లోపలకి వెళ్ళాక, సంధ్య సూటిగా సంభాషణ మొదలుపెట్టింది. "చలపతి గారూ! మీకు మా సంబంధం పట్ల వున్న భయ, సందేహాలు నాకు తెలుసు! మీరే కాదు, ఆడపిల్లనిచ్చుకుంటున్న ప్రతి తల్లీ, తండ్రీ తెలియనివాళ్ళతో సంబంధం కలుపుకోడానికి భయపడడం సహజం! మేం కూడా ఈ ప్రాంతం వాళ్ళమే! వ్యాపార రీత్యా బెంగళూరులో సెటిలయ్యాం! మా అమ్మమ్మగారిది ఈ వూరే! మా మామయ్య లాయర్ పరమేశ్వరం ఎమ్.వి.పి. కాలనీలో వుంటారు. మా గురించి ఆయన్ని అడిగి ఎంక్వయిరీ చేసుకోండి! మీకు మా సంబంధం అంగీకారమైతే, ఇదుగో, నా విజిటింగ్ కార్డు! నేను ఇంకో రెండురోజులు వైజాగ్‌లోనే వుంటాను. మీరు నన్ను కాంటాక్టు చెయ్యండి!" అని పర్సులోనుంచి తీసి అందించింది.

వాళ్ళు వెళ్ళాక చలపతి ఆలోచనలో

# ఐన్‌స్టీన్ మెదడు నేటికీ భద్రం!

చతుర సమాచారం

మెదడు లేకుండా ఎవరూ పుట్టరు, జీవించరు. దానికి సంబంధించిన కొన్ని వాస్తవాలు.

★ మెదడుకి నొప్పి తెలీదు, దానికి బాధని తెలుసుకునే రిసెప్టర్స్ ఉండవు. అందుకే సర్జన్స్ మెలకువ ఉండగానే, రోగి మెదడుకి శస్త్రచికిత్స చేస్తుంటారు.

★ మెదడులోని రక్తనాళాల పొడవు



మొత్తం లక్షమైళ్ళకి సమానం!

★ శరీరం ఉపయోగించే శక్తిలో పదిహేడు శాతం, ఆక్సిజన్‌లో ఇరవై శాతం మెదడు ఉపయోగించుకొంటుంది. మెదడు పది నుంచి ఇరవైమూడు వాట్స్ శక్తిని ఉపయోగించుకుంటుంది. ఆ శక్తితో ఓ వైట్ బల్బ్‌ని వెలిగించవచ్చు.

★ మెదడులో డెబ్బై ఐదు శాతం నీరే!

★ ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ 1955లో మరణించాక, డాక్టర్ థామస్ హార్వే బ్రెయినక్టమీ సర్జరీ చేసి, ఆయన మెదడుని శాస్త్రీయ పరిశోధన కోసం తీసి దాచాడు. అది కేన్సాస్‌లోని విచిటా అనే ఊళ్ళో నేటికీ ఉంది!

★ మెదడు రెండు భాగాలుగా విడిపోయి ఉన్నా, రెండూ కలిసి పనిచేస్తాయి. శరీరంలోని ఎడమ భాగాలని కుడి మెదడు, కుడి భాగాలను ఎడమ మెదడు కంట్రోల్ చేస్తుంది.

★ ఆడవారి మెదడుకన్నా, మగవారి మెదడు పది శాతం పెద్దది.

★ నిద్రలోనే మెదడు అధికంగా పని చేస్తుంది. అందుకే మెలకువ సమయంలోని ఎమోషన్స్ కలలుగా వస్తుంటాయి.

★ మెదడు పరిమాణం మేధస్సుకి ముఖ్యం కాదు. సగటున మగవాడి మెదడు 1400గ్రాముల బరువు తూగితే, ఐన్‌స్టీన్ మెదడు 1230 గ్రాముల బరువే ఉంది!

★ అత్యధిక ఐక్యూ గల వ్యక్తి పేరు ఉంగ్. మార్చి 8, 1972లో సౌత్‌కొరియాలో పుట్టిన ఉంగ్ ఎనిమిదో నెలలోనే ఆల్‌జీబ్రాని అర్థం చేసుకోగలిగాడు. రెండో సంవత్సరంలో నాలుగు భాషలు మాట్లాడగలిగాడు. నాలుగో ఏటే యూనివర్సిటీలో చేరాడు!

---

పడ్డాడు. రాత్రి ఏడింటికి ఆయన ఆలోచన ఒక కొలిక్కి వచ్చింది. ఆయన ఎమ్.వి.పి. కాలనీలో వుంటున్న లాయర్ పరమేశ్వరాన్ని కలుసుకున్నాడు. "నా మేనకోడలు అని చెప్పడం కాదు కానీ, సంధ్య బంగారుతల్లి! దాని దురదృష్టం కొద్దీ మా బావగారు ముందూ వెనకా ఆలోచించకుండా దాన్ని ఒక దౌర్భాగ్యుడికిచ్చి పెళ్ళిచేశారు. వాడు తాగుబోతు, తిరుగుబోతు. భర్త ప్రవర్తన భరించలేక చరణ్‌కి ఏడేళ్ళ వయసుండగా విడాకులు తీసుకుంది. కష్టపడి పిల్లాడిని చదివించి, ప్రయోజకుడిని చేసింది. అబ్బాయి విషయంలో మీరెలాంటి భయ సందేహాలూ పెట్టుకోనవసరం లేదు" అన్నాడాయన.

ఆయన మాటలతో చలపతి మనసు తేలిక పడినా, ఒకవైపు ఏదో శంక పీడిస్తూనే వుంది.

ఇంటికి వచ్చి అంజలిని పిలిచాడు. ఆమె తండ్రి పిలుపుతో బయటకొచ్చింది.

"మధ్యాహ్నం మన ఇంటికి వచ్చిన అబ్బాయిని చూశావా?"

"చూశాను నాన్నగారూ! మీ ఫ్రెండు భార్య, ఆవిడ కొడుకు అన్నారుగా!"

"కాదు, నిన్ను చూసుకోడానికి వచ్చారు!"

"పెళ్ళిచూపులా?" తికమకగా చూసింది




"అవును!" అంటూ సంబంధం వివరాలు చెప్పాడు. "ఇప్పుడు చెప్పు! నీకిష్టమేనా? "

"నాకు కంగారుగా, భయంగా వుంది నాన్నగారూ! ఆ అబ్బాయి గురించి నాకేమీ తెలియదు"

"మూడు నిమిషాల పెళ్ళి చూపుల్లోనే కాదు, మూడునెలల పరిచయంలో కూడా ఎవరి గురించి ఎవరికీ పూర్తిగా తెలియదు. నీకు అతను నచ్చితే, నేను అతని తల్లితో మాట్లాడతాను"

"మీకు ఏది మంచిదనిపిస్తే అది చెయ్యండి!" అని లోపలకి వెళ్ళిపోయింది.

"ఈ సంబంధమే కాదు, మరే సంబంధమయినా మన గురించి వాళ్ళకి, వాళ్ళ గురించి మనకి పూర్తిగా తెలియదు" అంది అప్పటి వరకు మౌనంగా వున్న శ్రీదేవి.

చలపతి ద్వైదీభావంతో సతమతమవుతున్నాడు. ఆయన మరునాటి ఉదయం మరోసారి కూతురితో మాట్లాడాడు.

"మీకేది మంచిదనిపిస్తే అది చెయ్యండి నాన్నగారూ!" అంది అంజలి.

దేముడిపై భారం వేసి, ఆయన సంధ్యకి ఫోన్ చేసి తన అంగీకారాన్ని తెలిపాడు.

మరో పదిరోజుల తరువాత చరణ్ ఫోన్ చేశాడని చెప్పాడు చలపతి. "అతను నీతో ఏదో మాట్లాడాలట! నిన్ను బయటకి తీసుకెళ్తాడట! రెడీగా వుండు!"

అంజలిని సిగ్గు కమ్ముకుంది. చరణ్‌ని తలచుకుంటే ఆమె బుగ్గలలో వెచ్చని ఆవిర్లు వచ్చాయి. మరోపక్క అతను ఏం మాట్లాడతాడోనని కంగారు, భయం!

శ్రీదేవి మురిపెంగా కూతురిని చూస్తూ "త్వరగా ముఖం కడుక్కుని తయారవు! అతను ఓ అరగంటలో వస్తాడట!" అంది.

అంజలి లేత నీలిరంగు చీర, జాకెట్టుతో మబ్బుకన్యలా తయారయింది. చెవులకి ముత్యాల జూకాలు, మెడలో సన్నని ఒంటిపేట గొలుసు, వదులుగా వేసిన బారెడు జడ.. అద్దంలో తన ప్రతిబింబం తనకే ముద్దొచ్చింది.

కాబోయే అల్లుడు ఇంటికి వస్తున్నాడని శ్రీదేవి వంటింట్లో హడావుడి పడుతోంది.

అమృత సన్నజాజుల దండ అక్క జడలో తురుముతూ చిలిపిగా "అక్కా! ఎంత అందంగా వున్నావో తెలుసా? చరణ్ ఈపళంగా నిన్నెత్తుకు పోతాడేమోనని భయంగా వుంది" అంది.

"నోర్మూసుకో!" సిగ్గు, చిరుకోపం మిళితమైన భావంతో చెల్లెల్ని గదిమింది.

సరిగ్గా అరగంట తరువాత ఇంటి గేటు ముందు కారాగింది.

"అమృతా! అంజలిని పిలువు! చరణ్ వచ్చాడని చెప్పు!" బయటనుంచి తండ్రి స్వరం వినిపించింది.

అమృత కొంటెగా నవ్వుతూ గదిలోకి వచ్చి "అక్కా! పాపం! చరణ్ నాన్న దగ్గర కూర్చున్నాడే గానీ, నీ కోసం తెగ వెతుకుతున్నాడు. ఆ మానవుడికి నీ దర్శన భాగ్యం కలుగజేసి కరుణించు"

"నాకు భయంగా వుంది అమృతా!" అంజలి నుదుట పట్టిన చెమటను కర్చీఫ్‌తో తుడుచుకుంది.

"ఎందుకమ్మా భయం? అతనేం పెద్దపులా? "

"అంజలీ!" తల్లి పిలిచింది. "అతను నిన్ను పిలుస్తున్నాడు!"

అదురుతున్న గుండెలని చిక్కబట్టుకుని

బయటకొచ్చింది.

ఆమెని చూసి చిరునవ్వుతో "హాయ్!" అన్నాడు చరణ్.

ఆమె తల ఎత్తి ప్రతిగా, చిన్నగా "హాయ్!" అంది.

అతని చూపులు తనని నిశితంగా గమనించడం చూసి తలవంచుకుంది.

అతను కాఫీ కప్పు పక్కన పెడుతూ "వెళ్దామా? " అన్నాడు.

చిన్నగా తలవూపింది.

"మంచిది బాబూ!" అన్నాడు చలపతి.

కారులో అతని పక్కన కూర్చుంది. ఏసీ చల్లదనం.. కారు స్టీరియోలో నుంచి మంద్రంగా వినిపిస్తున్న మ్యూజిక్.. పక్కనే తనని మెచ్చిన, తన జీవిత భాగస్వామి కాబోయే వ్యక్తి.. ఆమెకి వేరే ప్రపంచంలో వున్నట్టుంది.

"నువ్వు ఈ రోజు చాలా అందంగా వున్నావు!" అన్నాడతను.

ఆమె బుగ్గల్లో రోజాపూలు చకచకా రేకులు విప్పుకున్నాయి. సిగ్గుతో తలదించుకోబోయి, చీటికీ మాటికీ తలదించుకుంటే, అపార్థం చేసుకుంటాడని తల తిప్పి అతన్ని చూస్తూ "థాంక్యూ!" అంది!

"నీ అందం చూసి మీ కాలేజీలో అబ్బాయిలు పిచ్చెక్కిపోయి వుండాలే!" అన్నాడు.

"అదేమో నాకు తెలియదు కానీ, నన్ను 'కాలేజీ బ్యూటీ' అనేవారు" చిన్నగా అంది.

"నీకు అబ్బాయిలెవరైనా లవ్ లెటర్స్ రాసేవారా? "

"లేదు! ఒకళ్ళిద్దరు సీనియర్లు డైరెక్టుగానే అడిగారు. నాకు ప్రేమ మీద నమ్మకం లేదని, మా పెద్దవాళ్ళు కుదిర్చిన సంబంధమే చేసుకుంటానని చెప్పాను" అంజలిలో క్రమంగా బెరుకు తగ్గి, ఒక ఫ్రెండుతో మాట్లాడుతున్నట్టే అతనితో మాట్లాడ్డం మొదలుపెట్టింది.

"గుడ్! ఎంతవరకు వచ్చాయి పెళ్ళిపనులు? "

"శుభలేఖలు ప్రింటయి వచ్చాయి. నిన్న మంచిరోజని దూరం వాళ్ళందరికీ పోస్టులో పంపించారు. ఇంక వూళ్ళో పిలుపులొక్కటే తరువాయి.."

"ఏ కారణం చేతనైనా మన పెళ్ళి ఆగిపోతుందనే అనుమానం లేదా మీ నాన్నగారికి? "

పక్కనే డైనమేట్ పేలినట్టు ఉలిక్కిపడింది. ఆమె ముఖంలోని నెత్తురు ఇంకిపోగా షాకింగ్‌గా చూస్తోంది.

అతను నవ్వేడు "సినిమాల్లో చూస్తూ వుంటాంగా? తల మీద జీలకర్ర బెల్లం పెట్టబోయే తరుణంలో హీరోయిన్ పీటల మీద నుంచి లేచి, తను ఎవరినో ప్రేమిస్తున్నానని, ఈ పెళ్ళి తనకిష్టం లేదని చెప్పడం.."

అంజలి ముఖం ఎర్రబడింది. "నేను ఎవరినీ ప్రేమించ లేదు" అంది.

"నేను మాత్రం ఇంజినీరింగ్ ఫస్టియర్ చదువుతుండగా ఒక అమ్మాయిని ఇష్టపడ్డాను. ఆ అమ్మాయి నా క్లాస్‌మేట్! చాలా అందంగా వుండేది. నా కంప్యూటర్ డెస్క్‌టాప్ మీద ఆమె ఫోటో చూసి మా అమ్మ అడిగితే నాకు ఆ అమ్మాయంటే ఇష్టమని చెప్పాను. మా అమ్మ పెద్ద లెక్చరిచ్చింది. 'ముందు చదువు.. తరువాతే అన్నీ..' అంది. 'నువ్వు లైఫ్‌లో సెటిలయ్యాక, ఆ అమ్మాయి మీద ఇష్టం ఇప్పటిలాగే వుంటే, ఆమె కూడా నిన్ను ఇష్టపడితే అప్పుడు చూద్దాం!' అంది"

"మరింకేం! మీరు లైఫ్‌లో సెటిలయ్యాక ఆ అమ్మాయికి ప్రపోజ్ చెయ్యలేకపోయారా? " ఇంచుక అసూయ ధ్వనించింది ఆమె స్వరంలో!

"థర్డ్ ఇయర్ చదువుతుండగానే ఆమెకి పెళ్ళయిపోయింది"

"పాపం! లేకపోతే ఆ అమ్మాయినే పెళ్ళి చేసుకునేవారన్న మాట!" ఆమె కళ్ళలో ఈర్ష్యని గమనించి నవ్వేడతను.

"ఆమె క్లాస్‌మేట్సందరినీ పెళ్ళికి పిలిచింది. నేనూ వెళ్ళాను. ఆమె పెళ్ళి చూస్తుంటే నాకు బాధనిపించలేదు. ఆ క్షణంలోనే అనిపించింది నాకు ఆ అమ్మాయిపై కేవలం ఇష్టం మాత్రమే, ప్రేమ కాదని! మనం చాలామందిని ఇష్టపడతాం! అందరినీ సొంతం చేసుకోలేంగా? "

అతని లాజిక్‌కి నవ్వొచ్చింది.

ఆమె నవ్వుని ముగ్ధుడయి చూశాడు. "నువ్వు నవ్వితే చాలా అందంగా వుంటావు! తెలుసా? "

ఆమె చెంపలు రాగరంజితమయ్యాయి.

"మరి నీ సంగతేమిటి? నువ్వు ఎవరినైనా ఇష్టపడ్డావా? "

"లేదు"

"నిజం చెప్పు!"

అంజలి ఆలోచనలో పడింది.. ఇంటర్మీడియట్ రెండో సంవత్సరం చదువుతుండగా తనని ఇష్టపడిన మహేష్ గురించి చెప్పాలా? వద్దా? అని.

"నాకు అబద్ధాలాడే వాళ్ళంటే అసహ్యం. నిజాన్ని, నిజాయితీని ప్రేమిస్తాను"

అతని స్వరంలో కోపం లేదు కానీ, ఆ స్వరంలో అంతర్లీనంగా వున్న పదును ఆమె నోరు తెరిపించింది.

"సీనియర్ ఇంటర్ చదువుతుండగా మహేష్ అనే అబ్బాయి నన్నిష్టపడ్డాడు!"

"సినిమా హీరో మహేష్‌బాబులా వుంటాడా? " నవ్వుతూ అడిగాడు చరణ్.

ఆ నవ్వు అంజలికి ధైర్యాన్నిచ్చింది. "ఫర్వాలేదు! బాగానే వుండేవాడు. చదువులో అతనెప్పుడూ క్లాసు ఫస్ట్, నేను సెకండ్ వుండేవాళ్లం! వున్నట్టుండి ఒక రోజు నా దగ్గరకి వచ్చి 'నువ్వంటే నాకిష్టం! మన చదువులు పూర్తయి లైఫ్‌లో సెటిలయ్యాక పెళ్ళి చేసుకుందాం!' అన్నాడు. అతనికేం జవాబివ్వాలో తోచలేదు నాకు. 'నీ కోసం నేను జీవితాంతం వెయిట్ చేస్తాను! నా కోసం నువ్వు వెయిట్ చెయ్యగలవా? ' అని అడిగితే 'ఒకే' అన్నాను నవ్వుతూ.. " అని చెప్పడం పూర్తి చేసి పకపకా నవ్వింది అంజలి. "ఇప్పుడు ఆలోచిస్తే అదంతా ఫూలిష్‌గా అనిపిస్తోంది. ఇంటర్ పరీక్షలయ్యాక ఎవరిదారి వాళ్ళది! నేనిక్కడ బీకామ్‌లో చేరాను. మహేష్ వాళ్ళ నాన్నగారు అతన్ని మద్రాస్‌లో ఏదో కాలేజీలో చేర్పించారని విన్నాను"

"తరువాత అతను నిన్ను కాంటాక్టు చేశాడా? "

"లేదు"

"ఇంకా మన పెళ్ళికి నెలరోజులు టైమ్ ఉంది! ఈలోగా మహేష్ నీ దగ్గరకొస్తే ఏం చేస్తావ్? "

"మన పెళ్ళికార్డు అతనికిచ్చి పెళ్ళికి పిలుస్తాను" నవ్వింది.

ఆ నవ్వులో శ్రుతి కలిపాడతను. "మన పెళ్ళికి ఇంకా నెలరోజులు టైమ్ వుందంటే అబ్బా! ఎందుకిలా ముహూర్తాలు, జాతకాలు అని చాదస్తానికి పోతారు ఈ పెద్దవాళ్ళు! మనిద్దరం ఒకరినొకరం ఇష్టపడ్డాం! ఏ కులుమనాలికో పోయి హాయిగా.." అతను అర్ధోక్తిలో ఆపి నవ్వేడు.

"మన పెద్దలు అందుకు ఒప్పుకోరు కనుక, పెళ్ళయ్యాక హనీమూన్‌కి వెళ్దాం!" అంజలి తన ఎర్రబడిన ముఖాన్ని అతను చూడకూడదని తల తిప్పుకుంది.

అతను ఫ్రాంక్‌గా, ఫెయిర్‌గా మాట్లాడిన తీరు ఆమెని ఆకట్టుకుంది. తామిద్దరూ మనసు విప్పి, ఎలాంటి దాపరికాలు లేకుండా మాట్లాడుకున్నారు. తమ సంసారంలో ఎలాంటి అపార్థాలకి తావుండదనుకుంది. కానీ, ఏం జరిగింది?

"పెళ్లికి ముందు నన్ను నీతో ఇలా ఊహించుకున్నావా? " పెళ్ళయిన మూడో రోజు ఇద్దరూ ఏకశయ్యాగతులై వుండగా అడిగేడతను.

"ఛీ! పోండి!" సిగ్గుతో ఎర్రబడిన

# అధిక రాబడి నేరాలు!

చతుర సమగ్గులు

ప్రపంచంలో అధిక రాబడిని ఇచ్చే ప్రధాన నేరాలు ఇవి. వీటిలో ఎన్ని మనదేశంలో జరుగుతున్నాయో, దినపత్రికలోని వార్తలని బట్టి మీకు తెలుసు.

★ *డ్రగ్స్:* ఎక్కువ రాబడిని ఇచ్చే నేరం డ్రగ్స్ స్మగ్లింగ్. ఏటా అంతర్జాతీయ సరిహద్దులని దాటే డ్రగ్స్ విలువ 30 వేలకోట్ల డాలర్లు! వీటిలో డెబ్బై ఐదు శాతం ఆఫ్ఘనిస్థాన్, మయన్మార్, మెక్సికో దేశాలనుంచే ఎగుమతి అవుతాయి.



★ *క్రూరమృగాల ఎగుమతి:* ఏటా చిరుతలు, పులులు లాంటి అనేక వన్యమృగాల అక్రమ రవాణా ద్వారా జరిగే వ్యాపారం విలువ 2,500 కోట్ల డాలర్లు. ఆఫ్రికా, సౌత్ఈస్ట్ ఏషియా నించి చైనాకి (మందుకోసం) యూరప్, అమెరికాలకి (పెంపుడు జంతువులుగా) ఎగుమతి అవుతున్నాయి.

★ *కలప:* ఎర్రచందనం మొదలైన వాటి అక్రమ రవాణా విలువ ఏటా 500కోట్ల డాలర్లు. మధ్య ఆఫ్రికా, ఆగ్నేయ ఆసియా, దక్షిణ అమెరికా నుంచి ఈ అక్రమ రవాణా అమెరికా, యూరప్, చైనా దేశాలకి జరుగుతోంది.

★ *బంగారం:* దీని అక్రమ రవాణా ఏటా 230 కోట్ల డాలర్లు! పెరూ రష్యా, ఉజ్జకిస్థాన్, మాలే, బ్రెజిల్, అర్జెంటీనా, పాపువా న్యూగినియాల నుంచి ఐశ్వర్యవంతమైన దేశాలకి ఇది అక్రమంగా రవాణా అవుతోంది.

★ *మానవ అవయావాలు:* నేపాల్, చైనా, పెరూ, ఇండియా, టర్కీ, బ్రెజిల్ దేశాలనుంచి మనుషుల్ని అమెరికా, కెనడా, ఇటలీ, జపాన్ మొదలైన దేశాలకి తీసుకెళ్ళి అవయవాల మార్పిడి చేస్తున్నారు. మధ్యవర్తులు 5000 శాతం లాభం ఆర్జిస్తున్నారు!

★ ***వేశ్యల సరఫరా:*** ఈ వ్యాపారం విలువ ఏడాదికి 31,600 కోట్ల డాలర్లకి సమానం! రష్యా, బ్రెజిల్, కొలంబియా, ఉత్తర ఆఫ్రికా దేశాలు.. ఇండియా, పాకిస్థాన్, చైనాలాంటి అభివృద్ధి చెందుతున్న దేశాల నుంచి ఏటా 25 లక్షల మందిని ఈ వృత్తికోసం అక్రమ రవాణా చేస్తున్నారు.

ముఖాన్ని అతని గుండెల్లో దాచుకుంది.

ఆమె చుట్టూ చేతులని బిగిస్తూ.. లాలనగా అడిగేడు "చెప్పవా?"

"ఊఁ!" అతి కష్టం మీద సిగ్గు తెరలని అవతలకి నెడుతూ అంది.

"మరి మహేష్‌తో ఊహించుకోలేదా?"

అదిరిపడింది. అప్రయత్నంగానే అతని నుంచి దూరంగా జరిగిపోయి, దిగ్గున లేచి కూచుంది.

"ఏమంటున్నారు మీరు?" ముఖంలో నెత్తురు ఇంకిపోయి.. పెదవులు వణుకుతుండగా అడిగింది.

"మహేష్ పెళ్ళి ప్రపోజల్‌ని ఓకే చేశావుగా? అతన్ని పెళ్ళి చేసుకున్నాక అతనితో బెడ్ మీద ఇలా వుండడాన్ని ఊహించుకోలేదా?"

క్రోధావమానాలతో మనశ్శరీరాలు దహించుకు పోతుండగా అంది "మీరు మీ క్లాస్‌మేట్‌ని ఇష్టపడ్డారుగా? ఆ అమ్మాయితో కాపురం చేస్తున్నట్టు ఊహించుకున్నారా?"

ఛెళ్లుమంది! ఆమె చెంప. "నేను మగవాడిని! ఊహలలోనే కాదు, నిజంగానే పది మందితో తిరుగుతాను" పళ్ళుకొరుకుతూ ఆమె జడపట్టి గుంజాడతను.

"నిజం చెప్పు! మహేష్‌తో ఊహలలో

ఎన్నిసార్లు పడుకున్నావు? "

అతను కొట్టిన దెబ్బకి చెంప భగభగ మండుతోంది, అవమానాగ్నితో మనసు మరింత మండుతోంది. ఏడుస్తూ అంది "మహేష్‌ని ఒక ఫ్రెండుగానే భావించాను! పెళ్ళి గురించి.. సెక్సు గురించి ఆలోచించే వయసు కాదది! చదువు తప్ప, నాకు వేరే ప్రపంచం లేదు! నన్ను నమ్మండి!" అంది.

"ముందు ఏడుపు ఆపు! ఏడ్చేవాళ్ళంటే నాకసహ్యం!" అతని స్వరంలోని పదునుకు ఆమె ఏడవడం మరచిపోయింది.

"వెళ్ళి ముఖం కడుక్కుని రా!" ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు.

యాంత్రికంగా బాత్‌రూమ్‌లోకి నడిచింది. వాష్‌బేసిన్ దగ్గరున్న అద్దంలో ముఖాన్ని చూసుకుంది. చెంపపై అతని చేతి వేళ్ళ తాలూకు ముద్ర! పెదవి చివర రక్తపు చారిక..! చూడగానే ఆమెలో దుఃఖం పొంగి వచ్చింది. దాంపత్య జీవితం మొదలుపెట్టిన రెండో రోజునే అతను తన గురించి అంత నీచంగా ఎలా ఆలోచించగలిగాడు? కొన్ని నిమిషాల కిందట తన ముఖాన్ని ముద్దులతో ముంచెత్తిన అతను, కొద్దిసేపటికే తనని చెంపదెబ్బ ఎలా కొట్టగలిగాడు? ఏడుస్తున్న ఆమెకి జవాబు దొరికింది. అతను తనని అవమానించాడనే కోపంతో, అతన్ని తనూ అదే ప్రశ్న అడిగింది. మగవాడు! పైగా మొగుడు! అహం గాయపడి తనపై చెయ్యిచేసుకున్నాడు. అతను సంస్కారహీనంగా ఆ ప్రశ్న అడిగాడు! మరి తన సంస్కారం ఏమయింది? తను అలా అడగకూడదు! మహేష్‌ని తను ఎప్పుడో మరచిపోయానని తను మానసికంగా కూడా పవిత్రురాలేనని చరణ్‌కి నచ్చచెప్పాల్సింది.

అయినా అవమానం తాలూకు బాధ ఆమె మనసులో పచ్చిగా వుంది. ఆమెకి ఆ గదిలో నుంచి, అతని దగ్గర నుంచి దూరంగా ఎక్కడికైనా పారిపోవాలన్పిస్తోంది. తప్పనిసరిగా గదిలోకి వచ్చింది.

"అంజలీ!" మార్దవంగా పిలిచాడు.

ఆమెకి తల ఎత్తి అతని ముఖంలోకి చూడాలని లేదు.

"నేను నిన్ను అవమానించాను.. కొట్టాను.. నన్ను క్షమించు!" అతని స్వరంలో పశ్చాత్తాపం.. దుఃఖం!

ఆమె కరిగిపోయింది. "ఛ! అదేమిటండీ! మీరు నన్ను క్షమాపణ అడగడమేమిటి? నేనే మిమ్మల్ని క్షమాపణ అడగాలి! నేను మీతో అలా మాట్లాడి వుండకూడదు!"

"మన మధ్య ఎప్పుడూ మళ్లీ ఈ ప్రస్తావన రాదు.. రాకూడదు" అతనామెను దగ్గరికి తీసుకున్నాడు. ఆమె అతని కౌగిలిలో ఒదిగిపోయింది.




"**అం**జలీ! త్వరగా తయారవ్వు! బయటకి వెళ్దాం!" ఒకరోజు సాయంకాలం ఇంటికి వస్తూనే హడావుడి పెట్టాడు చరణ్.

"ఎక్కడికి? " అతనికి కాఫీ అందిస్తూ అడిగింది.

"నా ఫ్రెండ్ రామ్ అని ఒకతను ఛార్టెడ్ అకౌంటెంట్.. అతని కొడుకు బర్త్‌డే పార్టీ"

"సరే!" వంటింట్లోకి వెళ్లి తను కూడా కాఫీ తెచ్చుకుంది. అన్నట్టు నీ మహేష్ కూడా పార్టీకి వస్తాడేమో! అతనూ ఇంటర్లో కామర్స్ తీసుకున్నాడుగా?

బీకామ్ చేసి సీఏ చేశాడేమో! ఏమో! ఈ వూళ్లోనే వుండి వుండొచ్చు! అతను నా ఫ్రెండుకి ఫ్రెండయి వుండొచ్చు!"

అంజలి ముఖం వివర్ణమయింది.

"నేను పార్టీకి రాను"

"ఏం? మహేష్‌ని చూస్తే తట్టుకో లేవా? "

ఆమె హఠాత్తుగా అతని పాదాల దగ్గర కూలబడి, అతని పాదాలని రెండు చేతులతో పట్టుకుంది. "నన్ను నమ్మరా? అతన్ని నేనెప్పుడో మరచిపోయాను" అంది ఏడుస్తూ.

"అరె! ఇప్పుడు నేనేమన్నానని? అయినా 'రాజుని చూసిన కళ్ళతో మొగుడిని చూస్తే మొత్తబుద్ధి అవుతుంది' అనే సామెత వుండనే వుందిగా? మహేష్‌ని చూసిన కళ్ళతో నన్ను చూస్తే ఏవగింపు కలుగుతుందేమో!" వంకరగా నవ్వేడు.

"నేనేం చేస్తే నాపై మీకు నమ్మకం కలుగుతుంది? " హృదయ విదారకంగా ఏడుస్తోంది.

"ఏడ్చేవాళ్ళంటే నాకసహ్యమని చెప్పానా? లేదా? ఏడుపు ఆపు" కసిరాడు.

"నేను పార్టీకి రాను! ఇవాళేకాదు ఎప్పుడూ, ఎక్కడికీ రాను" వెక్కుతూ అంది.

"వచ్చి తీరాలి!" శాసిస్తున్నట్టు అన్నాడు.

అంజలి బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది. ఆమెకి అతనితో బయటకి వెళ్ళాలని లేదు. తను రానంటే ఎంత గొడవచేస్తాడో తెలుసు. స్నానం చేసి వచ్చి బీర్వాలో నుంచి చేతికి అందిన చీర తీసికట్టుకుంది.

"ఇదేం చీర? నా పక్కన పనిమనిషిలా వుంటావు? " ఆమె కట్టుకున్న చీర చూసి ముఖం చిట్లించాడు చరణ్. అతనే బీర్వా తెరచి చీర సెలెక్టు చేశాడు.

"ఈ చీర కట్టుకుని, డైమండ్ సెట్ పెట్టుకో" చెప్పి బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

అంజలి అతను కట్టుకోమన్న చీర కట్టుకుని, నిరాసక్తంగా అలంకరించుకుంటోంది. ఆమెకి చరణ్ మనస్తత్వం బాగా అర్థమయింది. అతని భార్య అందంగా వుండాలి! అతని హోదాకి తగ్గట్టు చీరలు.. నగలతో అలంకరించుకోవాలి! కానీ ఆమెకి మనసనేది వుండకూడదు. మాటలతో మనసుని ముక్కలు చేస్తాడు. మరోగంట తర్వాత షాపింగ్‌కి తీసుకెళ్లి చీరలు, నగలు కొంటాడు. అతను మనసుకి చేసిన గాయాలు సలుపుతుంటే, అతను కొన్న చీరలు.. నగలు ధరిస్తే శవానికి అలంకారం చేసినట్టు అనిపిస్తుంది.

ఆమెకి పెళ్ళయిన కొద్దిరోజుల్లోనే ఎందుకీ పెళ్ళి చేసుకున్నానా? అనే విరక్తి కలిగింది. అతనితో కలిసి వుండాలని లేదు. అలాగని తెగించి వివాహ సంబంధాన్ని ముక్కలు చేసుకోలేదు. అనుక్షణం చస్తూ బతుకుతున్న ఆమెకి తను చేసిన తప్పేమిటో ఇప్పటికీ అర్థం కావడంలేదు. పదిహేడేళ్ళ వయసులో మహేష్ తన ముందుంచిన ప్రపోజల్ విషయాన్ని అతనితో చెప్పడమే తను చేసిన తప్పా? ఆమె కళ్ళు మాటిమాటికీ తడవుతున్నాయి. లోకం దృష్టిలో తనెంతో అదృష్టవంతురాలు! కానీ, తనెంత దురదృష్టవంతురాలో తనకే తెలుసు.

"అంజలీ!" చరణ్ బిగ్గరగా పిలిచాడు.

"వస్తున్నానండి!" అంటూనే బయటకొచ్చింది. అతనామెని ఆపాదమస్తకం ప్రశంసగా చూశాడు.

కారు తాళాలని అందుకుంటూ "పద!" అన్నాడు.

బలికి తీసుకెళుతున్న మేకపిల్లలా అమె అతన్ని అనుసరించింది.

★ ★ ★

"తను నా మిసెస్ అంజలి" పరిచయం చేశాడు చరణ్. కొన్ని జతల కళ్ళు ఆమెని ప్రశంసగా చూశాయి.

"లక్కీ ఫెలోవిరా!"

"గుడ్ సెలెక్షన్"

"సెలెక్షన్ ఆఫ్ ది డ్రెస్, సెలెక్షన్ ఆఫ్ ది వైఫ్.. రెండూ మగవాడి జీవితంలో రెండు ఆర్ట్స్ అంటారు. నిన్ను చూస్తే ఆ రెండూ నిజమనిపిస్తోంది"

ప్రశంసల వర్షంలో తడిసి ముద్దవుతూ "థాంక్యూ గైస్" అన్నాడు చరణ్. అతని స్వరంలో గర్వం.

అంజలికి తన ఫ్రెండ్స్‌ని పరిచయం చేశాడు. ఆమె చిరునవ్వుతో అందరికీ నమస్కరించింది. ఖాళీగా వున్న టేబిల్ దగ్గర సెటిలయ్యారు ఇద్దరూ. చుట్టూ రకరకాల మనుషులు.. రకరకాల వస్త్రధారణలు.. పిల్లల కేరింతలు.. ఆటపాటలొక పక్క! బర్త్‌డే పార్టీ కావడం వల్ల పిల్లలు చాలా మందివున్నారు. వాళ్ళని ఎంటర్‌టెయిన్ చెయ్యడానికి మేజిక్ షో ఏర్పాటు చేశారు. అంజలి కూడా ఆసక్తిగా మేజిక్ షో చూడ సాగింది.

ఉన్నట్టుండి చరణ్ తన భుజం మీద తట్టడంతో ఉలిక్కిపడి చూసింది.

"అదుగో! ఆ లైట్ బ్లూ షర్టులో వున్న తను నిన్నే చూస్తున్నాడు" అన్నాడతను.

అంజలి అతను చూపించిన వైపు చూసింది. ఆ వ్యక్తి తదేకంగా తననే చూస్తుండడంతో ఇబ్బందిగా తల తిప్పుకుంది.

"చూశావా? "

"ఆс!"

"అతను మహేషేనా? "

వేటగాడి బాణం దెబ్బకి నేల కూలిన పావురంలా చూసింది అంజలి.

"చెప్పు! వాడు మహేషేనా? "

"నాకు తెలియదు"

"నేను కనుక్కుంటాను" ఛరాల్న లేచి ఆ యువకుడి వైపు కదిలాడు. అంజలి ఆందోళనగా చూస్తోంది. 'అతను నిజంగా మహేష్ అయితే తన వైపు చూస్తున్నందుకు తననేమంటాడో? అతన్నేమంటాడో? ' ఆమె గుండె వేగం పెరిగిపోయింది. భయవిహ్వలంగా అటే చూస్తోంది.

చరణ్ నవ్వుతూ ఆ యువకుడితో కరచాలనం చేసి ఏదో అడుగుతున్నాడు. అతనేదో చెబుతున్నాడు. సరిగా రెండు నిమిషాలపాటు ఆ సంభాషణ జరిగింది. చరణ్ అతనితో కరచాలనం చేసి అంజలి దగ్గరకొచ్చాడు.

"అతని పేరు చంద్రశేఖరట! సాఫ్ట్‌వేర్ ఇంజనీరట! నిన్ను కళ్ళప్పగించి చూస్తుంటే మహేష్ అనుకున్నాను. అయినా ఎలాంటి వాళ్ళనైనా చిత్తుచేసే అందం నీది! అతనే కాదు చాలామంది నిన్ను అలాగే చూస్తున్నారు" చుట్టూ చూస్తూ అన్నాడు.

అంజలి తల ఎత్తలేదు. అప్పటికి గండం గడిచినందుకు సంతోషించింది.

★ ★ ★

"ఇంటికొస్తుండగా ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర కారు ఆగినప్పుడు ఓ తమాషా జరిగింది" అన్నాడు చరణ్ ఆ రాత్రి భోజనం చేస్తూ.

"ఏమిటది? " అన్నం పళ్ళెం మీద నుంచి కళ్ళెత్తి చూస్తూ అడిగింది అంజలి

"మహేష్ కనిపించాడు!"

నిర్వికారంగా అతన్ని చూసింది.

"ఎలా వున్నాడో తెలుసా? జడలు కట్టిన జుట్టు.. బారెడు గడ్డం.. ఒంటి మీద చీలికలయిన బట్టలు.. 'అంజలీ! అంజలీ!' అని అరుస్తున్నాడు"

అంజలి చేతిలోని ముద్ద జారి కంచంలో పడింది.

'మహేష్ పిచ్చివాడయిపోయాడా? పిచ్చివాడయిపోయేంత ప్రేమించాడా తనని!' వివర్ణమైన ఆమె ముఖాన్ని నిశితంగా చూస్తూ కూల్‌గా అన్నాడు "దొరికిపోయావ్!"

"ఏమిటీ? " ఉలిక్కిపడింది.

"మహేష్‌ని నువ్వు ప్రేమించనప్పుడు అతనేమయిపోతే నీకెందుకు? "

"మానవత్వం! కేవలం మానవత్వం!" స్పష్టంగా అంది.

"అవునా?" వ్యంగ్యంగా నవ్వేడు. "నువ్వు వాడినింకా మరచిపోలేక పోతున్నావని మాత్రం ఒప్పుకోవు!"

నిస్సహాయంగా చూస్తూ అంది "మీకు నాపై నమ్మకం లేదు. అది నా దురదృష్టం" ఆమె కన్నీటిని ఆపుకోడానికి విశ్వ ప్రయత్నం చేస్తూ అన్నం ముందు నుంచి లేవబోయింది.

"నేను చెప్పిందంతా అబద్ధం! మహేష్‌ని నేను చూడలేదు. అసలు ఏ పిచ్చివాడినీ చూడలేదు" కూల్‌గా అన్నాడు. "నీ రియాక్షన్ తెలుసుకోడానికే అలా చెప్పాను. నువ్వు హేపీగా అన్నం తిను"

అంజలికి అన్నం తినాలని లేదు. కడుపులో వికారం ఎగదన్నుకొస్తోంది. లేచి చెయ్యి కడిగేసుకుంది.

"ఏం? తినవేం?"

"నాకు వికారంగా వుంది"

"మనసు ఆందోళనగా వుంటే అలాగే వుంటుంది"

ఆమె మౌనంగా తన కంచాన్ని తీసి వంటింట్లో సింక్‌లో పడేసింది.

తను నెల తప్పానేమో అని అనుమానం వస్తోంది. నాలుగు రోజులుగా వికారంగా వుంటోంది. ఏం తిన్నా వాంతవుతోంది.

"నేనొకసారి డాక్టరు దగ్గరకి వెళ్ళిరావాలి" మరునాడు అడిగిందతన్ని.

"ఏం?"

"ఒంట్లో బాగాలేదు"

"పద! వెళ్దాం!"

ఇద్దరూ బయలుదేరారు. డాక్టరు ఆమెని కొన్ని ప్రశ్నలడిగి, పరీక్షించి ఆమె గర్భవతి అని నిర్ధారించింది.

డాక్టర్ ఏం చెప్పారని అతను అడగలేదు. ఆమెకి ఎలా చెప్పాలో తెలియలేదు. ఆమెని ఇంటి దగ్గర దింపి అతను హడావుడిగా ఆఫీసుకి వెళ్ళాడు.

అంజలి మనసులో ఇదీ అని చెప్పలేని సంతోషం. తను తల్లి కాబోతోంది. భర్త తనతో సుఖపడిన దానికి ఫలితంగా తన

## కొత్తగాలి...

**చెదిరిన బాల్యం**
**చదువుల్లేక**
**చౌరస్తాల్లో చిన్నారులు**
**యాచకుల్లా!**

– వి.యం. కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్., హైదరాబాద్

గర్భంలో అతని బిడ్డ ఊపిరి పోసుకుంటోంది. అతను ఎప్పుడూ ప్రేమతో తనకి చేరువకాలేదు. కోరికతో వేగిపోతూ దగ్గరయ్యేవాడు. మనసులో అతను గుచ్చిన ముళ్ళు గాయం చేసి, రక్తం స్రవిస్తుండగా, కన్నీళ్ళని రెప్పల చాటున అదిమిపట్టి శరీరాన్ని అతనికి అప్పగించింది. తనని ప్రేమించలేని అతను, పుట్టబోయే బిడ్డని ఎలా ప్రేమించగలడు? అనే ప్రశ్న ఆమె మనసులో ఉదయించింది. ఇది ఆమె దృష్టిలో అవాంఛిత గర్భమే! అబార్షన్ చేయించుకుందామా? అనుకుంది. కానీ మరుక్షణం ఆ ఆలోచన వచ్చినందుకు తనని తాను నిందించుకుంది. ఆమె స్త్రీ! ఆమెలోని మాతృహృదయంలో ఇంకా రూపుదాల్చని మాంసపు ముద్దగా వున్న ఆ బిడ్డపై మమతానురాగాలు ఉప్పొంగాయి.

కడుపుపై సుతిమెత్తగా వేళ్ళానించి 'నాకు నువ్వు కావాలిరా కన్నా! కనీసం నువ్వు ఈ భూమి మీదకొచ్చయినా పాషాణం లాంటి మీ నాన్న మనసులో ప్రేమ.. మమతలని మొలకెత్తించాలి' అనుకుంది ఆర్ద్రంగా!

రాత్రి చరణ్ ఇంటికొచ్చేప్పటికి ఆమె వాంతి చేసుకుంటోంది.

"ఏమయింది?" అడిగాడు.

ఆమె నోరు పుక్కిలించి ఇవతలకి

వచ్చింది.

"వారం బట్టి ఇలాగే వుంటోంది! డాక్టరు వాంతులు తగ్గడానికి మాత్రలు రాసి చ్చారు. పొద్దుట మీరు ఆఫీసుకి వెళ్ళే తొందరలో వున్నారని చెప్పలేదు. డ్రైవర్‌ని పంపి మందులు తెప్పించండి!" ప్రిస్క్రిప్షన్ అతనికి అందించబోతూ అంది.

"అసలేమిటి అనారోగ్యం? "

"నేను.. నాకు.. మీరు తండ్రి కాబోతు న్నారు" సిగ్గుపడుతూ చెప్పింది.

రెండు క్షణాలు ఆ గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది.

ఆ శుభవార్త వినగానే అతను తనని సినిమాల్లో హీరోలా ఎత్తుకుని గిరగిర తిప్పుతాడనుకోలేదు. కానీ దగ్గరకి తీసు కుని ముద్దు పెట్టుకుంటాడని అనుకుంది.

"నాన్సెన్స్!" అసహనంగా వుందతని స్వరం. "అప్పుడే మనకి పిల్లలు అవస రమా? కనీసం మూడేళ్ళ తర్వాత ఆలో చించవలసిన మాట అది! అబార్షన్ చేయించుకో!"

"పిల్లలు ఇప్పుడే వద్దనుకుంటే ముందు జాగ్రత్త పడవలసింది. మనం చేసిన తప్పుకి ఒక చిన్నప్రాణిని చంపడం మహా పాపం!"

"పాపపుణ్యాల ప్రసక్తి అనవసరం! ఇంత కడుపు వేసుకుని నువ్వు ఇంట్లో తిరుగు తుంటే నాలో కోరిక కూడా చచ్చిపోతుంది. నువ్వెప్పుడూ స్లిమ్‌గా వుండాలి! పిల్లలు పుడితే నీ అందం నాశనమయిపోతుంది! రేపే డాక్టర్ దగ్గరకి వెళ్ళి అబార్షన్ చెయ్యమని అడుగు! పిల్లలు కావాలనుకున్నప్పుడు కందాం!" నిష్కర్షగా చెప్పాడు.

ఆమెకి ఏడుపు వచ్చింది.

ఈ సమస్య తల్లితో చెప్తే మాత్రం ఆవిడేం పరిష్కారం చూపిస్తుంది. గొప్పింటి సంబంధం తనని వెతుక్కుంటూ వచ్చిందని, తను సుఖంగా వుందని వాళ్ళు సంతోషిస్తున్నారు. తను అనుక్షణం నర కాన్ని అనుభవిస్తోందని వాళ్ళకి తెలిస్తే, పోనీ అత్తగారితో చెబుదామంటే ఆవిడకి తన బిజినెస్ తప్ప ఏమీ పట్టదు. ఆవిడ తనతో మాట్లాడేదే తక్కువ. ఒకటి రెండు సార్లు ఫోన్‌లో పలుకరించిందంతే!

అంజలికి ఆ రాత్రి నిద్ర కరువయింది. భర్తకిష్టంలేని ఈ గర్భాన్ని విచ్ఛిన్నం చేసు కోడమొక్కటే మార్గమా? అతనికి తను నచ్చచెప్తే వినడు! కన్నీళ్ళు పెట్టుకుంటే కర గడు! కాళ్ళు పట్టుకుని ప్రాధేయపడినా కని కరించడు! 'ఇంత కడుపేసుకుని నువ్వు ఇంట్లో తిరుగుతుంటే నీపై కోరిక కూడా చచ్చిపోతుంది..' అతను అన్న మాటలు గుర్తొచ్చాయి. ఆమె మనసుని సన్నని దారంతో ఎవరో ఉరివేసిన బాధ. అతను తనని భార్యగా కాదు.. ఒక భోగ వస్తువు గానే చూస్తున్నాడు. ఆమె కన్నీరు వరద గోదావరి అయింది.

మరునాడు అతను ఆఫీసుకి ఫోన్ చేసి మేనేజరుకి ఏవో సూచనలు ఇచ్చాడు. తను మధ్యాహ్నానికి ఆఫీసుకి వస్తానని చెప్పాడు.

"త్వరగా తెములు! డాక్టరు దగ్గరకి వెళ్దాం!"

"అబార్షన్ తరువాత ఇంట్లో నేను ఒక్క తినీ ఎలా మేనేజ్ చెయ్యగలుగుతాను? కనీసం మా అమ్మ వచ్చేవరకు..? "

మధ్యలోనే అడ్డుపడ్డాడు. "ఎవరికీ తెలియనవసరం లేదు. ఏదో పెద్ద ఘనకార్యం చేసినట్టు.." చిరాగ్గా అన్నాడు.

మనసులో ఏడుస్తూ తయారయి వచ్చింది.

మరునాడు ఉదయమే అంజలికి అబార్షన్ చేసింది డాక్టరు. ఆమె ఎనస్తీషియా మత్తు నుంచి బయటపడకముందే అతను ఆఫీసుకి వెళ్ళాడు.

ఆమె మత్తునుంచి తేరుకుంటుండగా నర్స్ వచ్చి చెప్పింది "సార్ హాస్పిటల్ బిల్లు కట్టేశారని, మీరు కావాలంటే ఇంటికి

కొత్తగాలి...

**దీపకాంతి దాగదు**
**ప్రసరిస్తుంది!**
**మంచి మనిషి ఆగడు**
**స్పందిస్తాడు!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

వెళ్లొచ్చు" అని. పక్కనే టేబిల్ మీద ఆమె వాడవలసిన మందులు, కొబ్బరి బొండాలు వున్నాయి.

"కొబ్బరిబొండాం తాగుతారా? "

ఆమె తలవూపి నర్సు సాయంతో కొబ్బరినీళ్ళు తాగింది.

"ఇంటికి వెళ్తారా? కాస్సేపు ఇక్కడే రెస్టు తీసుకుంటారా? "

అంజలికి ఇంటికి వెళ్ళాలని లేదు. అతని ముఖాన్ని చూడాలని లేదు. పెళ్ళయి ఆరు నెలలు కాకుండానే ఎన్ని చేదు అనుభవాలని చవిచూసింది. అతనితో జీవితం చివరి వరకు కలిసి బతకగలదా? ఆమె గుండెల్లో గుబులు! కానీ అతనికి దూరంగా ఎక్కడికి పారిపోగలదు?

"ఇంటికి వెళ్తాను" అంది.

కారిడార్‌లో వేచి చూస్తున్న డ్రైవర్‌ని నర్సు పిలుచుకొచ్చింది.

"సార్ ఎక్కడున్నారు? "

"ఆఫీసులో వున్నారు మేడమ్!"

"ఇంటికి తీసుకెళ్ళు నన్ను"

ఎనస్తీషియా వల్లనో? ఏమో? ఇంకా మత్తుగానే వుందామెకి.

లక్షలకొద్దీ డబ్బు లేకపోయినా ఎంత గారంగా, ప్రాణంగా పెంచాడు తండ్రి తమని! తల్లి తన బారెడు జుట్టుని దువ్వి రెండు జడలు వేసి 'నా తల్లి బంగారు బొమ్మ' అని మురిసిపోయేది. వెన్నెల్లో కూర్చుని తిన్న తల్లి చేతి గోరుముద్దలు, తండ్రి చెయ్యి పట్టుకుని పార్కుకి వెళ్ళడం బొమ్మల కోసం అమృత, తను తగాదా పడడం అన్నీ గుర్తొస్తున్నాయి. ఆ మగతలో ఆమెకి బంగారు బాల్యంలోని తీపి జ్ఞాపకాలు మనసంతా మధురిమను నింపాయి.

"అమ్మగారూ! ఇంటికొచ్చాం!" డ్రైవరు పిలుపుతో ఉలిక్కిపడి కారు దిగింది.

పనిమనిషి గేటు దగ్గర ఎదురుచూస్తోంది. ఆమె చెయ్యి పట్టుకుని లిఫ్ట్ వరకు నడిపించింది.

ఇంట్లోకి అడుగుపెడుతూ పరిసరాలని విచిత్రంగా పరికించింది.

ఇదేమిటి? ఇప్పటిదాకా తనకి గోరుముద్దలు తినిపించిన తల్లి ఏమయింది? తన చెయ్యి పట్టుకుని పార్కుకి తీసుకెళ్ళిన తండ్రి ఏమయ్యాడు? అన్నట్టు తనకి పెళ్ళయింది కదూ? ఈ ఇల్లు చరణ్‌ది. ఆమెకి భర్త గుర్తు రాగానే నవనాడులూ కుంగిపోతున్నట్టు అయింది. నిస్త్రాణగా బెడ్‌రూమ్‌లోకి వచ్చి మంచం మీద వాలిపోయింది. మళ్ళీ మగత.. నిద్ర.. కొండచిలువ తనను చుట్టుకుంటోంది. తన శరీరం దాని బలమైన పట్టులో నుంచి బయట పడలేక గిజగిజలాడుతోంది. దాని ముఖాన్ని తన ముఖం మీద పెట్టి, తన పెదవులని ముద్దుపెట్టుకోడానికి ప్రయత్నిస్తోంది. అరె! దాని ముఖం మనిషి ముఖంలా వుందేమిటి? అది చరణ్‌ది!

ఆమె కెవ్వున అరిచి, లేచి కూర్చుంది. స్వేదమయమైన ఆమె శరీరం భయంతో కంపిస్తోంది.

"అమ్మగారూ! ఏమయిందమ్మా? " పనిమనిషి గాభరాగా అడుగుతోంది.

"మంచినీళ్ళు కావాలి" హీనస్వరంతో అడిగింది.

ఆమె తెచ్చిన నీళ్ళు తాగి, పైటకొంగుతో ముఖం తుడుచుకుంది.

"కాఫీ తాగుతారామ్మా? "

"కొంచెం.."

పనమ్మాయి తెచ్చిన కాఫీ తాగి, స్నానానికి వెళ్ళింది.

స్నానం చేసి వచ్చేప్పటికి వేడిగా ఇడ్లీలు తెచ్చింది ఆమె.

"నాకు తినాలని లేదు ముత్యాలు!"

"తిని మాత్రలు వేసుకోవాలమ్మా!"

ఆమె బలవంతంపై ఇడ్లీ తిని, టాబ్లెట్లు మింగింది. పొద్దుట జరిగిన సంఘలనలన్నీ వరుసగా గుర్తొచ్చాయి.

ఆమెని హాస్పిటల్లో దింపి ఆఫీసుకి వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు చరణ్.

"మీరు నా దగ్గర వుండరా? నాకు భయం వేస్తోంది" బేలగా అడిగింది.

"నేనుండి ఏం చెయ్యను? నీకు బెడ్ పాన్ పెట్టాలా? " దురుసుగా అన్నాడు. "చాలా చిన్న ఆపరేషను. అయినా ఎనస్తీషియా ఇస్తారుట! నీకేం బాధ తెలియదు. నాకు ఆఫీసులో చాలా పని వుంది. నేను వెళ్తున్నాను" బూట్లు టకటకలాడించుకుంటూ వెళ్ళిపోయాడు.

తనపై కనీసపు ప్రేమని, శ్రద్ధని చూపించడం లేదనే బాధని, తన కడుపులోని చిన్నప్రాణిని అతని వత్తిడి వల్లే చంపుకుంటోందనే బాధ డామినేట్ చేసింది.

రాత్రి పది గంటలకి ఇంటికొచ్చాడు చరణ్. కనీసం ఎలా వుందని ఆమెని పలుకరించలేదు.

"నువ్వు నీ వస్తువులన్నీ తీసుకుని మరో బెడ్‌రూములో పడుకో! పేషెంటు పక్కన నాకు నిద్రపట్టదు" అన్నాడు.

'తను పేషెంటా? ' ఆమె విచలితంగా అతన్నే చూస్తోంది. అతను చేసిన పనికి మానసికంగా, శారీరకంగా శిక్షననుభవిస్తోంది. జరిగిన పాపంలో తనకేమి వాటా లేనట్టు, తనకేమి పట్టనట్టు హాయిగా వున్నాడతను. ఆమె తన బట్టలు వగైరా తీసుకుని మరో బెడ్ రూములోకి వెళ్ళింది.

ఆమెకి తల్లీ తండ్రి గుర్తుకొచ్చారు.

## కొత్తగాలి...

**ఫేసు బుక్కు ఫిల్మ్ బుక్కు**
**ఇ. బుక్కు ఆ బుక్కూ**
**అన్ని బుక్కులూ**
**అసలు బుక్కుకి ఎసరు!**

– జి.జి.కె. రావు,
శ్రీకాకుళం

పెళ్ళయి ఇక్కడికి వచ్చాక మళ్ళీ పుట్టింటికి వెళ్ళలేదు తను.

'మా అమ్మని చూడాలని వుంది వెళ్ళనా? ' అని ఒకసారి చరణ్‌ని అడిగి భంగపడింది.

"మీ అమ్మని చూడాలనా? మహేష్‌ని చూడాలనా? వాడు ఆ ఊళ్ళోనే వున్నాడా? "

తరువాత ఇంకెప్పుడూ పుట్టింటికి వెళ్తానని అతన్ని అడిగే సాహసం చెయ్యలేకపోయింది. వారానికి రెండుసార్లు వాళ్ళతో ఫోన్‌లో మాట్లాడ్డమే! మనసులోని దుఃఖాన్ని అణచుకుని సుఖంగా వున్నానని నమ్మబలుకుతూ నటిస్తూనే వచ్చింది ఇన్నాళ్ళూ. చరణ్ నిజస్వరూపం ఎలాంటిదో తెలిస్తే, వాళ్లు బాధపడతారు. ఎప్పటికీ తన బాధలని వాళ్ళతో చెప్పకూడదు.

★ ★ ★

నెలరోజుల్లో అంజలి మామూలు మనిషి అయింది. టైముకి భోజనం, పాలు, పండ్లరసాలు వంట మనిషి అందించేది. ఆమె తాగనంటే "అయ్యగారు నన్ను కోప్పడతారమ్మా!" అనేది.

'అతనికి తనపై ప్రేమ అనేది ఈషణ్మాత్రమూ లేదు. కానీ తను త్వరగా కోలుకోవాలని అతని ఆశ. అతనికి తన శరీరం కావాలి. అందుకే తనపై ఇంత

శ్రద్ధ..' అనుకుంది విరక్తిగా.

ఆ రాత్రి పెందరాళే ఇంటికొచ్చాడతను. ఇద్దరూ కలిసే భోజనం చేస్తున్నారు.

"రేపు డాక్టరు దగ్గరకి వెళ్ళు!"

దేనికన్నట్టు చూసింది.

"నువ్వు నార్మల్ లైఫ్‌కి ఎప్పుడు రావచ్చో చెబుతారని! అయినా చదువుకున్న దాని వయి వుండీ ఇంత ఫూలిష్‌గా ఎలా బిహేవ్ చేశావో నా కర్థం కావడం లేదు"

'మీరు కూడా చదువుకున్నవాళ్ళే కదా! అప్పుడే పిల్లలు వద్దనుకుంటే మీకు మాత్రం జాగ్రత్త పడాలని తెలియదా?' అంజలి మనసులోనే అనుకుంది.

మరునాడు డాక్టరు దగ్గరకి వెళ్ళినప్పుడు ఆవిడ "మరో నెల రోజులు జాగ్రత్తగా వుంటే చాలు!" అంది.

కానీ అంజలి చరణ్‌తో 'రెండు నెలలు రెస్టుగా వుండమన్నారు' అని అబద్ధం చెప్పింది. అతనితో పక్క పంచుకోడం ఆమెకి నరక సదృశం. ప్రేమలేని సెక్స్ రేప్‌తో సమానం ఆమె దృష్టిలో! అతనితో మళ్ళీమళ్ళీ రేప్ చేయించుకోడం ఆమెకిష్టం లేదు. ఆ క్షణంలో అతని ముఖంలో కని పించిన నిరాశ చూసి ఆమె స్త్రీ హృదయం క్షణకాలం మెత్తబడింది. కానీ మరుక్షణం తనని ఒక భోగవస్తువులా చూసే అతని ధోరణి ఆమెలో తిరస్కారాన్ని, ఏవగింపునీ కలిగించింది. ఆ రాత్రి ఒంటరిగా పడు కున్న ఆమె, తనపట్ల అతని అమానుష ప్రవర్తనని పునస్సమీక్షించుకుంది.

'అతని ప్రవర్తన ఘోరంగానే వుంది! నిజమే! కానీ అతన్ని మార్చే ప్రయత్నం చేసిందా? ఏ మనిషీ పుట్టుకతో చెడ్డవాడు కాదు. పరిస్థితుల ప్రభావంతో మంచివా డూ చెడ్డవాడిగా మారే ప్రమాదం వుంది. చరణ్‌తో మాట్లాడాలి! అతనిలో మార్పు కోసం ప్రయత్నించాలి!' అనుకున్న ఆమె మనసునేదో ప్రశాంతత అలుముకుంది.

ఉదయం ఆరుగంటలకి మెళుకువ వచ్చి లేచి బయటకొచ్చింది. అప్పుడే బెడ్‌రూము తలుపు తీసుకుని బయటకొచ్చాడు చరణ్. అతని వెనుకనే ఎవరో అపరిచిత యువతి!

ఆమె భ్రుకుటి ముడిపడగా ఆ ఇద్దరినీ చూడసాగింది.

"నా ఫ్రెండు సుస్మిత! రాత్రి ముంబయి నుంచి వచ్చింది. నన్ను సర్ప్రయిజ్ చేద్దా మని ముందుగా చెప్పలేదట!" అంజలికి పరిచయం చేస్తున్నట్టు అన్నాడు చరణ్.

"హాయ్!" అందామె స్టయిల్‌గా!

"హాయ్!" అంది అంజలి, తెచ్చి పెట్టు కున్న నవ్వుతో!

తెల్లటి శాటిన్ నైటీలో ఆమె ఒంపు సొంపులు బహిర్గతమవుతున్నాయి. మగ వాడిని కవ్వించే అందం ఆమెది!

"యు ఆర్ సో బ్యూటిఫుల్!" సుస్మిత అంజలిని చూస్తూ ప్రశంసగా అంది.

"థాంక్యూ!" నవ్వబోయి, చేతకాక విఫలురాలయింది.

"నువ్వు చాలా లక్కీ చెర్రీ! అందమైన భార్య వుంది నీకు!"

చరణ్ భుజాలెగరేసి నవ్వేడు.

"కాఫీ కలుపుతాను" అంజలి మామూ లుగా వుండడానికి ప్రయత్నిస్తూ కిచెన్‌లోకి వెళ్ళబోయింది.

అప్పటికే వంటమనిషి కాంత ట్రేలో కాఫీకప్పులు సర్దుతోంది.

ఆ ప్రయత్నాన్ని విరమించుకుని తిరిగి హాల్లోకి వచ్చింది. సోఫాలో పక్కపక్కనే కూర్చుని వున్నారు చరణ్, సుస్మితలు! అత నేదో జోక్ చేసినట్టున్నాడు. ఆమె అతనిపై వాలిపోయి నవ్వుతోంది. ఆ దృశ్యం ఎబ్బెట్టుగా, అసహ్యంగా కనిపించిం దామెకి. కాఫీ గొంతు దిగటంలేదు. వాళ్ళి ద్దరూ భార్యాభర్తల్లా.. తను ఆ ఇంటికొ చ్చిన అతిథిలా అన్పిస్తోంది.

"నేను స్నానం చేసి వస్తాను!" అని సుస్మిత బెడ్‌రూములోకి వెళ్ళింది.

వెనుకనే చరణ్ కూడా వెళ్ళాడు.

చమత్కారం,

# దేవుడూ! కాసేపు విశ్రాంతి తీసుకోరాదూ?

పుట్టబోయెడి బుల్లిబుజ్జాయి కోసమై
పొదుగు గిన్నెల పాలు పోసి పోసి
కలికి వెన్నెలలూరు చలువ దోసిళ్లతో
లతలకు మారాకు లతికి అతికి
పూలకంచాలలో రోలంబములకు రే
పటి భోజనము సిద్ధపరచి పరచి
తెలవారకుండ మొగ్గలలోన చొరబడి
వింతరంగుల పూత వేసి వేసి
తీరికే లేని విశ్వసంసారమందు
అలసిపోయితివేమొ దేవాధిదేవ!
ఒక నిమేషమ్ము కన్ను మూయుదువుగాని
రమ్ము తెరచితి నా కుటీరమ్ము తలుపు!

పని.. పని.. పని!

విపరీతంగా అలసిపోతే ఆత్మీయుల సమక్షంలో సేదతీరుతాం మనం! అదేవిధంగా తను ఊహించి విశ్రాంతి తీసుకోమనడం విచిత్రమే. ఇంతటి సుకుమార భావనలు, పదాల పోహళింపు 'మధురకవి' శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారికి తప్ప మరెవరికీ సాధ్యం కాదేమో!

మానవాళి అంతా సుఖంగా నిద్రించే రాత్రి వేళ దేవుడు ఏం చేస్తుంటాడంటే- పుట్టబోయే లేగదూడలకోసం పొదుగులనే గిన్నెలలో పాలు నింపుతుంటాడట. మనోజ్ఞమైన తన చల్లని చేతులతో తీగలకు ఆకుల్ని అతికిస్తుంటాడట. తుమ్మెదల భోజనమైన మకరందాన్ని పూలకంచాలలో సిద్ధం చేస్తుంటాడట. మొగ్గలలో చొరబడి వాటిరెక్కలకు రంగులు అద్దుతుంటాడట. ఇవన్నీ చేసిచేసి అలసిపోయావేమో ఓ ప్రభూ.. నా కుటీరం తలుపు



తీశాను. వచ్చి ఒక నిమిషం అలా రెప్పవాల్చు తండ్రీ! ఇదీ ఈ పద్యం సారాంశం!

పనిలో అలసిపోయిన దేవుడ్ని వచ్చి తన కుటీరంలో సేద తీరమని కవిగారు కోరడమే ఇందులో చమత్కారం.

అందరు భక్తుల్లా దేవుడి సన్నిధిలో కోర్కెల చిట్టా విప్పడం కాక, ఆయన అలస

సేకరణ: **చంద్రప్రతాప్**

సుస్మిత టవల్ తీసుకుని బాత్‌రూములోకి వెళ్ళింది. చరణ్ విజిల్‌వేస్తూ బెడ్‌మీద పడుకున్నాడు. అంజలి కావాలనే బెడ్‌రూములోకి వెళ్ళి వార్డ్‌రోబ్ తెరచి, తనకి కావలసిన బట్టలని తీసుకుంది. యథాలాపంగా బెడ్‌వైపు చూసింది. రాత్రి జరిగిన పాపానికి సాక్ష్యంగా బెడ్ అంతా చిందర వందరగా వుంది. ఆమె ఒళ్ళు జుగుప్సతో, ఏహ్యతతో జలదరించింది.

"సుస్మిత బయటకొచ్చి బట్టలు వేసుకుంటుంది! నువ్వు బయటికి వెళ్ళు!" అన్నాడు చరణ్.

అంజలి సహనాన్ని కూడదీసుకుంటూ అంది "మీరిక్కడే వుంటే ఆమె బట్టలు ఎలా మార్చుకుంటుంది? మీరూ రండి"

ఒక్క ఉదుటున మంచం మీద నుంచి లేచి చెయ్యి గుమ్మం వైపు చూపిస్తూ అరిచాడు "షటప్ అండ్ గెటవుట్!"

ఆమె ముఖం పాలిపోగా గిర్రున వెను దిరిగి బయటకి వచ్చింది. తన వెనుక అతను ధడాల్న తలుపులు మూసుకోవడం వినిపించింది.

అవమానంతో ఆమెకి ఏడుపు వస్తోంది. తన స్థానాన్ని సుస్మిత ఆక్రమించిందన్న బాధ! అసూయ! మూసిన గది తలుపుల వెనుక ఆ ఇద్దరూ కనిపిస్తున్నారు 'ఇంట్లో తనుండగానే పట్టపగలు.. ఛీ!' ఆమె ఒళ్ళు వణుకుతోంది. సుస్మిత రెండురోజులుంది.

ఆ రెండు రోజులూ ఆ ఇద్దరి సరస సల్లాపాలు చూస్తూ బాధని, కోపాన్నీ ఉగ్గబట్టుకున్న అంజలి, ఆమె వెళ్ళగానే భర్తని నిలదీసింది.

"సుస్మిత మీకెలాంటి ఫ్రెండ్? "

"అంటే!" నవ్వేడు.

"మీ ఇద్దరి మధ్య వున్నది ఫ్రెండ్షిప్ అని ఎవరూ అనుకోరు! ఆడ మగల మధ్య స్నేహం తప్పుకాదు! కానీ ఒకే మంచం మీద పడుకోడాన్ని ఫ్రెండ్షిప్ అని అనరు"

"ఇంటర్మీడియెట్ చదువుతుండగానే ఎవడో ప్రపోజ్ చేస్తే, పెళ్ళికి ఓకె చెప్పిన దానివి నీకే తెలియాలి స్నేహమంటే ఏమిటో!" వ్యంగ్యంగా అన్నాడు.

"చీటికి మాటికి మహేష్ ప్రస్తావన తీసుకురాకండి! నేనే తప్పూ చెయ్యలేదు!" సహనాన్ని కూడదీసుకుంటూ అంది.

"రుజువేమిటి? "

"నా మనస్సాక్షే రుజువు! మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇది నిజం!"

అతను తప్పు చేస్తూ, ఏ తప్పూ చెయ్యని తనని నిందిస్తోంటే ఏడుపు వస్తున్నా నిగ్రహించుకుంటూ గట్టిగా అంది.

"ఛ!" అన్నాడు కంపరంగా! "నువ్వు మహేష్‌ని పెళ్ళి చేసుకోవాలనుకున్నావని తెలిసీ, నిన్ను పెళ్ళి చేసుకోవడం నేను చేసిన తప్పు! అప్పుడే నిన్ను లేడీ డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళి నువ్వు కన్యవో? కాదో? పరీక్షించమని, నువ్వు కన్యవని నిర్ధారణ అయ్యాకే నిన్ను పెళ్ళి చేసుకోవలసింది"

నిర్ఘాంతపోయింది! "ఇంత దారుణంగా ఆలోచిస్తారా మీరు? మీరెందుకు చెయ్యలేదా పని? " ఉక్రోషంగా అడిగింది.

"మొహమాటపడ్డాను!"

"కాదు! నేను పవిత్రురాలినే అని తెలిసి, నాపై నమ్మకంతోనే నన్ను పెళ్ళిచేసుకున్నారు! మూడు రోజులు నాతో ముచ్చట తీర్చుకున్నాక, నేను వెగటనిపించాను!"

"ఇందాక చెప్పింది అబద్ధం! ఇది నిజం!" వంకరగా నవ్వేడు.

"నేను ఇంట్లో వుండగానే సిగ్గెగ్గులు మరిచిపోయి, ఒక బజారు స్త్రీ కంటే హీనంగా ప్రవర్తించిన ఆడదానితో కులికిన మీకు నా కేరెక్టర్‌ని అనుమానించే అర్హత లేదు" మనసు మండిపోతుంటే పదునుగా అంది.

"నోర్ముయ్!" చెయ్యెత్తి ఆమె చెంపపై బలంగా కొట్టాడు.

"నేను మగవాడిని! నా ఇష్టం వచ్చినట్టు తిరుగుతాను! నన్ను విమర్శించడానికి నీకెంత ధైర్యం? " పళ్ళుకొరుకుతూ అన్నాడు.

అతను కొట్టిన చెంప దెబ్బ కంటే మన సుపై కొట్టిన దెబ్బ ఇంకా బాధపెట్టింది.

అవమానంతో కూడిన అసహాయతతో ఆమె ఏడుస్తుంటే, అతను వినోదంగా నవ్వేడు! "ఏడువు! ఇంకా బాగా ఏడువు!"

అంజలి పరుగులాంటి నడకతో తన గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె రోదనని ఆ గది నాలుగుగోడలు విన్నాయి!




**కాం**త చేసిన కూర బాగుందని, పచ్చడి బాగుందని చరణ్ పదేపదే మెచ్చుకోవడం గమనిస్తూనే వుంది అంజలి. వంటమనిషిని మెచ్చుకోకూడదని కాదు కానీ, అతని చూపుల్లో తేడా వుందనిపిస్తోంది.

ఆ రోజు చరణ్, అంజలి డైనింగ్ టేబిల్ దగ్గర బ్రేక్‌ఫాస్టు తింటున్నారు. కాంత వాళ్ళకి కావలసినవి అందిస్తోంది.

"బెండకాయలని డ్రైవర్ చేత తెప్పించకు కాంతా! ముదురు కాయలు తెస్తాడు. నువ్వే మార్కెట్‌కి వెళ్ళి కొను! నీ చేతివేళ్ళంత నాజూగ్గా వుండాలి కాయలు" అన్నాడు, ఆమె చేతివేళ్ళని చూస్తూ.

కాంత సీరియస్‌గా చూడడం, అంజలి గమనించింది.

"ఆహ! నా ఉద్దేశం లేతగా, సన్నగా వున్న బెండకాయలయితే బాగుంటాయని! 'లేడీస్ ఫింగర్స్' అంటారు ఇంగ్లీషులో తెలుసా? " సర్దిచెబుతున్నట్టు అన్నాడు.

అంజలి కాంతని మొదటిసారి పరీక్షగా చూసింది. ఆమెకి ముప్పయి అయిదు, నలభై ఏళ్ళ మధ్య వయసువుంటుంది. ఒంటి రంగు చామనచాయ అయినా, తీరైన ముఖకవళికలతో, బిగిసడలని అవయవ సంపదతో ఆకర్షణీయంగా వుంది. చరణ్ చూపులు ఆమెపైనే అతుక్కుపోవడం, అవసరం వున్నా, లేకపోయినా కిచెన్‌లో పనిచేసుకుంటున్న ఆమెని చీటికిమాటికి పిలవడం గమనించింది. అతని మాటలలోనే కాదు, అతను కాంత వైపు చూసే చూపులలోని భావం కూడా అర్థమయింది. అతను కాంతని వాంఛిస్తున్నాడు. ఆమెకి భర్తపై అసహ్యం వేస్తోంది. 'కంటికి నదురుగా ఏ ఆడది కనిపించినా వదలడన్నమాట' అనుకుంది ఏహ్యతతో!

ఆ రోజు ఉదయం అంజలి స్నానం చేసి వచ్చి గదిలో తయారవుతోంది. ఉన్నట్టుండి కాంత ఎవరి మీదో రౌద్రంగా అరవడం వినిపించింది.

ఏమయిందో? ఏమిటో? అని కంగారుగా బయటకొచ్చింది.

"ముందు మీరు వంటింట్లోంచి బయటకి నడవండి! కూటికి పేదనయినా కులానికి పేదని కాదు. మీ ఇంట్లో పనిచెయ్యడానికి వచ్చాను కదా! అని మర్యాద లేనిదాన్ని అనుకోకండి! మీరు పిలవగానే మీ బెడ్‌రూములోకి రావడానికి నేను బజారు మనిషిని కాదు!"

వంటింట్లోంచి బయటకొచ్చి పిల్లిలా బెడ్‌రూములో దూరుతున్న చరణ్‌ని, ఎర్రబడిన ముఖంతో సణుక్కుంటూ దోసెలు పోస్తున్న కాంతని చూస్తే జరిగిందేమిటో అర్థమయింది అంజలికి. ఆమెకి కాంత ముఖం చూడ్డానికి సిగ్గేసింది.

చరణ్ ఆఫీసుకి వెళ్ళాక కిచెన్‌లోకి వెళ్ళింది. "ఆయన తరఫున క్షమాపణ అడుగుతున్నాను!" అంది.

"అదేమిటమ్మా! మీరు నన్ను క్షమాపణ అడగడమేమిటి?" కంగారుగా అంది.

"నేనంతా విన్నాను! ఈ విషయం ఇక్కడే మరచిపో! మీ ఆయనతో చెప్పకు!"

"మా ఆయన లేడమ్మా! ఇద్దరు పిల్లలు పుట్టాక, నేను ఆయనకి మొహం మొత్తాను. ఇంకో ఆమెని పెళ్లిచేసుకున్నాడు. అప్పటి నుంచి నాకు తెలిసిన వంట పని చేసుకుని బతుకుతున్నాను. నా ఇద్దరు పిల్లల్ని పోషించుకోవాలి కదమ్మా!"

అంజలికి ఆమెపై జాలేసింది. హఠాత్తుగా ఆమెకి తను గర్భవతినని తెలిసి 'ఇంత కడుపేసుకుని నువ్వీ ఇంట్లో తిరుగుతుంటే నీపై నాకు కోరిక చచ్చిపోతుంది..' అనడం గుర్తొచ్చింది. తనకి ఇద్దరు పిల్లలు పుడితే చరణ్ తనని వదిలేస్తాడా? కాంతలా ధైర్యంగా నిలబడి తను పిల్లల్ని పోషించుకోగలదా? ఊహ మాత్రానికే ఆమెకి ముచ్చెమటలు పట్టేశాయి.

"ఒంటరి ఆడదంటే అందరికీ లోకువమ్మా! అందరికీ నేను కావాలి. 'వస్తావా?' అని అడిగే చచ్చినోళ్లే అందరూ! మాటలతో మర్యాదగా చెప్తే వినకపోతే ఒకడి చెంప పగలగొట్టాను"

కాంతం చెబుతుంటే అంజలికి ఒక ఊహ వచ్చింది. చరణ్ కాంతని మళ్లీ మళ్లీ 'వస్తావా?' అని అడుగుతున్నాడు. కాంత అతని చెంప పగలగొట్టింది! ఆ దృశ్యం కళ్లముందు మెదులుతుంటే ఫక్కున నవ్వింది అంజలి.

కాంత కూడా నవ్వేసి అంది.. "మరేం చెయ్యనమ్మా? ఈ పాడు లోకం నన్ను బతకనివ్వదు, నేను మొండిగా లేకపోతే!"

ఆ సంఘటన తరువాత ఆమె పని మానేస్తుందనుకుంది అంజలి. కానీ ఆమె పని మానలేదు. చరణ్ స్వభావం బాగా అర్థమయిందామెకి! అతను మకరందం కోసం పువ్వుల చుట్టూ తిరిగే తుమ్మెద లాంటివాడు. పెళ్లి అనే వ్యవస్థని, భార్యని గౌరవించడతను! అసలు అలాంటి వ్యక్తి పెళ్లెందుకు చేసుకున్నాడో? ఆమెకి అర్థం కాదు! ఆ సంఘటన తర్వాత ఆమె అతనికి మరింత దూరంగా మసలసాగింది. అతనిలో మార్పు తీసుకురావాలనుకోవడం వృథా ప్రయత్నమేనని అనిపించిందామెకి!

ఆ రోజు రాత్రి వర్తమానాన్ని, భవిష్యత్తుని తలచుకుని దిగులుపడుతూ నిద్ర పట్టక, పడకపై దొర్లుతున్న ఆమె.. తలుపు తట్టిన శబ్దం విని తలుపు తీసింది. ఎదురుగా చరణ్! తలుపు తియ్యగానే ఆమెని తోసుకుంటూ లోపలికొచ్చాడు.

"ఏం కావాలి మీకు?" ముడివడిన భ్రుకుటితో అతన్ని చూస్తూ అడిగింది.

"నీకిష్టం ఉన్నా? లేకపోయినా? తప్పదు!" అతని స్వరంలో కాంక్ష బుసలు కొడుతోంది.

"మీరంటే నాకు అసహ్యం!"

మరుక్షణం ఆమెని దూరంగా జరిపి రెండు చెంపలూ వాయించాడు. "నీ ఇష్టాయిష్టాలతో పనిలేదు నాకు! నేను కావాలన్నప్పుడు నువ్వు రావలసిందే!" ఆమెని మంచం మీదకి తోశాడు.

★ ★ ★

పెళ్లి తర్వాత అంజలి అత్తగారిని ఇదే చూడడం! "రండి అత్తయ్యగారూ! కులాసాగా ఉన్నారా?" పలకరించింది.

సంధ్య భ్రుకుటి ముడిచి ఆమెని చూస్తూ "ప్లీజ్! నన్ను 'ఆంటీ!' అని పిలువ్!" అంది, ఆమె అడిగిన దానికి సమాధానమివ్వకుండా.

అంజలి ముఖంలో క్షణకాలం నవ్వు ఎగిరిపోయింది. మరుక్షణం నవ్వేస్తూ "అలాగే ఆంటీ!" అంది.

ఆవిడ కనీసం తనని ఎలా ఉన్నావని కూడా అడగకపోవడం ఆమెని బాధపెట్టింది. కొడుకు ఇంటికి వచ్చినట్టుగా కాక, గెస్టుహౌస్‌కో, హోటల్‌కో వచ్చినట్టుంది ఆవిడ వాలకం.

కాఫీ కలిపి ఇచ్చింది. సంధ్య కాఫీ సిప్ చేసి "ఎక్సలెంట్!" అంది.

"నువ్వే చేశావా? " అడిగింది.

"అవునాంటీ!"

ఈలోగా చరణ్ ఇంటికి వచ్చాడు. ఆమె అతనికి కూడా కాఫీ ఇచ్చి, వంట ప్రయత్నంలో పడింది. కాంతకి నాలుగు రోజులుగా జ్వరమని పనిలోకి రావడం లేదు. ఆమెకి డ్రాయింగ్ రూములోంచి వాళ్లిద్దరి కబుర్లు వినిపిస్తున్నాయి. అది తల్లీకొడుకుల సంభాషణలా కాక, ఇద్దరు బిజినెస్ పార్ట్‌నర్ల సంభాషణలా ఉంది. అంజలికి ఆశ్చర్యమేసింది. కొన్ని నెలల తరువాత కలుసుకున్న ఆ ఇద్దరి మధ్య ఆత్మీయత అనేది లేదా? అనిపించింది. ప్రేమ రాహిత్యంలో పెరగడం వల్ల అతను అలా తయారయ్యాడా? అనిపిస్తోంది. ఒక తల్లిగా సంధ్య అతనికి జీవితపు విలువలని, సంస్కారాన్ని నేర్పలేకపోయిందేమిటా? అని నివ్వెరపోతోంది.

మరునాడు ఉదయం బ్రేక్‌ఫాస్టు తిని చరణ్‌తో బాటే ఆఫీసుకి వెళ్లింది సంధ్య. అటు నుంచే ఎయిర్‌పోర్టుకి వెళ్లి ఫ్లయిట్‌లో బెంగళూరు వెళ్తుందట! ఇంటికెవరో గెస్టు వచ్చి వెళ్లిన ఫీలింగ్ తప్ప, అత్తగారు వచ్చినట్టు అనిపించలేదు అంజలికి.

★ ★ ★

"రేపు మా అమ్మ, నాన్నగారు ఇక్కడికి వస్తున్నారు" చెప్పింది అంజలి.

"వాళ్లే వస్తామన్నారా? లేకపోతే నువ్వు రమ్మన్నావా? "

"మా నాన్నగారి కజిన్ కొడుకు పెళ్లి ఈ ఊళ్లో! అందుకని వస్తున్నారు"

"ఓకే! స్టేషన్‌కి కారు పంపిస్తానని చెప్పు!" చెప్పాడు.

తల్లిని, తండ్రిని చూసి కళ్లలో చివ్వున ఊరబోయిన నీటిని నిగ్రహించుకుని, చిరునవ్వు ముఖాన పులుముకుని ఆహ్వానించింది వాళ్లని.

"అంజూ! అంత చిక్కిపోయావేమిటే! ఒంట్లో బాగానే ఉంటోందా? " ఆదుర్దాగా అడిగింది శ్రీదేవి.

అంజలి సమాధానం ఇచ్చేలోగానే చరణ్ అన్నాడు. "వారం రోజుల కిందట తనకి

## 'చతుర'లో ఎనిమిదో నవల



### హోతా పద్మినీదేవి

ప్రతిష్ఠాత్మక మాసపత్రిక 'చతుర'లో నా ఎనిమిదో నవల గుట్టు. 1982 నుంచీ రచనలు చేస్తున్నాను. ఇప్పటివరకు వివిధ దిన, వార, మాస పత్రికల్లో అరవై ఐదు కథలు, సీరియల్స్, నవలికలు అచ్చయ్యాయి. ఎమెస్కోలో పన్నెండు నవలలు ప్రచురితమయ్యాయి. జీవితంలోంచి వచ్చిన కథలను పాఠకులు చిరకాలం గుర్తుంచుకుంటారని నా విశ్వాసం. మనసును కదిలించే ప్రతి సంఘటన కథగానో, నవలగానో రూపుదిద్దుకుంటుంది.

నా తొలిగురువు అమ్మకు, నా రచనావ్యాసంగాన్ని నిరంతరం ప్రోత్సహిస్తున్న మా శ్రీవారికి, నా రచనల తొలి పాఠకురాలు మా అమ్మాయికి, నన్ను ప్రోత్సహిస్తున్న 'చతుర' సంపాదక వర్గానికి, ఆదరిస్తున్న పాఠకులకు కృతజ్ఞతలు.

చిరునామా:
హోతా పద్మినీదేవి
6-10-4, హోతా హౌస్
టి. నగర్, రాజమండ్రి-533 101
తూర్పుగోదావరి జిల్లా,
ఆంధ్రప్రదేశ్

బాగా జ్వరం వచ్చింది. అప్పటి నుంచి ఇంకా కోలుకోలేదు"

"అయ్యో! అంత జ్వరం వస్తే, నాకు ఫోన్ చేస్తే నేను వచ్చి చూసుకునేదాన్నిగా బాబూ!"

"చిన్న జ్వరానికే ఎందుకు మిమ్మల్ని కంగారు పెట్టడం? పనివాళ్లున్నారు! నేను కూడా ఆఫీసుకి సెలవు పెట్టి ఇంట్లోనే ఉండి మీ అమ్మాయిని జాగ్రత్తగా చూసుకున్నాను. బ్రష్ చేసుకుని రండి అంకుల్! కాఫీ తాగుదాం!"

వాళ్లిద్దరూ ముఖం కడుక్కుని వచ్చాక, కాంత అందరికీ కాఫీ తెచ్చి ఇచ్చింది.

"మీరు మీ చుట్టాలింట్లో పెళ్లికి వచ్చారని చెప్పింది అంజలి. పెళ్లి ఎప్పుడు? ఎక్కడ? "

"రేపు రాత్రి తొమ్మిదిన్నరకి, లక్‌డికాపూల్‌లో! వాసవీ కళ్యాణ మండపంలో పెళ్లి"

"రేపు రాత్రికి కారు ఎరేంజి చేస్తాను. పెళ్లవగానే వెళ్లిపోవడం కాదు. మా దగ్గర నాలుగు రోజులయినా ఉండాలి!"

అల్లుడి ఆదరణకి, అతని మర్యాదలకి ఉబ్బితబ్బిబ్బయ్యారు. చరణ్‌లో అంత గొప్పనటుడు దాగివున్నాడని తెలియని అంజలి- కళ్లప్పగించి అతను తనవాళ్ల పట్ల చూపిస్తున్న ఆదరాభిమానాలకి నివ్వెరపోయి చూస్తోంది.

చరణ్ రెండు రోజులు ఆఫీసుకి వెళ్లకుండా ఇంట్లోనే ఉన్నాడు. సాయంకాలం కారులో ఒకరోజు బిర్లా టెంపుల్‌కి, మరో రోజు హోటల్‌లో డిన్నర్‌కి తీసుకెళ్లాడు. జోక్స్ వేసి వాళ్లని నవ్వించాడు. మూడోరోజు అతను ఆఫీసుకి వెళ్లాడు అర్జెంటు పని ఉందని.

అంజలి.. కాంతకి వంట ఏంచెయ్యాలో చెప్పింది. "బెండకాయలు లేవమ్మా!" అందామె.

"డ్రైవర్‌ని పంపించి తెప్పిస్తాను"

"అతను ముదురుకాయలు తెస్తాడు! పోయినసారి అతను తెచ్చిన కాయల్లో సగం పారేశాను! డబ్బులివ్వండి..! నేను తెస్తాను!" అంది.

అంజలి డబ్బిచ్చింది. ఆమె వెళ్లాక తలుపువేసి వచ్చింది.

"మనం అదృష్టవంతులమండీ! మనకి అబ్బాయిలు లేనందుకు కొడుకులాంటి అల్లుడు దొరికాడు. ఆ ప్రేమ, ఆప్యాయత గౌరవం చూస్తే ముచ్చటేస్తోంది!" అంటోంది తల్లి తండ్రితో.

"అవును! పెళ్లికి ముందు చాలా భయపడ్డాను! అప్పుడు ఈ సంబంధం వద్దనుకుంటే, ఇంత మంచి అబ్బాయిని చేజేతులా పోగొట్టుకునేవాళ్లం!" అన్నాడు చలపతి.

"నువ్వు అదృష్టవంతురాలివే అంజూ!" తన పక్కన కూర్చున్న కూతురి బుగ్గలు పుణుకుతూ అంది శ్రీదేవి.

"కాదు! చాలా దురదృష్టవంతురాలిని!" కళ్లలో నీళ్లు తిరుగుతుండగా అంది అంజలి.

"అదేమిటమ్మా! అలాగంటున్నావు? " తెల్లబోయారిద్దరూ.

అంజలి ఏడుస్తూ భర్త అనైతిక ప్రవర్తన గురించి చెప్పింది. "అంతకుమించి నాపై అనుమానం అతనికి!"

"నీపై అనుమానమా? కారణమేమిటి? నీ ప్రవర్తనలో ఏదైనా లోపం కనిపించిందా అతనికి? " షాకయిన శ్రీదేవి తేరుకుని అడిగింది.

"మా పెళ్లి కుదిరిన తరువాత ఒకరోజు నాతో మాట్లాడాలని బయటికి తీసుకెళ్లాడు గుర్తుందా? "

"అవును!"

"ఆ రోజు మాటల మధ్య నీకెవరైనా బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారా? అని అడిగితే లేరన్నాను. పోనీ నీకెవరైనా ప్రపోజ్ చేశారా? అని అడిగాడు. నేను మహేష్ గురించి చెప్పాను"

"ఎప్పుడో పదిహేడేళ్ల వయసులో ప్రేమ

కి, ఆకర్షణకి తేడా తెలియని వయసులో, ఆ అబ్బాయి నువ్వంటే తనకిష్టమని చెప్పిన విషయం చరణ్‌తో ఎందుకు చెప్పావే? !" నుదురు బాదుకుంటూ అంది తల్లి.

"తను అబద్ధాన్ని సహించలేనన్నాడు! నిజాన్ని, నిజాయితీని ప్రేమిస్తానన్నాడు! తను బీటెక్ ఫస్టియర్ చదువుతుండగా ఒక అమ్మాయిని ఇష్టపడ్డానని చెప్పాడు. అందుకే నేనూ నిజం చెప్పేశాను.." తల వంచుకుని గాద్గదిక స్వరంతో చెబుతోంది.

"పెళ్లయిన మూడోరోజు నుంచి నరకం చూపించడం మొదలుపెట్టాడు. చీటికీ మాటికీ నా దగ్గర మహేష్ ప్రస్తావన తేవడం, బయటికి తీసుకెళ్లినప్పుడు నన్నే మగవాడు చూసినా ఆ వ్యక్తి మహేషేమో అని అనుమానపడడం. నేను ఏ తప్పూ చెయ్యలేదని అతనికి తెలుసు. అయినా నన్ను మాటలతో చంపేస్తాడు" క్షణం ఆగి అంది "నాకు జ్వరం వచ్చిందని అతను చెప్పిన మాట అబద్ధం! రెండు నెలల కిందట అబార్షన్ చేయించాడు.

"ఇదేం కర్మే!" శ్రీదేవి ఏడ్చేసింది.

చలపతి ముఖం ఆత్మీయుల చావు కబురు విన్నట్టుగా వుంది.

"చరణ్ నిజస్వరూపం ఇదా! తను అపాత్రదానం చేశాడా? " ఆయన ఒక్క ఉదుటున లేచాడు.

"నడు! బట్టలు సర్దుకో! నిన్ను ఒక్క నిమిషం కూడా ఇక్కడ వుండనివ్వను. నాతో తీసుకెళ్ళిపోతాను. నీకసలు పెళ్ళే కాలేదనుకుంటాను"

"కాస్త నిదానించండి! తొందరపడకండి! అంజూ పెళ్ళయి ఇంకా ఏడాది కాలేదు! అప్పుడే భర్తని వదిలేసి వెళ్తే లోకం ఏమంటుంది? " భర్తని శాంత పరచడానికి ప్రయత్నిస్తూ శ్రీదేవి అంది.

"లోకం గురించి నాకనవసరం. నా కూతురి సుఖసంతోషాలే నాకు ముఖ్యం. చరణ్ మనిషి కాదు, మృగం! రేపే లాయర్‌ని కలిసి మాట్లాడతాను"

## కొత్తగాలి...

**గర్భస్రావంలో**
**అత్యాచారంలో**
**ఆసిడ్ దాడిలో**
**ఆఖరికి వృద్ధాశ్రమంలో**
**ఆడపిల్ల!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

"నేను మీతో రాను నాన్నగారూ!" అంది అంజలి.

"మరేం చేస్తావు? ఈ నరకంలో నిత్యం ఛస్తూ బతకుతావా? "

"అతనిలో మార్పు తేవడం కోసం ప్రయత్నిస్తాను. ఒకవేళ నేను సఫలీకృతురాలిని కాకపోతే అప్పుడే ఈ గడప దాటుతాను"

కూతురిని దగ్గరికి తీసుకుని శ్రీదేవి బావురుమంది.

"ఊరుకో అమ్మా! అసలందుకే నా బాధలని మీకు చెప్పకూడదనుకున్నాను. కానీ, ఆపుకోలేక చెప్పేశాను" అంది అంజలి, తల్లిని ఓదారుస్తూ.

"పద! ఇంక ఇక్కడ వుండొద్దు! వాడి ముఖం చూడ్డానికే అసహ్యం వేస్తోంది!" అన్నాడు చలపతి.

శ్రీదేవి సూట్‌కేసు సర్దేసింది.

అంజలి వుండమని బలవంతం చెయ్యలేదు. తండ్రి ఆవేశపరుడు. చరణ్‌తో గొడవ పడే ప్రమాదం వుంది.

"ఇంత హఠాత్తుగా మీరు వెళ్ళిపోతే ఆయనకి అనుమానం వస్తుంది. ఆయనకి ఫోన్ చేసి ఏదో ఒక కారణం చెప్పండి"

చలపతి అయిష్టంగానే చరణ్‌కి ఫోన్ చేశాడు.

"మా కజిన్ ఫోన్ చేశాడు. అమృతకి ఈ వూళ్ళో ఏదో పెళ్ళి సంబంధం



వుందట! నువ్వు వచ్చే వరకు వుండకుండా వెళ్ళిపోతున్నాం. ఏమీ అనుకోకు బాబూ!"

"ఇట్స్ ఓకె అంకుల్! ఆల్ ది బెస్ట్! జాగ్రత్తగా వెళ్లిరండి" అన్నాడు మర్యాదగా!

"నువ్వు ఒప్పుకుంటే అంజలిని మాతో తీసుకెళ్ళాలనుకుంటున్నాం! ఒక వారం రోజుల్లో తిరిగి పంపిస్తాం! పెళ్ళయ్యాక మళ్ళీ మా ఇంటికి రాలేదు కదా!"

"అంజలిని ఒక్కర్తినే పిలుస్తారా? నన్ను మీ ఇంటికి రమ్మని పిలవరా? "

"అయ్యో! నువ్వు కూడా వస్తే మరీ సంతోషం!" లోలోన తిట్టుకుంటూ అన్నాడు చలపతి.

"ఇప్పుడు కాదులెండి! వచ్చేనెలలో వస్తాం!"

ఫోన్ పెట్టేసి అన్నాడు. "చరణ్ వచ్చేనెలలో అంజలితో మన ఇంటికి వస్తాడట!"

అది అబద్ధమని అంజలికి తెలుసు.

"ఇప్పటి నుంచి రైలెక్కేవరకు ఎక్కడుంటారు నాన్నా? " ఆవేదనగా అడిగింది.

"నా ఫ్రెండ్ కూకట్‌పల్లిలో వున్నాడు! అక్కడికి వెళ్తాం! చరణ్ ముఖం చూస్తే ఆవేశంలో నేనేం మాట్లాడతానో నాకే తెలియదు" అన్నాడాయన.

కూతురిని వదలలేక, అక్కడ వుండలేక కన్నీళ్ళు పెట్టుకుంటూ వెళ్ళిపోయారు ఇద్దరూ.

★ ★ ★



గతం నుంచి వర్తమానానికి వచ్చిన అంజలి చెక్కిళ్ళు అశ్రుధారలతో తడిసి పోయి వున్నాయి. ఆమె కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ, కళ్లు రెండూ గట్టిగా తుడుచుకుంది.

చరణ్‌ని మార్చడానికి ఎన్ని ప్రయత్నాలు చేసింది! ఒక స్నేహితురాలిగా అతని మనసు తెలుసుకోవాలనుకుంది! తల్లిలా అతన్ని లాలించి వివాహ వ్యవస్థలోని గొప్పతనాన్ని తెలియచెప్పింది! కానీ, పాషాణం లాంటి చరణ్‌లో మార్పు తీసుకురాలేకపోయింది.

అతనికి దాంపత్య జీవితం పట్ల ఏమైనా అసంతృప్తి ఉందేమో, తను పడక మీద అతను కోరినట్టు ఉండలేకపోతోందేమో అని సిగ్గు విడిచి శృంగారంలో యాక్టివ్ పార్టు తీసుకుంది. ఆ క్షణంలో చరణ్ అన్న మాటలకి ఇప్పుడు కూడా సిగ్గుతో తల బద్దలు కొట్టుకుని చావాలనిపిస్తోంది.

"బజారు ఆడదానిలా ప్రవర్తిస్తున్నావు! నీకు సిగ్గులేదా?" ఒక బూతు మాటని ప్రయోగిస్తూ అన్నాడు.

అతనిలో మార్పు రావడమనేది అసంభవమని తేలిపోయింది. ఆమె వేదనగా నిట్టూర్చింది. 'ఇలా ఎన్నాళ్ళు? అతనితో జీవితాంతం ప్రయాణించగలదా? ఆ ఇంటి గడప దాటి వెళ్ళిపోతే..?' అనిపించిందో క్షణం. మరుక్షణం తన మనసుకి

> **కొత్తగాలి...**
>
> **వరి గింజ**
> **ఎండెండిపోయింది!**
> **రైతుకు**
> **వర్రీ మిగిలింది!**
>
> – కందాళై రాఘవాచార్య,
> నిజామాబాద్

తనే నచ్చచెప్పుకుంది. 'తప్పని పరిస్థితుల్లో తప్ప తను ఆ నిర్ణయం తీసుకోకూడదు' భర్తని వదిలి వస్తే తన కాళ్ళ మీద తను నిలబడి, తనని తాను పోషించుకోగలదు. తల్లీ తండ్రీ తనకి అండగా నిలబడతారు! కానీ ఏదో బలమైన శక్తి ఆమెని ఆ పని చెయ్యకుండా ఆపుతోంది!

★ ★ ★

ఉత్కళ సత్యని పిలిచింది "మా ఇంటికి రా!" అంటూ.

"రేపు వస్తానులే! చదువుకోవలసింది చాలా వుంది"

"ఎప్పుడూ చదువు.. చదువు..! నీకు బోర్ కొట్టదా? "

"మనం కాలేజీలో చేరిందే చదువు కోసం" నవ్వింది సత్య.

"పోదూ మరీను! అలా గంటల తరబడి చదివితే ఇంత దళసరి కళ్ళద్దాలొస్తాయి" అంది ఉత్కళ. "కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం! దారిలోనే కదా మా ఇల్లు"

ఉత్కళ బలవంతంపై తప్పనిసరిగా వాళ్ళ ఇంటికి వెళ్లింది సత్య.

తమ రాకని గమనించి తలుపు తీసిన వనజని "హాలో! ఆంటీ! ఎలా వున్నారు? " అడిగింది సత్య.

"బాగున్నానమ్మా! ఈమధ్య మా ఇంటికి రావడం మానేశావు"

సత్య నవ్వి వూరుకుంది.

"ఇప్పుడైనా నేను బలవంత పెడితేనే వచ్చింది!" అంది ఉత్కళ చిరుకోపంగా.

"మీ అమ్మగారెలా వున్నారు? ఈమధ్య ఆవిడా రావడం మానేశారు మా ఇంటికి"

"కార్తికమాసం కదాంటీ! పగలంతా ఉపవాసం. రాత్రి పూజ చేసుకుని అన్నం తింటారు. ఎప్పుడూ బిజీయే!"

"అమ్మో! రోజూ ఉపవాసమా? నేను మూడు పూటలా తిన్నా నాకు నీరసమే!" నవ్వింది వనజ.

"మమ్మీ! ఆకలి దంచేస్తోంది. స్నాక్స్ లేవా? " గారంగా అడిగింది ఉత్కళ.

"మీరిద్దరూ చేతులు కడుక్కోండి.. తెస్తాను!" అని లోపలికి వెళ్ళి రెండు ప్లేట్లలో బజ్జీలు తెచ్చింది.

ఇద్దరూ అవి తిన్నాక హార్లిక్స్ ఇచ్చింది.

"మీ అమ్మగారినోసారి ఫోన్ చెయ్యమను! మాట్లాడతాను!" అంది వనజ.

"అలాగే ఆంటీ!" అంది సత్య. ఆమెకి వనజ మనస్తత్వం అర్థంకాదు. తమ ఇంట్లో ఎవరికీ సెల్‌ఫోన్లు లేవు. లాండ్ ఫోన్ మాత్రం వుంది. తల్లితో ఏదైనా మాట్లాడాలనుకుంటే తమ లాండ్ ఫోనుకి రెండుసార్లు రింగిచ్చి కట్ చేస్తుంది వనజ. లేకపోతే తనతో ఇలా కబురు పెడుతుంది. బిల్లు అయిపోతుందని భయం కాబోలు!

"నీతో మాట్లాడాలి" అంది ఉత్కళ.

"చెప్పు!" అంది సత్య.

"ఇక్కడ కాదు! మా అమ్మ వింటుంది! డాబామీదకి వెళ్దాం!"

"పద!"

ఇద్దరూ మెట్లెక్కి డాబా మీదకొచ్చారు.

ఉత్కళ తన సెల్‌ఫోను ఆన్‌చేసి ఒక మెసేజ్‌ని ఆమెకి చూపించింది.

"పార్థు పంపేడు"

"నాకెందుకు చూపిస్తున్నావు? "

"నువ్వు నా ఫ్రెండువి కాబట్టి!"

"మీ అమ్మగారికి చూపించావా? "

"అతను నన్ను లవ్‌చేస్తున్న సంగతి ఇంకా నేను మమ్మీకి చెప్పలేదు. నువ్వు చదువు!"

సత్య అయిష్టంగానే ఆ మేసేజ్‌ని చదివింది. తెలుగు పదాలని ఇంగ్లీషులో టైప్ చేసిన మెసేజ్ అది.

"నిన్న రాత్రంతా కలలో నువ్వే! కళ్ళు తెరిస్తే కల చెదిరిపోతుందని భయం! అందుకే కళ్ళుమూసుకునే పడుకున్నాను!"

'వాడి మొహం! నిద్రలోనే కద కలలొచ్చేది. కళ్ళు మూసుకుని పడుకోకపోతే కళ్ళు తెరిచి నిద్రపోతారా ఎవరైనా? !' మనుసులోనే నవ్వుకుంది.

సెల్‌ఫోను తిరిగి ఉత్కళకిచ్చేసి అడిగింది. "పార్థు నిన్ను ప్రేమిస్తున్నాడు సరే, నువ్వతన్ని ప్రేమిస్తున్నావా? "

"ఇంకా నిర్ణయించుకోలేదు. ఇదివరకు మోహన్, వంశీ కూడా నన్ను ప్రేమిస్తున్నామని వెంటబడ్డారు. మోహన్ వాళ్ళ నాన్న, ఏదో ఆఫీసులో టైపిస్టు. వంశీ వాళ్ళ నాన్న ఒక ప్రయివేటు హాస్పిటల్‌లో కాంపౌండరు. వీళ్ళిద్దరికంటే పార్థునే ఎలిజబుల్ బేచిలర్ అనిపిస్తోంది!"

"అంటే! నీ అంతస్తుకి తగిన వాడిని తప్ప ప్రేమించవా? " అడిగింది సత్య.

"ప్రేమ అన్నం పెట్టదు! మనకంటే అన్నివిధాలా పై అంతస్తులో వున్న వాడిని చూసుకున్నామనుకో! లైఫ్‌లో హేపీగా సెటిలయిపోవచ్చు"

"మీ అమ్మవాళ్ళతో చెప్పు! తరువాత లేనిపోని సమస్య లొస్తాయి!" అంది సత్య.

"ముందు నన్ను నిర్ణయించుకోనీ! చెప్పు! ఈ మెసేజ్‌కి ఏం జవాబివ్వమంటావు? "

"నాకీవిషయంలో బొత్తిగా అనుభవం లేదు! నువ్వే ఆలోచించుకో! నేను వెళ్తానిక!" అని సత్య బయలుదేరింది.

ఉత్కళ గురించే ఆలోచిస్తూ నడుస్తోంది సత్య. ఉత్కళ తల్లిదండ్రులకి ఒక్కర్తే సంతానం. ఆమె తండ్రి శంకరం ఓఎన్‌జీసీలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆ అమ్మాయి కాలేజీలో చేరిన కొత్తలో అబ్బాయిలంటే భయంగాను, చదువంటే శ్రద్ధతోను వుండేది. సత్య, ఉత్కళ బీసీఏ రెండో సంవత్సరం చదువుతున్నారు. ఉత్కళ పెద్ద అందగత్తె కాదుకానీ, ఆకర్షణీయంగానే వుంటుంది. రెగ్యులర్‌గా బ్యూటీపార్లర్‌కి వెళ్లి ఫేషియల్, ఐబ్రోస్ వగైరా చేయించుకుంటూ వుంటుంది. అబ్బాయిలు తనవైపు చూస్తున్నారా? లేదా? అనే కుతూహలం ఆమెది! తన అందం చూసి అబ్బాయిలు ఆకర్షితులవుతున్నారా? లేదా? అని ఆలోచిస్తూంటుంది.

"రాజేష్ నన్నే చూస్తున్నాడు! నాకు తెలుసు!" అంది ఒకసారి.

సత్య తల తిప్పి ఆమె చెప్పింది నిజమా? కాదా? అని చూస్తే, ఆమెనే చూస్తున్న రాజేష్ కనిపించాడు.

"నువ్వు సెల్‌ఫోన్ కొనుక్కో సత్యా!" అంది ఉత్కళ ఒకసారి.

"అవసరమేముంది? పొద్దున్న ఇంటి నుంచి కాలేజీకి వస్తాను. మళ్ళీ సాయంకాలం ఇంటికి వెళ్తాను. మధ్యలో ఇంట్లో వాళ్ళతో అంత అర్జెంటుగా మాట్లాడవలసిన అవసరం ఏముంది? అంతగా కాకపోతే కాయిన్ బాక్స్‌లు ఎక్కడపడితే అక్కడే వున్నాయి కదా!"

"అబ్బబ్బ! నువ్వు రాతియుగం మనిషివి!

## కొత్తగాలి...

**కాయ రుచి చూస్తూ**
**రామచిలుక**
**శబరిలా ఫోజు!**

– శంకర,
ఆచంట, ప.గో. జిల్లా

సెల్‌ఫోను లేనిదెవరికి ఈ రోజుల్లో? అయినా మీ ఆర్థిక పరిస్థితి బాగా లేదనుకుంటాను. లేకపోతే నువ్వు సెల్‌ఫోను కొనుక్కునే దానివే!"

సత్యకి కోపం వచ్చింది. "అవును! మేం చాలా పేదవాళ్ళం! ఒకపూట తింటే, మరోపూట మాకు భోజనం వుండదు!"

"నీకు కోపం వచ్చినట్టుంది!"

"వేరొకరి ఆర్థిక పరిస్థితికి వేలెత్తి చూపిస్తే కోపం రాదామరి? ఎవరి ఖర్చులు వాళ్ళకి వుంటాయి! మా దృష్టిలో లగ్జరీ అనేది, నీ దృష్టిలో అవసరం!"

ఉత్కళ తేలిగ్గా నవ్వింది! "ఏమో బాబూ! చేతిలో మొబైల్ లేకుండా నేను మా ఇంటి పక్కనున్న కిరాణా షాపుకి కూడా వెళ్ళను! మా డాడీ ఈసారి నా బర్త్‌డేకి లేటెస్ట్ మొబైల్ కొనిస్తానన్నారు!"

సత్య చిరునవ్వు నవ్వింది.

"నీ బర్త్‌డే ఇంకా చాలా నెలలుందిగా? ఈలోగా మార్కెట్లోకి కొత్త మోడల్ సెల్‌ఫోన్లు వస్తాయిలే!"

పరస్పర విరుద్ధ స్వభావాలు గల ఆ ఇద్దరు అమ్మాయిల మధ్య స్నేహం కొనసాగడానికి కారణం ఆ ఇద్దరికీ ఒకరితో ఒకరికి వున్న అవసరమే! ఎప్పుడూ క్లాసు ఫస్టు వచ్చే సత్య రాసే నోట్సులు ఉత్కళకి కావాలి. తమ ఇంట్లో కంప్యూటర్ లేని కారణంగా కంప్యూటర్‌తో అవసరం వచ్చినప్పుడు ఉత్కళ ఇంటికి వస్తుంది సత్య.

★ ★ ★

సత్య ఇంటికొచ్చేప్పటికి తల్లి తండ్రి మీద పెద్దగా అరవడం వినిపించింది.

"జయకి పెళ్ళి సంబంధాలు చూడమని ఎన్నాళ్ళనుంచి చెబుతున్నాను! ఎప్పటికప్పుడు అదుగో ఇదుగో అంటూ కాలయాపన చేస్తూ వచ్చారు. మగపిల్లవాడు కలవాళ్ళు మనకోసం ఆగుతారా? ఏదో సామెత చెప్పినట్టు 'మందు తెమ్మంటే మాసికానికి వచ్చాడట!' మీలాంటివాడే! తీరుబడిగా మీరు పెళ్ళి సంబంధం మాట్లాడ్డానికి వెళ్ళేసరికి మగపిల్లలకి పెళ్ళిళ్ళయిపోతున్నాయి! మీకసలు బాధ్యత లేదేంటండీ? "

శకుంతల లబలబలాడుతోంటే బలరామశాస్త్రి తాపీగా తమలపాకులపై సున్నం రాసి జర్దా చల్లుతున్నాడు. ఆ పని మీదనే ఏకాగ్రతతో వున్న ఆయన భార్య అరుపులని ఏమాత్రం పట్టించుకోడంలేదు.

"వర్షం వస్తే ఇల్లంతా చెరువయిపోతుంది. మీ తాతగారు కట్టించిన ఇల్లనే సెంటిమెంటుతో ఈ ఇంటిని అమ్మ కుండా వుంచడం మంచిదే! కానీ ఏడాదికోసారి గోడలకి సున్నంవేయించడం తప్ప ఇంటిని రిపేరు చేయించాలనుకున్నారా? మీకసలు ఇంటిసంగతి ఎప్పుడు పట్టిందిలెండి!"

బలరామశాస్త్రి తాపీగా కిళ్ళీ చుట్టి నోట్లో పెట్టుకున్నాడు.

"మా అన్నయ్య చెప్పిన అమలాపురం సంబంధంవాళ్ళతో మాట్లాడ్డానికి వెళ్తారా? లేదా? "

"ఇందాకటి నుంచి ఇల్లు రిపేరు చేయించడం లేదన్నావు! ఇప్పుడు పెళ్ళి సంబంధం అంటున్నావు! ఇంతకీ రెండింటిలో ఏది ముఖ్యం? " ఇంతసేపటికి నోరు విప్పాడాయన.

"రెండూ వేటికవే ముఖ్యం!"

భార్య అలా అనగానే తాంబూలం నములుతూ నవ్వేడాయన.

"ఇల్లు కట్టి చూడు.. పెళ్ళి చేసి చూడు! అన్నారు పెద్దలు. ఎందుకంటే రెండూ కష్టమైనవే కాబట్టి! నేను రెండింటిలోను ఏదో ఒకటే చెయ్యగలను! అది కూడా పిత్రార్జితంగా నాకు మిగిలిన నాలుగెకరాల పొలంలో రెండెకరాలు అమ్మేస్తేనే!"

"మనకి మీ నాన్నగారు ఆస్తినిచ్చింది అమ్ముకోడానికే అని నాకు తెలుసు!" వ్యంగ్యంగా అంది శకుంతల.

"రేపు దశమి, శుక్రవారం! అమలాపురం వెళ్ళి జయకి పెళ్ళి సంబంధం మాట్లాడి

# వ్యాపారుల జిమ్మిక్కులు

అమెరికాలో సూపర్ మార్కెట్ల నిర్వహణలో మానసిక శాస్త్రవేత్తల సలహాలని తీసుకుంటారు. అమ్మకాలు పెరిగేందుకు కంపెనీలు, సూపర్ మార్కెట్లు రీసెర్చ్ చేస్తూనే ఉంటాయి. అలాంటి వాటి ఫలితాలు కొన్ని..




★ సూపర్ బజార్‌లోకి వెళ్లగానే బ్రెడ్, చికెన్ రోస్ట్ వాసనలు వచ్చేలా ఆ కౌంటర్స్‌ని ప్రవేశ ద్వారం దగ్గర ఉంచుతారు. నోరూరుతుంటే ఆహార పదార్థాలని ఎక్కుగా కొంటారు.

★ పాలని ఎప్పుడూ స్టోర్ వెనక భాగంలో ఉంచుతారు. నిత్యావసరమైన దాని దగ్గరకి వెళ్తూ, కనబడ్డ చాలా వాటిని కొంటారు.

★ పళ్లూ, కూరగాయల మీద తరచూ స్ప్రే చేస్తారు. తాజాగా కనబడటంతో కొనాలనిపిస్తుంది.




★ షాపింగ్ ట్రాలీల పరిమాణాన్ని ఇరవై శాతం పెంచారు. కొందరు ట్రాలీ నిండాక ఇంక కొనరు. అలాంటి వారి చేత ఎక్కువ కొనిపించడానికే ఈ 'ఎత్తు'గడ.

★ షాప్‌లో ఎక్కువ సమయం ఖర్చు చేసేందుకు, వినియోగదారులకి చక్కటి సంగీతం, కంటికి ఇంపైన అలంకరణలు ఏర్పాటు చేస్తారు. ఎంత ఎక్కువ సేపు ఉంటే, అన్ని ఎక్కువ వస్తువులు కొంటారు.

★ క్రోగర్ అనే సూపర్ బజార్ స్టోర్‌లో ఉష్ణోగ్రతని కనుగొనే స్పెన్సర్స్‌ని ఉపయోగిస్తారు. వినియోగదారులు అధికమైతే ఉష్ణోగ్రత కూడా అధికమవుతుంది. అప్పుడు ఎక్కువ మంది కేషియర్స్‌ని చెకౌట్ కౌంటర్స్‌కి పంపుతారు.

★ ఆరు కోకోకోలా బాటిల్స్ పేక్ బదులు నేడు పన్నెండు బాటిల్స్ పేక్‌ని అందుబాటులో ఉంచుతున్నారు. దాన్ని కొన్నవాళ్లు వారంలో ఆరు బదులు పన్నెండు సీసాలని తాగుతారు.

---

రండి!"

బలరామశాస్త్రి భార్య మాటలని విన్నాడో? లేదో? తెలియదుగానీ కిళ్ళీని ఆ దవడనుంచి ఈ దవడకి మార్చుకున్నాడు.

"మీకే చెప్పేది! రేపు అమలాపురం వెళ్ళి రండి!" గట్టిగా చెప్పిందావిడ.

"నాకు వినిపించింది!" నోట్లో కిళ్ళీ ఉమ్మితో ఆయన మాట్లాడుతుంటే ఆవిడకి కంపరంగా అనిపించి ముఖం తిప్పుకుంది.

ఏ పనినైనా ఒకటికి రెండుసార్లు చెప్పందే చెయ్యని ఆయనంటే ఆవిడకి విపరీతమైన ఏహ్యాభావం! అసలా మనిషితో ఇన్నేళ్లూ కాపురం ఎలా చేశానా అని తన మీద తనకే జాలేస్తుంది.

బలరామశాస్త్రితో ఆవిడ పెళ్ళయ్యేసరికి, ఆమె అత్తవారిది బాగా కలిగిన కుటుంబమే! ఇంట్లో డబ్బుకి లోటులేదు. ఇంటికి వచ్చిపోయే అతిథులకి, తిని కూర్చునే మనుషులకి కూడా లోటులేదు.

బలరామశాస్త్రి లా పాసయినా ఎప్పుడూ కోర్టుకి వెళ్ళలేదు. స్నేహితులతో కలిసి బ్యాడ్మింటన్ ఆడుతూ హోటళ్ళకి, సినిమాలకి డబ్బు ఖర్చు పెడుతూ బాధ్యతా రహితంగా తిరిగేవాడు. ఇద్దరు పిల్లలకి తండ్రయినా అతని ధోరణిలో మార్పు రాలేదు. శకుంతల అత్తగారు పొద్దుట లేచిన దగ్గర నుంచి రాత్రి పడుకునే వరకు వంటఇంట్లోనే వుండేది! ఆ ఇంటి పెద్దకోడలిగా అతిథి మర్యాదలలో పాలుపంచుకోడం శకుంతలకి తప్పలేదు. బలరామశాస్త్రి తమ్ముళ్ళిద్దరూ ఉద్యోగ రీత్యా వేరువేరు వూళ్ళలో వుంటున్నారు.

అత్తగారు అనారోగ్యం పాలయి మంచం పట్టాక శకుంతల పూర్తిగా వంటగదికే

అంకితమయిపోయింది. చిన్నకొడుకులిద్దరూ తమ భాగాలు తమకి పంచమని తండ్రిపై వత్తిడి తేవడంతో ఆస్తుల పంపకాలు జరిగాయి. ఆడపడుచుల పెళ్ళిళ్లకి, మామగారి భేషజాలకి పొలం చాలా మటుకు అమ్మెయ్యగా మిగిలింది పంచుకున్నప్పుడు శకుంతలకి తమ కుటుంబం ఎంత క్లిష్టపరిస్థితుల్లో వుందో తెలిసొచ్చింది. అప్పటికీ బలరామశాస్త్రికి తన బాధ్యత తెలిసిరాలేదు. రాబడి తగ్గిపోయినా, ఆస్తులు హరించుకుపోయినా ఆ ఇంట్లో పూర్వవైభవం కొనసాగించాలనుకునే అత్తగారు, బంధుప్రీతితో తన వాటాకి వచ్చిన పొలాన్ని ఏడాదికో ఎకరం చొప్పున అమ్మి, విందులు చేస్తున్న మామగారిని చూసి శకుంతల లబలబలాడింది.

ఇంకా మీ చిన్నచెల్లెలు కావేరి పెళ్ళి బాధ్యత మీ నాన్నగారిపై వుంది. ఆయన ఆడంబరాలకి ఆస్తి హారతి కర్పూరమయి పోతోంది. చివరకి మీ చెల్లెలి పెళ్ళి బాధ్యత మీరే వహించవలసి వచ్చేలా వుంది. మనకీ ఇద్దరు ఆడపిల్లలున్నారు.

"కావేరి పెళ్లికేం తొందర? చేద్దాం!" అన్నాడు బలరామశాస్త్రి తమలపాకులకి సున్నం రాస్తూ.

"పెళ్ళికి తొందరని కాదు, ఏం పెట్టి చేస్తాం? పెళ్లంటే మాటలు కాదు"

మనకి ఉన్నంతలో ఘనంగానే చేద్దాం! భర్త నిర్వికార ధోరణి శకుంతలకి ఆగ్రహాన్ని కలిగించింది.

మీ చెల్లెలి పెళ్లితో మన సమస్య తీరదు! మన పిల్లల గతేం కావాలి? వాళ్ళ చదువులు, పెళ్ళిళ్లు.. వీటికి ఎంత ఖర్చు! ఇలా స్నేహితులతో కాలక్షేపం చేసే బదులు, ఏ ప్లీడరు దగ్గరో జూనియర్‌గా చేరకూడదూ!

"నాకసలు ప్లీడరు వృత్తి అంటేనే పరమ అసహ్యం! మా నాన్నగారి పోరు పడలేక ముక్కుమూసుకుని లా చదివానంతే!"

"అయితే వ్యవసాయం చెయ్యండి! వున్న భూమిని కౌలుకిచ్చుకోడం ఎందుకు? "

"ఛ! ఆ మట్టిపని ఎవరు చేస్తారు? " నిరసనగా అన్నాడు.

భర్త ధోరణికి విపరీతమైన ఆగ్రహం, దుఃఖం వస్తున్నాయి శకుంతలకి. మామగారి ధోరణి వెర్రెక్కిస్తోంది. కావేరికి తమ తాహతుకి మించిన సంబంధాలు చూడడం, ఒక లక్షాధికారికో, పెద్ద ఉద్యోగస్తుడికో ఇచ్చి పెళ్ళి చేస్తాననడం ఆమెకి తెలియని భయాందోళనలని కలుగచేస్తున్నాయి. తండ్రిగా కూతురుకి మంచిసంబంధం తేవాలని, ఆమె సుఖపడాలని వాంఛించడం తప్పుకాదు. కానీ ఆయన ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నాడు. కాణీ సంపాదన లేని తన భర్తకి.. అతని వాటాకి వచ్చిన భూమినైనా మిగులుస్తారో? లేదో? అనే బెంగతో ఆమె దిగులు పడుతోంది. ఈ సమస్యకి పరిష్కారమెలాగా? అని బుర్ర బద్దలు కొట్టుకుంటోంది.

ఆ సమస్యని కావేరే పరిష్కరించింది, తను చదివే కాలేజీలోనే లెక్చరర్‌గా పనిచేస్తున్న రాబర్ట్ అనే యువకుడిని పెళ్ళి చేసుకుని. కూతురు మతాంతర వివాహం చేసుకుని కుటుంబ పరువుప్రతిష్ఠలని దిగజార్చిందనే బెంగతో ముందు అత్తగారు, ఏడాది తిరక్కుండానే మామగారు పోయారు. మామగారు పోగానే అప్పుల వాళ్ళు ఆ ఇంటిని చుట్టుముట్టారు. శకుంతల నిర్ఘాంతపోయింది. విలాసాల కోసం పొలాన్ని అమ్మిన మామాగారికి అది చాలక అప్పులా? తండ్రివాటాకి వచ్చిన మిగిలిన పొలాన్ని అమ్మి అప్పులు తీర్చాడు బలరామశాస్త్రి. అయినా అప్పులు తీరకపోవడంతో, తన వాటాలో కూడా రెండెకరాలు అమ్మేశాడు. ఆస్తి పంచుకున్న మరుదులు తండ్రి చేసిన అప్పులతో తమకి సంబంధం లేదన్నారు.

శకుంతల వస్తుతః మంచి మనిషే! కానీ సంపాదన లేని భర్త.. ఎదుగుతున్న ఆడ

పిల్లల భవిష్యత్తుని ఆలోచిస్తే ఆమెకి బతుకు భయం పట్టుకుంది. మిగిలిన నాలుగెకరాల పొలాన్ని భర్త అమ్మేస్తాడనే భయంతో ఆయన్ని కంట్రోల్ చెయ్యడానికి ఇంటి పెత్తనాన్ని గుప్పిటలోకి తీసుకుంది. పొలం మీద వచ్చే కౌలుతో సంసారాన్ని గుట్టుగా లాక్కుని వస్తోంది.

గతం తాలూకు జ్ఞాపకాలతో శకుంతల మనసు చేదు తిన్నట్టయింది. ఆవిడ జ్ఞాపకాలని బలవంతంగా పారదోలుతూ, కాలేజీ నుంచి వచ్చి పుస్తకాల ముందు కూర్చున్న సత్యని పిలిచింది.

"కాఫీ తాగుదువుగానీ రావే!"

"వద్దు! కాలేజీ నుంచి వస్తూ ఉత్కళ వాళ్ళింటికి వెళ్ళాను. వాళ్లమ్మగారు టిఫిన్, హార్లిక్స్ ఇచ్చారు. మరిచిపోయాను ఆంటీ నిన్ను ఒకసారి ఫోన్ చేయమన్నారు"

"రేపు పొద్దున చేస్తానులే!" అని ఆవిడ వంటపనిలో నిమగ్నమయింది.

రాత్రి భోజనాల దగ్గర భర్తతో చెప్పింది "రేపు మీరు అమలాపురం వెళ్ళాలి!" అని.

"అమలాపురమా? ఎందుకూ?"

పరధ్యానంగా అడిగాడో? లేక మరిచిపోయాడో? తెలియదుగానీ భర్త అడిగిన ఆ ప్రశ్నతో ఇంతెత్తున లేచిందావిడ.

"కర్మ! మీకు మతిమరుపు పట్టుకుందేమిటండీ? జయకి మా అన్నయ్య చెప్పిన పెళ్ళిసంబంధం మాట్లాడ్డానికి"

"అవునవును! మరిచిపోయాను!"

ఆ సమాధానానికి ఒళ్ళు మండిపోయినా శాంతంగానే చెప్పింది. "జయ ఫొటో, జాతకం బల్లమీద పెట్టాను. తీసుకోండి!"

భోజనమయ్యాక బలరామశాస్త్రి ఆ రెండింటినీ బ్యాగ్‌లో పెట్టుకున్నాడు. జయకి ముద్ద దిగడం లేదు. తింటున్న అన్నం చేదుగా అనిపిస్తోంది. తండ్రి తనకి పెళ్ళిసంబంధం మాట్లాడడానికి వెళ్తున్నాడు. మరోవారం రోజులు పోయాక వాళ్ళు పెళ్ళిచూపులకి వస్తారు. ఏ పెళ్ళివారయినా తనని నిరాకరించడానికి తనేమీ అనాకారి కాదు. తండ్రి పొలం అమ్మి ఆ డబ్బుతో తన పెళ్ళి చెయ్యడానికి సిద్ధంగానే వున్నాడు. తన మనసులోని మాట చెప్పకపోతే పెళ్ళిచూపులు, పెళ్ళి తన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా జరిగిపోతాయి. మరి అతను? ఆమె బలవంతంగా రెండు ముద్దలు మింగి, కంచంలో చెయ్యి కడిగేసుకుంది.

"ఏమైందే? సరిగ్గా తినకుండా లేచావు?"

"ఆకలి లేదమ్మా!" అంది, కంచాన్ని పెరట్లోకి తీసుకెళ్తూ.

పెళ్ళి మాట ఎత్తగానే కూతురు గాబరా పడుతోందనుకుంది శకుంతల.




"అమ్మా నేను కాలేజీకి వెళ్లొస్తాను" అంది ఉత్కళ వంటింట్లో వున్న తల్లికి వినిపించేలా.

వనజ చేస్తున్న పని ఆపి బయటకొచ్చి "జాగ్రత్తమ్మా! అబ్బాయిలు ఏదో నెపంతో నిన్ను పలకరించాలని చూస్తారు! ఎవరితోను మాట్లాడకు! కాలేజీలో అనవసరంగా నవ్వకూడదు! గట్టిగా మాట్లాడకూడదు! బుద్ధిగా చదువుకో!" చెప్పింది. ఇవన్నీ తల్లి రోజూ చెప్పే జాగ్రత్తలే!

ఉత్కళ విసుగ్గా అంది "అబ్బబ్బ! ఎన్ని సార్లు చెబుతావే? నాకూ తెలుసు!"

ఆమె గేటుదాటి బయటికి వెళ్ళాక, వనజ లోపలకి వచ్చింది. ఇంతలో ఫోన్




మోగింది. ఆమె డైనింగ్ టేబిల్ మీద వున్న సెల్‌ఫోన్ అందుకుని డిస్‌ప్లేలో నెంబరు చూసింది.. శకుంతల!

వెంటనే ఫోన్‌కాల్‌ని రిసీవ్ చేసుకుంది.

"నేను శకుంతలని వనజగారు! బాగున్నారా? "

"బాగున్నానండీ! మీరెలా వున్నారు? "

"బాగున్నాం! మీ బావగారమ్మాయి పెళ్ళి బాగా జరిగిందా? "

"చాలా బాగా జరిగింది" అంటూ పెళ్ళి విశేషాలు చెప్పింది. "మా బావగారు అదృష్టవంతులండీ! ఆడపిల్లలిద్దరికీ చాలా మంచి సంబంధాలు చేశారు"

"మనం చేద్దామంటే అవుతాయాండీ! వాళ్ళ యోగాన్ని బట్టి అవుతాయి!"

"నిజమేలెండి!"

"మీరు ఫోన్ చెయ్యమన్నారని సత్య చెప్పింది"

"అవును! మీకో విషయం చెప్పాలి!"

"ఏమిటది? "

"వీరభద్రంగారమ్మాయికి ఒంట్లో బాగా లేదట!"

"అవునండి! నేనూ విన్నాను. టైఫాయిడ్ జ్వరమంట కదా!"

"అంతా వట్టిదే! ఆ పిల్లకి అబార్షన్ చేయించారు"

"ఛ!" అంది అపనమ్మకంగా, "మీకెవరు చెప్పారు? "

"ఇలాంటి విషయాలు ఎంత గుట్టుగా వుంచాలనుకున్నా ఎలాగోలా బయటపడిపోతూ వుంటాయి. మా పక్కనేగా వాళ్ళుండేది! ఆ పిల్ల వేసే వేషాలు ఎవరికి తెలియవు? మొన్నామధ్య సినిమాకి వెళ్తే మా ముందు వరసలో కూర్చుంది. పక్కనే ఎవరో అబ్బాయి! ఇద్దరూ ఒకళ్ళ మీద మరొకళ్ళు పడిపోతూ నవ్వులు! సినిమా చూడ్డం మానేసి వాళ్ళిద్దరినే చూశారంతా!

"వాళ్ళ చుట్టాలబ్బాయేమో!" వనజ ఆ అమ్మాయి గురించి అలా మాట్లాడ్డం శకుంతలకి నచ్చలేదు.

'ఇదుగో పులి! అంటే అదుగో తోక!' అనే మనస్తత్వం వనజది.

"అవును! చుట్టాలే! ఎవరైనా ఆ అబ్బాయి ఎవరని అడిగితే, కజిన్ అని చెబుతుంది" అంది వెటకారంగా.

"పోనిద్దురూ! పెళ్ళి కావలసిన పిల్ల! మనకి తెలియని విషయాల గురించి మాట్లాడ్డం అనవసరం. నిజంగా ఆ అమ్మాయికి జ్వరం వచ్చిందేమో!"

"మీరు ఒట్టి అమాయకులు శకుంతల గారూ! నాలుగురోజుల కిందట ఆ అమ్మాయి ముస్తాబయి కాలేజీకి వెళ్తుంటే చూశాను. ఇంతలోనే జ్వరం ముంచుకొచ్చిందా? అయినా ఏదో సామెత చెప్పినట్టు లోకం నోరు మూయించగలరా? వయసొచ్చిన ఆడపిల్ల ఏం చేస్తోందో? ఎక్కడికి వెళ్తోందో? తెలుసుకోవద్దూ! మన పిల్లలకి మంచిచెడుల వివక్షని నేర్పుకోవలసిన బాధ్యత మనది. మా ఉత్పలని నేనెంత క్రమశిక్షణతో పెంచుతున్నాను!" గర్వంగా అంది.

"అవును" అంది శకుంతల మనస్ఫూర్తిగా.

★ ★ ★

బలరామశాస్త్రి బేగ్‌లో నుంచి జయ ఫొటో, జాతకం రాసిన కాగితాన్ని తీసి అవధానికి అందించాడు. అవధాని జయ ఫొటోని పరిశీలనగా చూస్తూ ఆమె అంద

చందాలని మనసులోనే మెచ్చుకున్నాడు.

"మీ గోత్రం ఏమిటన్నారు? "

చెప్పాడు బలరామశాస్త్రి.

"మీ అన్నదమ్ములు ఎంతమంది? అక్క చెల్లెళ్ళున్నారా? "

ఆయన తన తమ్ముళ్ళ ఉద్యోగ వివరాలు, అక్కచెల్లెళ్ళకి ఎవరెవరితో సంబంధాలు కలుపుకున్నదీ చెప్పాడు. "నూరు అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యమంటారు! కానీ ఒక నిజం దాచి నా కూతురి పెళ్ళి చెయ్యడం నా అభిమతం కాదు" నిజాయితీ ప్రస్ఫుటమవుతోంది ఆయన స్వరంలో! గొంతు సవరించుకుని అన్నాడు.

"మా ఆఖరి చెల్లెలు మతాంతర వివాహం చేసుకుంది. మీకు ఆ విషయం వేరొకరి ద్వారా తెలియడం కంటే, నేను చెప్తేనే బాగుంటుందని చెబుతున్నాను. అయినా మా చెల్లెలు ఎప్పుడు మా ఇంటి గడప దాటిందో, ఆ రోజే మాకూ దానికి సంబంధబాంధవ్యాలు తెగిపోయాయి. ఈ విషయంలో మీకు అభ్యంతరం లేకపోతేనే మా సంబంధం గురించి ఆలోచించండి"

అవధాని గంభీరంగా చూస్తూ అన్నాడు. "మాకు వధువు జాతకం ముఖ్యం. వధూవరుల జాతకాలు నప్పితేగానీ మేం పెళ్ళి చూపులకి రాం"

"సరే! మరి నేను వెళ్ళి వస్తాను, సెలవు!" బలరామశాస్త్రి ఆయనకి నమస్కరించి బయటకి వచ్చాడు.

ఆయన వెళ్ళాక అవధాని భార్య బయటకొచ్చింది.

"అమ్మాయి ఫొటో ఇలాగివ్వండి!" అని ఆయన చేతిలోనుంచి ఫొటో తీసుకుని పరిశీలనగా చూసింది. మరుక్షణం ఆవిడ ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

"అమ్మాయి ముఖంలో లక్ష్మీకళ ఉట్టిపడుతోంది! ఈ అమ్మాయి నా కోడలయితే చాలు! మీరు కట్నకానుకల దగ్గర పేచీ పెట్టి ఈ సంబంధాన్ని వద్దనకండేం!"

అవధాని విచిత్రంగా నవ్వేడు. "మన నిలువెత్తు ధనం పోసినా ఈ సంబంధం మనకి అక్కర్లేదు"

"అదేమిటండీ? " అందావిడ తెల్లబోతూ!

"ఆయన చెల్లెలు కిరస్తానీ వాడిని చేసుకుందట!"

"నిజమా! మీకెవరు చెప్పారు? "

"ఎవరు చెప్పడమేమిటి? ఆయనే స్వయంగా చెప్పాడు!"

"ఇంకా నయం! దేముడు మనయందు వుండబట్టి ఆ విషయం ముందే తెలిసింది. 'వంశం ఎరిగి పిల్లను, వంగడం ఎరిగి గొడ్డుని తెచ్చుకోమన్నారు'. పిల్ల ఎంత అందంగా వుంటేనేం? వంశంలో మచ్చ వున్నాక! ఎలా చేసుకుంటాం? ఇంతోటి పెళ్ళి సంబంధానికి అయిదొందలు తగలేసి జాతకం చూపించడమెందుకు? జాతకాలు నప్పలేదని వాళ్ళకి ఫోన్ చేసి చెప్పండి" అందావిడ ఫొటోని బల్లమీద పడేస్తూ.

★ ★ ★

"ఏమయింది? అబ్బాయిని చూశారా? ఎలా వున్నాడు? " శకుంతల భర్తకి మంచి నీళ్ళిస్తూ అడిగింది.

"అబ్బాయికి హైదరాబాద్‌లో ఉద్యోగం. అమలాపురంలో లేడు!"

"అవునా! అతని ఫొటో అడిగి తీసుకోలేకపోయారా? "

"అడగలేదు! ఆయన మా అక్కచెల్లెళ్ళ వివరాలు, తమ్ముళ్ళ గురించి అడిగారు.. చెప్పాను!"

"ఊఁ!"

"కావేరి మతాంతర వివాహం చేసుకుందని కూడా చెప్పాను"

"ఏమిటీ? " తేలుకుట్టినట్టు ఉలిక్కిపడింది. "ఎందుకు చెప్పారు? "

"బయటివాళ్ళెవరి ద్వారానైనా తెలియడం కంటే, నేను చెప్పడమే మంచిదనిపించింది"

"మీ సంబంధానికో నమస్కారం! వెళ్ళి

రండి అన్నారా? " పళ్ళునూరుతూ అంది.

"లేదు. జాతకం నప్పితే పెళ్ళిచూపులకి వస్తామన్నారు"

"మన సంబంధం వాళ్ళకి వద్దని మీ ముఖం మీద చెప్పలేక, అలా చెప్పి వుంటారు! జాతకాలు నప్పలేదని ఫోన్ చేస్తారు చూడండి! మీకసలు తెలివితేటలు లేవేమిటండీ? కావేరి పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయాక మనకి, ఆమెకి సంబంధమేముంది? అసలు తను ఎక్కడ వుందో కూడా తెలియదు. మనకి తనకి రాకపోకలుగానీ ఉత్తర ప్రత్యుత్తరాలుగానీ లేవు. నూరు అబద్ధలాడి ఒక పెళ్ళి చెయ్యమన్నారు. అదేదో పెద్ద ఘనకార్యం చేసినట్టు చెబుతారా? " శకుంతల నుదురు బాదుకుంది.

"నిజం దాచడం మంచిది కాదు!" బలరామశాస్త్రి నిదానంగా అన్నాడు.

వారంరోజుల తర్వాత అవధాని ఫోన్‌లో చెప్పాడు. జయ జాతకం నప్పని కారణంగా తమ సంబంధాన్ని విరమించుకున్నామని. ఆ విషయం తండ్రి, తల్లితో చెప్పడం విని జయ నిశ్చింతగా ఊపిరి పీల్చుకుంది.

★ ★ ★

అమృత పెళ్ళయి నెలరోజులు. భర్త అనురాగపు వెల్లువలో తడిసి ముద్దవుతున్న ఆమెకి 'రోజులు ఎంత త్వరగా గడిచిపోతున్నాయో? ' అనిపిస్తోంది. ఆమె అత్తవారిది సిరిసంపదలు గల కుటుంబం. బావగారు శ్రీకాంత్, భర్త ప్రభాత్.. తండ్రి తమకి అప్పజెప్పిన వ్యాపారాన్ని విస్తృతం చెయ్యడానికి అహర్నిశలూ కష్టపడుతున్నారు. శ్రీకాంత్ భార్య విరజ గొప్పింటి అమ్మాయి. డబ్బున్నదాన్ననే అహం, గర్వం ప్రతి పనిలో ఉట్టిపడుతుంటాయి.

పెళ్ళికిముందు తల్లి చేసిన ఉద్బోధ అమృత మనసులో బలంగా నాటుకోడంతో పుట్టింటి గురించి ఏ సంగతీ అత్తవారింట్లో చివరికి భర్తకి కూడా చెప్పకూడదనుకుంది. అత్తగారితో తోటికోడలితో అవసరానికి మించి ఒక్కమాటా మాట్లాడదు.

ఆ రోజు సాయంకాలం విరజ అత్తగారి దగ్గరకొచ్చి కూర్చుంది. "నా గాజులు చూడండి అత్తయ్యగారూ!" అంటూ చేతిలో వున్న నగలపెట్టెని తెరిచి నాలుగు జతల బంగారు గాజులను చూపించింది.

"బాగున్నాయమ్మా! ఎప్పుడు చేయించుకున్నావు? " అడిగింది కృష్ణవేణి.

"మా అమ్మగారు నా బర్త్‌డేకి గిఫ్ట్‌గా ఇచ్చారు". గర్వంగా చెప్పింది.

"కిందటేడాది బర్త్‌డేకి పచ్చల సెట్ ఇచ్చారు కదూ!" ఆవిడ కోడలికి ఆమె తల్లి ఇచ్చిన బహుమతిని గుర్తుచెయ్యడానికి కాదు, అమృతకి విరజ అంతస్తేమిటో తెలియజెప్పాలని అంది.

"అవునండీ!" ఆమె నవ్వులో గర్వరేఖ పొడసూపింది.

"అక్కా! మీ అమ్మగారు మా పెళ్ళికి వచ్చారు కదూ? ఇదివరకు కూడా ఆవిడని చూసిన గుర్తుంది! మీ నేటివ్‌ప్లేస్ రాజమండ్రియా? " అక్కడే కూర్చున్న అమృత అడిగింది.

"అవును! బిజినెస్ కోసం హైదరాబాద్‌లో స్థిరపడ్డారు మా నాన్నగారు"

"మీ తాతగారి పేరు శ్రీహరి కదూ? దానవాయిపేటలో మీరు మా తాతగారి ఇంటి పక్కనే వుండేవారు. అప్పట్లో మా మేడ పక్కన పెంకుటిల్లు మీది. చిన్నప్పుడు మీ పెరట్లో మల్లెపూలు కోసి మనిద్దరం దండలు గుచ్చేవాళ్ళం గుర్తుందా? " ఉత్సాహంగా అడిగింది.

అమృత 'పెంకుటిల్లు' అనే మాట అనగానే విరజ ముఖం వెలవెలబోయింది.

"గుర్తులేదు!" అని దిగ్గునలేచి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

కృష్ణవేణి నవ్వుతూ అంది.. "అయితే మీరిద్దరూ బాల్య స్నేహితులన్నమాట!"

"అవునత్తయ్యగారు!"

"ఇప్పటికీ మీ మేడ మీ సొంతమేనా? "

"కాదండీ! మా బాబాయి తనకి ఆ ఇల్లు కావాలని మా నాన్నగారి వాటాకి విలువ కట్టించి డబ్బిచ్చాడు. ఆ డబ్బుతో వైజాగ్‌లో ప్లాటు కొనుక్కున్నారు మా నాన్నగారు" అంది అమృత.

విరజ అవమానంతో రగిలిపోతోంది. అత్తవారింట్లో తనేమో బంగారు చెమ్చా నోట్లో పెట్టుకుని పుట్టినట్టు బిల్డప్ ఇస్తూ వుంది. కానీ అమృత తను ఒకప్పుడు పెంకుటింట్లో వుండేదనే నిజానిచెప్పి అత్తగారిముందు అవమానపరిచింది. ఆ అవమానం "హా! పాంచాలీ!" అన్నంత గాఢ ముద్ర వేసింది ఆమె మనసులో! ఆ రాత్రి ఇంటికొచ్చిన శ్రీకాంత్ విరజ ముఖం మామూలుగా లేకపోవడం చూసి అడిగాడు.

"ఏం అలా వున్నావ్? "

కన్నీళ్ళు పెట్టుకుంటూ జరిగినదంతా చెప్పింది.

"అమృత చెప్పింది నిజమేనా? "

"అవును! అప్పట్లో మాకు ఆస్తిలేదు. మా నాన్నగారు ఆంధ్రా బ్యాంకులో కేషియర్‌గా పనిచేసేవారు. మా మామయ్య బిజినెస్ స్టార్ట్ చేసి మా నాన్నగారిని పార్ట్‌నర్‌గా జాయిన్ చేసుకునే వరకు మాది మధ్యతరగతి సంసారమే. కానీ ఇప్పుడు మా నాన్నగారు బోలెడు సంపాదిస్తున్నారు. ఆ మాటకొస్తే మన పెళ్ళినాటికే మేం స్థితిమంతులం! అలాంటి నన్ను, నా కాళ్ళ దగ్గర నిలబడడానికి కూడా పనికిరాని అమృత ఎంత మాటంది? " పళ్ళుకొరుకుతూ అంది.

"పెంకుటింట్లో వుండేదానివి అనడం ఒకప్పటి నీ స్టేటస్‌ని ఎత్తి చూపించడానికి కాదేమో విరజా? వాళ్ళ మేడ పక్కన ఇంట్లో నువ్వుండేదానివని గుర్తుచెయ్యడానికేమో? " అన్నాడు శ్రీకాంత్.

"మేడ పక్కన ఇల్లు అనొచ్చుగా? పెంకుటిల్లు అంటుందా? కచ్చితంగా నన్ను, మీ అమ్మగారి ముందు అవమానించడానికే!" ముక్కు ఎగబీలుస్తూ అంది.

## కొత్తగాలి...

**విజ్ఞానం ఒక సముద్రం**
**ఎంతగా తోడినా**
**తరిగిపోదు, ఇగిరిపోదు**

– జఫరుల్లాఖాన్,
మహబూబ్‌నగర్

మరునాడు డైనింగ్ టేబిల్ దగ్గర అందరూ బ్రేక్‌ఫాస్ట్ చేస్తుండగా వున్నట్టుండి విరజని అడిగేడు ప్రభాత్.

"ఏం వదినా! అమృత మీ పక్కింటి అమ్మాయని ఎప్పుడూ చెప్పలేదేం? మీరిద్దరూ చిన్నప్పుడు ఆడుకునేవారటగా? "

"ఏమో! ఎవరికి గుర్తు? చిన్నప్పుడు ఎంతోమందితో ఆడుకుంటాం! అందరినీ ఎలా గుర్తుపెట్టుకుంటాం? " పెదవి విరుస్తూ అంది. లోలోన ఆమె మనసు కుతకుతలాడిపోతోంది.

'మీ వదిన చిన్నప్పుడు పెంకుటింట్లో వుండేదని మొగుడితో కూడా చెప్పిందన్న మాట!' విరజ మనసు దెబ్బతిన్న పులిలా గాండ్రుమంటోంది. అమృతపై ఎలా ప్రతీకారం తీర్చుకోవాలా? అని ఆలోచిస్తోంది.

★ ★ ★

సత్య గదిలోకి వచ్చేప్పటికి, జయ టేబిల్ దగ్గర కూర్చుని చదువుకుంటోంది.

"అక్కా!" అని పిలిచింది.

దీక్షగా చదువుకుంటున్న జయ పలకలేదు.

"అక్కా!" బిగ్గరగా పిలిచింది.

జయ ఎంతగా తుళ్ళిపడిందంటే ఆమె చేతిలోని పుస్తకం జారి కింద పడింది.

"ఏమిటే! ఇక్కడే వున్నానుగా! ఎందుకలా గావుకేకలు వేస్తున్నావు? " కోపంగా

## కొత్తగాలి...

**చరవాణితో**
**అందరిదీ ఒకే ప్రపంచం**
**అంతర్జాలంతో**
**ఎవరి ప్రపంచం వారిది**

– ముడుంబ సీత,
భద్రాచలం

అడిగింది కింద పడిన పుస్తకాన్ని తీస్తూ.

"ప్రేమంటే ఏమిటక్కా?" సత్య స్తిమితంగా ఆమెకెదురుగా కుర్చీ లాక్కుని కూర్చుంటూ అడిగింది.

జయ తను పొరపాటుగా విందేమో అనుకుంది.

"ఏమిటీ?!" భ్రుకుటి ముడిచి చూస్తూ అడిగింది.

"ప్రేమంటే ఏమిటి?"

"ప్రేమంటే కలిసి జీవించడం.. కలిసి మరణించడం. అతని కోసమే జీవించి, అతని కోసమే మరణించాలన్న అర్పణ. నా ఊహల్లో అతను.. ఊపిరిలో అతను. నా శరీరాన్ని వదిలి అతని శరీరంలో పరకాయ ప్రవేశం చేసి మా ఇరువురి ఆత్మలూ ఒకే శరీరంలో కలిసి జీవించాలనే తపన!" ట్రాన్స్‌లో వున్నట్టుంది జయ. ఆమె కళ్ళు అరమోడ్పులయి వున్నాయి. పెదవులపై మధుర మనోజ్ఞమైన మంద హాసం నర్తిస్తోంది.

సత్య కళ్ళప్పగించి చూస్తుండిపోయింది. ఆమె చెప్పడం పూర్తయ్యాక అడిగింది "నువ్వు ఎవరినైనా ప్రేమించావా అక్కా?"

జయ ఉలిక్కిపడింది! "ఏయ్! ఏమిటా పిచ్చి ప్రశ్న?"

"నేను ప్రేమంటే ఏమిటని అడిగినదానికి, ప్రేమని ఫీలవుతున్నట్టు చెబుతుంటే!"

"నా మాట సరే! నువ్వెందుకలా అడిగావు? ప్రేమంటే ఏమిటో ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు?"

ఆమెకి ఉత్కళ గురించి చెప్పాలనిపించింది. కానీ పేరు చెప్పకుండా అంది.

"మా క్లాసులో ఒకమ్మాయిని ముగ్గుర బ్బాయిలు ప్రేమించారు"

"ముగ్గురా?"" నోరు తెరిచింది.

"అవును! ఇద్దరిని ఆ అమ్మాయి కాదంది! ఎందుకంటే వాళ్ళు డబ్బున్న వాళ్ళు కాదు కాబట్టి! మూడో అబ్బాయి ఎమ్.ఎల్.ఏ అనుచరగణంలో ముఖ్యుడి కొడుకు. ప్రేమిస్తున్నానంటూ అతను ఈ అమ్మాయి సెల్‌ఫోనుకి మెసేజ్‌లు పంపుతున్నాడు. ఆమె మనసులో ఏం వుందో తెలియదు కానీ, తన ఉద్దేశాన్ని మాత్రం బయటపెట్టింది. మనకంటే అన్నివిధాల ఎక్కువ స్థాయిలో వున్నవాడిని ప్రేమిస్తే, లైఫ్‌లో హేపీగా సెటిలయిపోవచ్చు అంటుంది. అది ప్రేమా?"

"కచ్చితంగా కాదు. అసలు ప్రేమ.." జయ చెప్పేది పూర్తికాకుండానే శకుంతల గది దగ్గరకొచ్చి పిలిచింది.

"సత్యా! జయా! కాఫీ తాగకుండా గదిలో కూర్చున్నారేమిటే?"

"వస్తున్నాం!" ఇద్దరూ బయటకొచ్చారు.

"ఇవాళ కార్తికపౌర్ణమి. నేను ఉపవాసం. స్నానం చేసి పూజ చేసుకోవాలి. రాత్రికి వంట నువ్వు చేస్తావా జయా?" శకుంతల అడిగింది.

"అలాగేనమ్మా!" జయ కాఫీ తాగుతూ పెరటి అరుగు మీద కూర్చుంది. ఎదురుగా తల్లి అస్పష్టంగా మంత్రాలు చదువుతూ నూతిలో నీళ్ళు తోడుకుని తల స్నానం చెయ్యడం కనిపిస్తోంది.

ఇంత మడి, ఆచారం పాటించే ఆవిడకి తను అన్యకులస్థుడిని ప్రేమిస్తోందని తెలిస్తే గుండె ఆగిపోతుందేమో! అతని గురించి తల్లికి, తండ్రికి చెప్పాలనుకుని.. ఎందుకు చెప్పలేకపోతోంది? ఎన్నాళ్ళు ఈ

విషయాన్ని గుట్టుగా దాస్తుంది? స్పెషల్ క్లాసులున్నాయనే నెపంతో ఆదివారం ఇంట్లోంచి బయటపడి అతని రూముకి వెళ్తోంది. అందమైన అబద్ధాలతో తల్లిని తండ్రిని దారుణంగా వంచిస్తోంది. జయ కళ్ళు పశ్చాత్తాపంతో తడి అవుతున్నాయి.

"ఏమిటే ఇంకా అలాగే కూర్చున్నావు? పెందరాళే వంట కానియ్యి! చదువులోపడితే తిళ్లూతిప్పలు గుర్తుండవు!" తల్లి హెచ్చరికతో చల్లారిన కాఫీని ఒక గుక్కలో తాగి, గ్లాసు అవతలపెట్టి, బియ్యం కడిగి స్టవ్ మీద పెట్టింది.

★ ★ ★

జయ సూర్యం గదికి వెళ్ళింది. ఆమెని చూడగానే అతని కళ్ళలో కోటి సూర్యుల కాంతి వచ్చింది.

"రా!" అతను చేతులు జాపాడు. ఆమె ఎప్పటిలా అతని చేతుల్లో వాలిపోలేదు. తల వంచుకుని అతనికి అడుగు దూరంలో నిలబడింది.

"ఏమయింది? ఎందుకలా వున్నావు?" ఆతృతగా అడిగేడు.

"సూర్యం! నాకు.. నేను.." ఆమె కళ్ళలో నీళ్ళూరాయి.

"ఏమయింది? మన పెళ్ళికి మీవాళ్ళు అంగీకరించలేదా?"

"అది కాదు! నేనింకా మన విషయం మావాళ్లకి చెప్పలేదు"

"ఎందుకని?"

"ధైర్యం చాలలేదు"

"నువ్విలా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చో! మీవాళ్ళు నీకు పెళ్ళి సంబంధం చూసి పెళ్ళి చేసేస్తారు!" చిరుకోపంగా అన్నాడు.

"ప్రస్తుత సమస్య పెళ్ళికాదు. జాతకాలు నప్పని కారణంగా నాన్నగారు చూసిన అమలాపురం సంబంధం ఫెయిలయింది"

"మరి?"

"నేను ప్రెగ్నెంటేమో అని అనుమానంగా వుంది!"

"డాక్టరు దగ్గరకి వెళ్ళావా?"

"ఈనెల పీరియడ్స్ రాలేదు!" జయ స్వరంలో భయం.

"కొంచెం ఆలస్యమయితే, అదే అని ఎందుకనుకోవాలి?"

నిజమే! వారం రోజులు ఆలస్యమయితే తనెందుకు భయపడుతోంది? జయకి రిలీఫ్‌గా అనిపించింది. తరువాత నిముషాలు వేగంగా గడచిపోయాయి.

"నీ దగ్గరకి వచ్చిన ప్రతిసారి ఇదే ఆఖరు, మన పెళ్ళయ్యే దాకా కలుసుకోకూడదనుకుంటాను. కానీ నిన్ను చూస్తే నాకేమవుతుందో నాకే తెలియదు!" జయ కళ్ళు అరమోడ్పులవుతున్నాయి.

"నాకూ అంతే!" అన్నాడు సూర్యం. అతని స్వరంలో నిషా!

అరగంట తరువాత ఆమె ఇంటికి వెళ్ళడానికి ఉద్యుక్తురాలయింది.

"నీకు ధైర్యం లేదు. నేను మీ ఇంటికొచ్చి మీ నాన్నగారితో మాట్లాడితేనే గానీ మన పెళ్ళయ్యేలా లేదు"

"ప్లీజ్! నువ్వు రావొద్దు సూర్యం! నేనే మాట్లాడతాను!"

"ఈ మాట మనం పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్న దగ్గరనుంచి చెబుతూనే వున్నావు. నువ్వు మీ వాళ్ళకి చెప్పేలోగా నీకు వాళ్ళు పెళ్ళి చేసేస్తారు. లేకపోతే పెళ్ళికి ముందే నువ్వు నెల తప్పుతావు!"

ఉలిక్కిపడింది జయ "ఏయ్!" అతన్ని కొట్టబోయింది.

అతను నవ్వుతూ తప్పించుకున్నాడు.

జయ ఇంటికి వస్తూ తన పిరికితనాన్ని తానే నిందించుకోసాగింది. తల్లిదండ్రుల దగ్గర తన ప్రేమ విషయం ఎన్నాళ్ళు దాచగలుగుతుంది? ఎప్పటికప్పుడు సూర్యం విషయాన్ని తల్లితో చెప్పాలనుకుంటూనే ధైర్యం చాలక మౌనం వహిస్తోంది. తనిలా జాప్యం చేస్తే తండ్రి తన

పెళ్ళి నిర్ణయించేయడం ఖాయం! ఈమధ్య తల్లి తన పెళ్ళి గురించి తండ్రి మీద ఎక్కువ వత్తిడి చేస్తోంది.

జయని సూర్యం మాటలు మరింత భయపెట్టసాగాయి. 'మన పెళ్ళికి ముందే నువ్వు నెలతప్పుతావు!' అనే మాట గుర్తొచ్చేసరికి ఆమె వెన్నులో చలి మొదల యింది. ఆమె మనసులో తను గర్భవతి నేమో అని ఏమూలో వున్న భయం అంతై, ఇంతై అన్నట్టు పెరిగిపోయి భూతంలా భయపెట్టసాగింది.

★ ★ ★

"మమ్మీ! నీకో విషయం చెప్పాలి!" కాలేజీ నుంచి వస్తూనే అంది ఉత్కళ.

"ఏమిటే? " కూతురికి స్నాక్స్, పాలు టేబిల్ మీద పెడుతూ అడిగింది వనజ.

"నా ఫ్రెండ్ సత్య వాళ్ళక్క జయ తెలుసా? "

"ఎందుకు తెలియదూ? తెలుసు!"

"ఆ అమ్మాయికి బాయ్‌ఫ్రెండ్ వున్నాడు"

"లవరా? !" వనజకి ఎవరి గురించైనా చెడు వినడమంటే గొప్ప సరదా!

"అవును! తరచు ఆ అబ్బాయి గదికి వెళ్తూ వుంటుంది"

"నీకెలా తెలుసు? "

"పార్థు చెప్పాడు"

"పార్థు ఎవరు? "

"నా క్లాస్‌మేట్"

పార్థు అనే ఆ అబ్బాయి కూతురికి కేవలం క్లాస్‌మేటే అయితే అతనితో ఇలాంటి విషయాలను మాట్లాడే చనువు ఎలా వచ్చిందని ఆవిడ కూతురిని నిలది య్యలేదు. శకుంతలగారి పెద్దమ్మాయికి ఎవడో లవర్ వున్నాడన్న విషయాన్ని వినగానే ఐస్‌క్రీమ్ తిన్నప్పుడు కలిగే ఏదో హాయి అయిన ఫీలింగ్ కలిగిందావిడకి.

"ఈ విషయం పార్థుకి ఎలా తెలుసు? "

"సూర్యం అద్దెకి వుండేది పార్థువాళ్ళ ఇంటి పక్కనే!"

"జయ లవర్ పేరు సూర్యమా? "

"అవును!"

తనకి కావలసిన సమాచారాన్ని కూతురి దగ్గర నుంచి సేకరించాక అంది. "ఇదుగో ఉత్కళా! నువ్వు అబ్బాయిలకి దూరంగా వుండు! సత్యతో ఫ్రెండ్షిప్ మానెయ్యి! నువ్వూ అలాంటిదానివే అనుకుంటారు"

"అయ్యో! పిచ్చిమమ్మీ! నాకామాత్రం తెలుసు! సత్య అలాంటిది కాదు. ఎప్పుడూ చదువు తప్ప దానికి వేరే ప్రపంచం లేదు. నేను చెప్పేది వాళ్ళక్క గురించి"

"ఆ అక్కకి చెల్లెలు కాదా? అది!" నిరసనగా అంది.

నేను ఎవరి గురించైనా మాట్లాడబోతే శకుంతల 'మనకెందుకండీ ఇతరుల సంగ తులు? ' అంటుంది. తన కూతుళ్ళేం చేస్తు న్నారో కూడా పట్టించుకోదన్నమాట! మ నసులో అనుకుంటూ "ఇంతకీ ఆ అబ్బా యిది ఏ కులం? " అని అడిగింది.

"తెలియదు మమ్మీ!"

"నువ్వు అబ్బాయిలకి దూరంగా వుండు! ఫలానా శంకరంగారమ్మాయి అంటే 'ఓహో!' అని నలుగురూ గొప్పగా చెప్పుకు నేలా వుండాలి!"

"అలాగే మమ్మీ!" బుద్ధిగా అంది.

వనజ తృప్తిపడింది. కానీ ఉత్కళ అప్ప టికే పార్థుతో పీకలోతు ప్రేమలో మునిగి పోయిందని ఆవిడకి తెలియదు.

ఆ రాత్రి భర్తతో చెప్పింది. "సత్య వాళ్ళక్క జయకి ఎవడో లవర్ ఉన్నాడట! ఆ అబ్బాయి గదికి తరచుగా వెళ్తుందట!"

"ఛ! నీకెవరు చెప్పారు? " శంకరం అప నమ్మకంగా అన్నాడు.

తనకీ విషయం ఉత్కళ ద్వారా తెలిసిం దని చెప్పకుండా "ఎవరు చెప్తేనేం? నాకు తెలిసింది" అంది.

"ఒక ఆడపిల్ల గురించి తప్పుడు మాటలు మాట్లాడకు! అది నిజమో? పుకారో? " కోపంగా అన్నాడు.

"నిజంగా నిజం!"

"చాలు! నోర్ముయ్! ఎవరో ఏదో చెబుతారు! విని వూరుకోవు! నువ్వు విన్న విషయం అందరికీ చెప్పెయ్యాలి! లేకపోతే కడుపు ఉబ్బరం తీరదు! నీ ఫ్రెండ్స్ కూడా నీలాంటి వాళ్ళే! పనీపాటా లేని మేళం!"

"అందరినీ మీలాగే వుండమంటారు. మీకు స్నేహితులు లేరు. మొహమాటానికైనా ఒక్క కోలీగ్‌నూ మన ఇంటికి టీకి పిలవరు. మీరు ఎవరింటికీ వెళ్ళరు. మనం సంఘజీవులం. ఇరుగుపొరుగువాళ్లతో పరిచయం, స్నేహం ఎప్పటికైనా అవసరం!"

"నిజమే! కానీ దేన్నికైనా కొన్ని హద్దులుంటాయి. అది మరచిపోకు. ఫ్రెండ్స్‌తో కబుర్లు చెప్పు. ఎవరి వ్యక్తిగత విషయాల్లోనూ తలదూర్చకు"

ముఖం చిట్లిస్తూ అంది.. "ఊళ్ళోవాళ్ల గోల నాకెందుకు?"

"అమ్మమ్మా! ఎంతమాట! పరంధామయ్యగారమ్మాయి ఎవరినో ప్రేమించి, పెద్ద వాళ్ళకి చెప్పకుండా పెళ్ళి చేసుకున్నా.. భాస్కరంగారమ్మాయి విడాకులు తీసుకున్నా.. అన్నీ నీకు చర్చనీయాంశాలే!"

వనజ ముఖం నల్లబడింది. "ఏదో మాటవరసకి చెప్పుకుంటాం! అయినా లోకం నోరు మూయించగలమా?"

"అదే తప్పు అంటున్నాను! ఈ పాడులోకంలో నువ్వు ఒకరివి అవకూడదు! నువ్వు ఒక వేలిని ఎవర్నికైనా చూపిస్తే, మిగతా నాలుగు వేళ్లూ నిన్ను చూపిస్తాయని మరచిపోకు! నీకు నచ్చని మనుషులతో స్నేహం చెయ్యకు! వాళ్ళలోని లోపాలని, బలహీనతలని ఎత్తి చూపించకు!"

భర్తతో వాదించలేక పళ్ళు కొరుక్కుంది.

జయ సంగతి ఎవరి దగ్గరా నోరు జారొద్దని మరోసారి హెచ్చరించాడు శంకరం.

★ ★ ★

జయ ఇంటికొచ్చేసరికి తండ్రి పేరిశాస్త్రితో మాట్లాడుతున్నాడు.

## కొత్తగాలి...

**ఆశ ఉంటే**
**మోడు కూడా చిగురు వేస్తుంది**
**ఆకుపచ్చ అందమై**
**నీడనిస్తుంది**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

పేరిశాస్త్రిని చూడగానే జయ గుండెల్లో ఏదో గుబులుగా అనిపించింది.

"మళ్లీ ఏదో పెళ్ళిసంబంధం తీసుకొచ్చి వుంటాడీయన. ఇక లాభంలేదు సూర్యం విషయాన్ని చెప్పెయ్యాలి!" అనుకుంది.

జయని చూడగానే పేరిశాస్త్రి "అదుగో! అమ్మాయి రానే వచ్చింది! అబ్బాయి ఫోటోని ఆమెకి చూపించండి! నచ్చవలసింది ఆమెకి కానీ, మనందరికీ కాదుగా?" అన్నాడు.

"అమ్మా! జయా!" తండ్రి పిలిచాడు.

ఆమె పుస్తకాలని లోపల పెట్టి వచ్చింది.

"ఏం నాన్నగారు?" తండ్రి ఎందుకు పిలిచాడో తెలిసినా, తెలియనట్టే అడిగింది.

"ఇదుగో! ఈ ఫోటో చూడు! శాస్త్రిగారు నీకో మంచి సంబంధం తెచ్చారు"

ఆమె నిరాసక్తతతో ఆ ఫోటోవైపు ఒకసారి చూసి, తిరిగి తండ్రికి ఇచ్చేసింది.

"అబ్బాయి నీకు నచ్చాడామ్మా?" తండ్రి ఆత్రుతగా అడిగాడు.

"అబ్బాయి తల్లిదండ్రులకి ఒక్కడే సంతానం! ఎల్.ఐ.సి.లో ఉద్యోగం చేస్తున్నాడు. కాకినాడలో ఇల్లు, ఆ పక్కనే పల్లెటూరిలో నాలుగెకరాల పొలం వున్నాయి" పేరిశాస్త్రి వృత్తిపరమైన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు.

"దానిముఖం! దానికేం తెలుసండీ!

మంచిచెడ్డలు చూసి పెళ్ళి చెయ్యవలసిన వాళ్ళం మేం. దానికి నచ్చవలసింది అబ్బాయి అందచందాలు! కుటుంబ సంప్రదాయం, ఆస్తిపాస్తులు మాకు నచ్చాలి! వాళ్ళకి అమ్మాయి నచ్చాలి! మేమిచ్చే కట్నకానుకలతో సంతృప్తిపడాలి" తల్లి తనింకా చిన్నపిల్లేనని, తామే సంబంధం తీసుకొచ్చినా తను కాదనదనే నమ్మకంతో చెబుతుంటే జయకి కన్నీళ్లొ చ్చాయి. తల్లిదండ్రులను ఎంత మోసం చేసిందోననే బాధతో వచ్చిన కన్నీళ్ళవి. తనపై పెంచుకున్న నమ్మకాన్ని చావుదెబ్బ తీసినందుకు ఆవేదనతో వచ్చిన కన్నీళ్ళవి.

ఆమె లోపలికొచ్చి తనకి తానే ధైర్యం చెప్పుకుంటూ, కన్నీళ్లు తుడుచుకుంది. 'ఇంకా ఆలస్యం చేస్తే తనకే నష్టం, సూర్యం విషయాన్ని ఈ రాత్రికే తల్లికి చెప్పెయ్యాలి' స్థిరంగా అనుకుంది.

ఆ రాత్రి భోజనాల దగ్గర ఆ పెళ్ళిసంబంధం ప్రస్తావన వచ్చింది.

"సంబంధం మంచిది! కుదిరితే జయ అదృష్టవంతురాలే!" అన్నాడు తండ్రి.

"మీరు సత్యహరిశ్చంద్రుని వారసునిలా అన్నీ నిజాలే చెప్తే, ఇదీ వెనక్కే వెళ్తుంది!" వ్యంగ్యంగా అంది శకుంతల.

"మా చెల్లెలి విషయమేనా? చెప్పనులే! గుట్టుగా వుంచవలసిన విషయాలను చెప్పడం వల్ల ఎంత నష్టమో అనుభవపూర్వకంగా తెలుసుకున్నానుగా? "

తలదించుకుని అన్నం తింటూ 'తన ప్రేమ విషయాన్ని ఎలా చెప్పాలా? ' అని ఆలోచిస్తున్న జయ వున్నట్టుండి లేచి పెరట్లోకి పరిగెత్తింది. తిన్న కొద్దిమాత్రం వాంతయిపోయింది. నోరు పుక్కిలించి లోపలకు వస్తుంటే శకుంతల అడిగింది.

"ఏమయిందే? పొద్దుట తిన్న అన్నం అరగలేదా? "

జయ తలూపింది. 'అవును, కాదు'ల మధ్య వుంది ఆ తలాడింపు. పెదవి విప్పితే దుఃఖం ఉప్పెనలా ముంచుకొచ్చేలా వుంది.

"కాసేపాగి మజ్జిగ తాగుదుగానిలే! వెళ్ళి చదువుకో!" 'ఏం పిల్లలో ఏమిటో! మరీ సుకుమారపు తిళ్ళు! పొద్దుట తిన్నది రాత్రికి అరగించుకోలేని జీర్ణశక్తి!' స్వగతంగా అంది.

జయ గదిలోకి వచ్చి పడుకుంది. తను నెల మీద వారం రోజులయినా బయటచేరకపోవడాన్ని, ఇప్పుడు వాంతి అవడంతో కలిపి ఆలోచిస్తే ఆమెకి భయంతో నిస్సహాయతతో ఏడుపొస్తోంది. అక్కడే కూర్చుని చదువుకుంటున్న సత్య గమనిస్తుందని బలవంతాన దుఃఖాన్ని నిగ్రహించుకుంటోంది.

కొద్దిసేపటి తరువాత శకుంతల గ్లాసుతో మజ్జిగ తెచ్చి కూతురిని లేపింది.

"నాకేం వద్దమ్మా! తాగాలని లేదు! పొద్దుట నుంచి కడుపులో బాగాలేదు" అంది. తన వాంతికి కారణం అజీర్తేనని నమ్మిస్తూ.

"పోన్లే! పడుకో!" అనేసి ఆవిడ వెళ్ళింది.

మరో రెండుగంటలకల్లా ఆ ఇంటిని నిశ్శబ్దం అలుముకుంది. జయ లేచి కూర్చుంది. సత్య గాఢనిద్రలో వుంది. గదిలో నుంచి బయటకొచ్చింది. పక్క గదిలోంచి తండ్రి గురక వినిపిస్తోంది. మెల్లిగా ఆ గది తలుపుల్ని తోసింది.

తండ్రి గాఢనిద్రలో వున్నాడు, తల్లి నేల మీద చాప పరచుకుని పడుకుని వుంది. జయ తల్లి పక్కనే కూర్చుని మెల్లిగా ఆవిడ భుజంపై తట్టింది.

"అమ్మా!" రెండుసార్లు పిలిచేసరికి ఆవిడ లేచింది.

"ఏమ్మా! నిద్ర పట్టలేదా? మళ్ళీ వాంత యిందా? "

"ఒక్కసారి బయటికి రామ్మా!" జయ స్వరం వణుకుతోంది.

ఆవిడ కూతురిని అనుసరించింది.

ఇద్దరూ వరండాలోకి వచ్చారు.

"ఏమిటే? "

"అమ్మా! మరి.. నాకు.."

"ఏమిటమ్మా? శాస్త్రిగారు చెప్పిన సంబంధం నచ్చలేదా? "

అవునన్నట్టు తల వూపింది.

"ఎందుకని? అన్నివిధాలా బాగున్న సంబంధమేగా? "

"నేను, సూర్యం అనే అబ్బాయిని ప్రేమించాను"

గుండె గొంతులోకొచ్చినట్టయిందామెకు!

"ఏమిటీ? !" శకుంతల కళ్ళు వెడల్పయ్యాయి.

"అవునమ్మా!"

"ఎవరా సూర్యం? ఈ వూరేనా? "

"ఈ ఊళ్లోనే బ్యాంకులో ఉద్యోగం"

"మన శాఖేనా? "

"మన కులం కాదు"

"ఏమిటీ? " శకుంతల సర్పదష్టురాలిలా చూస్తోంది. "కులంకాని వాడిని ప్రేమించానని చెబుతున్నావా? నువ్వు ప్రేమించానని చెప్తేమాత్రం మేమెలా అంగీకరిస్తామనుకున్నావు? " కోపంగా అంది. "ప్రేమించిందట ప్రేమ! వాడిని మరిచిపో! వాడితో నీ పెళ్ళి జరగదు. హవ్వ! ఎవరైనా వింటే నవ్విపోతారు. ఎలాంటి వంశం మనది? మీ మేనత్త చేసిన పని బయటపడితేనే నిన్ను పెళ్ళిచేసుకోడానికి ఎవరూ ముందుకు రారేమోనని భయపడి చస్తుంటే నువ్వు కూడా ఆ దారిలోనే నడుద్దామనుకుంటున్నావా? ఈ కుటుంబ పరువు ప్రతిష్ఠలేమవుతాయో ఆలోచించావా? "

"మా పెళ్లి జరిగి తీరాలమ్మా! ఎందుకంటే నేను నెల తప్పానేమో? అని అనుమానంగా వుంది"

"ఏమిటీ? " శకుంతల నెత్తిన పిడుగు పడ్డట్టు స్తంభించిపోయింది. "ఓసి పాపిష్టి దానా! నీకసలు సిగ్గుందటే? " ఆవిడ కూతురు జుట్టు పట్టుకుని ఎడాపెడా కొట్ట సాగింది. "నా కడుపున చెడబుట్టావు కదటే! నా కళ్ళుకప్పి ఎంత కథ నడిపావే దౌర్భాగ్యురాలా!" ఆవిడ ఆమెని కొట్టికొట్టి అలసిపోయినదానిలా నేల మీద చతికిల పడి ఏడవసాగింది.

"నేనేం పాపం చేశానని నాకిలాంటి శిక్ష విధించావు దేముడా? నీకు పూజలు చేశాను, ఉపవాసాలు చేశాను. నా మీద నీకెందుకు దయ కలగలేదు? నాకిలాంటి విషమపరీక్ష ఎందుకు పెట్టావు? " కనిపించని దేముడిని ఆక్రోశంతో నిలదీస్తోంది.

తల్లి కొట్టినదెబ్బలకి సొమ్మసిల్లినట్టు పడిపోయి వెక్కుతూ ఏడుస్తోంది జయ.

"అసలు దీనికంతటికీ కారకుడు మీ నాన్న! వయసొచ్చిన పిల్లని ఇంట్లో పెట్టుకుని కూర్చున్నారు. మంచిదికాదు, పెళ్ళిచెయ్యండని మొత్తుకున్నా వినలేదు" ఆవిడ కోపం వున్నట్టుండి భర్తపైకి తిరిగింది.

పూనకం వచ్చిన దానిలా వూగిపోతూ పడకగదిలోకి వెళ్ళి రౌద్రంగా అరిచింది.

"గుండెల మీద కుంపటిని పెట్టుకుని నిశ్చింతగా నిద్రపోతున్నారు? లేవండి!"

పీడకల కన్నట్టు ఉలిక్కిపడ్డాడు బలరామశాస్త్రి. "ఏమిటే? అప్పుడే తెల్లారిపోయిందా? " కళ్ళునులుముకుంటూ లేచాడు.

"మన బతుకులే తెల్లారిపోతున్నాయి! లేచి బయటికి రండి!"

దుఃఖంతో, ఆవేశంతో వణికిపోతున్న భార్యని చూసేప్పటికి ఆయన నిద్రమత్తు వదిలిపోయింది.

"ఏం జరిగిందే? " ఒక్క ఉదుటున మంచం మీద నుంచి లేచాడు.

"ఇంకా ఏం జరగాలండీ? మన కుటుంబ ప్రతిష్ఠ మరోసారి గంగలో కలిసిపోయింది" అంటూ ఆవిడ ఏడవసాగింది.

"ఏం జరిగిందో కాస్త అర్థమయ్యేలా చెబుతావా? "

"మన జయ, ఎవరో సూర్యమట.. వాడిని ప్రేమించింది! నెల తప్పిందేమో

అని అనుమానంగా వుంది"
ఆయన నిస్తేజుడయి వింటున్నాడు.
"మన జయ ఎవరినో ప్రేమించిందా? నీకు పిచ్చిపట్టిందా? " తేరుకుని అయోమయంగా అడిగాడు.
"పిచ్చిదాన్నయినా బాగుండేది! ఈ లోకంతో సంబంధం లేకుండా, నా లోకంలో నేనుండేదాన్ని! ఈ పాపాలని, ఘోరాలని నా కళ్ళతో చూసే దురదృష్టం వుండేది కాదు!" ఆవిడ గుండెలు బద్దలయ్యేలా ఏడుస్తోంది.
నిలువు గుడ్లేసుకుని చూస్తున్నాడాయన.
"అది మన కొంప ముంచేసిందండీ! మనల్ని నలుగురిలోను తల ఎత్తుకు తిరగనివ్వకుండా చేసేసింది"
ఆయన చలనం వచ్చినట్టయి, బయటికి నడిచాడు. జయ ఏడుస్తోంది. ఆ నిశ్శబ్ద రాత్రిలో ఆమె వెక్కిళ్ళ శబ్దం వికృతంగా ధ్వనిస్తోంది.
"అమ్మా! జయా! మీ అమ్మ చెప్పిందంతా నిజమేనా? " అడగలేక అడిగేడు.
జయ సమాధానం చెప్పలేదు. కానీ ఆమె దుఃఖం మరింత ఉధృతమయింది.
అసహాయతతో కూడిన ఆవేశంతో వణికి పోతున్నాడాయన. "ఛీ!" ఏవగింపుతో కూడిన తిరస్కారభావం ఆయన నోటివెంట ఛీత్కారంగా వెలువడింది.
"అసలు ఈ పరిస్థితికి కారకులు మీరే! ఆడపిల్ల ఎదుగుతోంది, పెళ్ళి చెయ్యాలనే ఆలోచన వచ్చిందా? ఎంతసేపు నా గోలే తప్ప, సంసారం మీకెప్పుడు పట్టింది? "
"అంటే.. నేను దానికి పెళ్ళి చెయ్యకపోవడం వల్లనే అది ఎవడినో ప్రేమించిందంటవా? అయినా ఇలాంటి విషయాలను ఆడవాళ్ళే బాగా గ్రహించగలుగుతారు! నేను అసమర్థుడినే! నువ్వు సమర్థురాలివేగా! అది కాలేజీ నుంచి తిన్నగా ఇంటికొస్తోందో? ఎక్కడికి వెళ్తోందో? కనిపెట్టలేకపోయావా? "
"అవును! నేను రోజూ దాంతో కలిసి అది చదువుతున్న కాలేజీకి వెళ్ళొస్తున్నాను కదూ! అది ఎక్కడికి వెళ్తోందో? ఏం చేస్తోందో? కనిపెట్టడానికి! అలా రోడ్లన్నీ బలాదూర్ తిరక్కపోతే ఆ పనేదో మీరే చెయ్యొచ్చుగా? "
ఆ ఇద్దరూ కాస్సేపు జయ పరిస్థితికి నువ్వే కారణమంటే.. నువ్వే కారణమని పరస్పరం నిందారోపణలు చేసుకున్నారు.
హఠాత్తుగా శకుంతలకి తామిద్దరు అసలు సమస్యని మరచిపోయి అనవసరంగా కలహించుకుంటున్నామనే విషయం గుర్తొచ్చింది.
"ఇప్పుడీ సమస్యని ఎలా పరిష్కరించాలో ఆలోచించండి!" అంది.
"పరిష్కారమా? " విరక్తిగా నవ్వేడాయన. "జయ ఆ అబ్బాయిని ప్రేమించి వూరుకోలేదు. ఆ ప్రేమ హద్దులు దాటింది. ఇంక చేసేదేముంది? " క్షణం ఆగి అడిగేడాయన "జయ నిజంగా నెల తప్పిందా? కేవలం అనుమానమా? "
ఆవిడ మనసులోనే లెక్కపెట్టుకుంది. "నెల మీద పది రోజులయింది! అదే కావొచ్చు! ఇందాక వాంతి చేసుకుంది కూడా! అయినా డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళి అనుమానం తీర్చుకోవాలి! నిజమే అయితే గుట్టుచప్పుడు కాకుండా ఆ పాపాన్ని కడిగించెయ్యడమే!" భర్తకు దగ్గరగా జరిగి ఆయన చెవిలో గుసగుసలాడింది.
"అంటే అబార్షన్ చేయిస్తావా? "
"నాకు తోచిన పరిష్కారం అదే! ఈ రోజుల్లో ఇవన్నీ మామూలే! మొన్నామధ్య వీరభద్రంగారమ్మాయికి అబార్షన్ చేయించి, ఏదో విషజ్వరం వచ్చిందని చెప్పుకున్నారట! మనమూ అలాగే చేద్దాం!"
"ఎవరికైనా తెలిస్తే? "
"ఎవరికైనా తెలిసేలా చేస్తామా ఏమిటి? మన పిల్లని మనమే వీధిన పడేసుకుంటామా? అది చేసిన తప్పుని

నిప్పులా మన గుండెల్లో దాచుకుని, దాని జీవితాన్ని చక్కదిద్దవలసిన బాధ్యత మనపై ఉంది"

ఏం చేస్తే బాగుంటుందో భర్తకి వివరించింది శకుంతల.

బలరామశాస్త్రి కేవలం శ్రోత! ఆవిడ చెప్పిన దానికి తల వూపడం మినహా ఏమీ చెయ్యలేకపోయాడు.




"ఎలా వున్నావ్ అమృతా?" ఫోన్‌లో తల్లి స్వరం వింటూనే ఉత్సాహంగా అంది.

"నేను బాగున్నానమ్మా! నువ్వూ, నాన్నగారు కులాసాగా వున్నారా?"

"మా సంగతి అలా వుంచు! నీ మాట చెప్పు! నువ్వు సంతోషంగా వున్నావా? అబ్బాయి మంచివాడేనా? మీ ఇద్దరికీ మనసు, మాట కలిశాయా?"

"ఆయన చాలా మంచివారమ్మా! మా మధ్య ఎలాంటి విభేదాలూ లేవు"

"నిజం చెప్పు! అందమైన అబద్ధాలతో అంజలిలా మమ్మల్ని మోసం చెయ్యకు!" ఆవిడ స్వరం గాద్గదికంగా వుంది.

"నేను అబద్ధం చెప్పడం లేదు. నిజమే చెబుతున్నాను. ప్రభాత్ చాలా మంచివారు. మా అత్తగారు కూడా మంచివారు. మరచిపోయాను, మా తోటికోడలు విరజ ఎవరనుకున్నావు? రాజమండ్రిలో మన ఇంటి పక్కనే వుండేవారే శ్రీహరిగారు. ఆయన మనుమరాలే! నేను తను చిన్నప్పుడు ఆడుకునేవాళ్ళం గుర్తుందా?"

"తెలుసు! నీ పెళ్ళిలో విరజ వాళ్ళమ్మగారిని గుర్తుపట్టి పలకరిస్తే, ఆవిడ నేనెవరో తెలియనట్టు ముఖం పెట్టింది. నేను ఫలానా అని చెప్పాను. జ్ఞాపకం రావడం లేదన్నారు. చాలా ఏళ్ళయింది కదా! గుర్తుపట్టి వుండరు. అప్పట్లో పండుగలప్పుడు వాళ్లూ, మనం పిండివంటలు ఇచ్చి పుచ్చుకునే వాళ్ళం!" అంది శ్రీదేవి.

"ఇంకేమిటమ్మా విషయాలు! అందరూ బాగున్నారా?" అడిగింది అమృత.

"శ్రీవల్లి ఏం చేసిందో తెలుసా?"

"ఏం చేసింది?"

"ఎవరో తక్కువ కులం అబ్బాయిని పెళ్ళి చేసుకుంది"

"నిజమా?" షాకయింది అమృత.

"పైగా అది పెళ్ళిచేసుకున్నవాడు ఒక ఆటోడ్రైవర్!"

"ఏమిటీ?" ఆమెకి నోట మాట రాలేదు.

"అది ఆ అబ్బాయిని పెళ్ళిచేసుకుని మామయ్య ఆశీర్వాదం కోసం వాళ్ళింటికి వచ్చిందట! మామయ్య దాన్ని ఈ జన్మలో నీ ముఖం నాకు చూపించవద్దని చెప్పాడట పాపం! మామయ్య కుమిలిపోతున్నాడే! నిన్న నేను, మీ నాన్నగారు వాళ్ళింటికి వెళ్ళి, ధైర్యం చెప్పివచ్చాం! మనసులోని బాధని నీతో పంచుకోవాలని చెప్పా. ఈ విషయాన్ని మీ ఆయనతో చెప్పకు!"

"చెప్పను!" అంది అమృత.

శ్రీదేవి మరోసారి బాధని వ్యక్తం చేసి, పొరబాటున కూడా నోరు జారొద్దని కూతురిని హెచ్చరించి ఫోన్ పెట్టేసింది.

అమృతకి మేనమామ గిరీశం గుర్తొచ్చాడు. స్కూల్ టీచర్‌గా పనిచేసి రిటైరయ్యాడాయన. మగపిల్లవాడు పుడతాడనే ఆశతో నలుగురు ఆడపిల్లలని కన్నాడు. ముగ్గురమ్మాయిలకి పెళ్లిళ్ళు చెయ్యడానికి నానా అగచాట్లు పడ్డాడు. ఆఖరమ్మాయి

అయిన శ్రీవల్లి కుటుంబ పరువుప్రతిష్ఠలని ఆలోచించకుండా కులాంతరవివాహం చేసుకోడం ఆశ్చర్యాన్ని, బాధని కలిగించింది.

ఆ రాత్రి ముభావంగా వున్న అమృతని తరిచి తరచి అడిగేడు ప్రభాత్. "అలా వున్నావేం? " అని.

"కొంచెం తలనొప్పిగా వుంది" చెప్పింది.

★ ★ ★

జయ దగ్గరికి కాఫీ గ్లాసుతో వచ్చింది శకుంతల. "లే, లేచి కాఫీ తాగు!" ఆవిడ స్వరం ఆజ్ఞాపిస్తున్నట్టుంది. కూతుర్ని చూస్తే మనశ్శరీరాలు భగ్గుమంటున్నాయి.

'ఎంత తెగించింది! ఒళ్ళు కొవ్వెక్కి కులం కానివాడిని ప్రేమించి.. ఎంత జాగ్రత్తగా పెంచితేనేం? మేనత్త రక్తమే దీనిలోనూ ప్రవహిస్తోంది' నిరసనగా అనుకుంది.

జయ కళ్ళు విప్పి చూసింది. ఆమె కనురెప్పలు నీరసంతో వాలిపోతున్నాయి. ఖాళీ కడుపులోంచి వికారం ఎగదన్నుకొస్తోంది. తల్లి రాత్రి కొట్టిన దెబ్బలికి ఒళ్ళంతా పచ్చిపుండులా వుంది. అంతకు మించి మనసుకి తగిలిన దెబ్బ బాధ పెడుతోంది.

'సూర్యం!' ఆమె మనసు మూగగా రోదిస్తోంది. కళ్ళెత్తి తల్లి ముఖంలోకి చూసింది. ఆ కళ్ళలోని ఏహ్యత, తిరస్కారాలు ఆమె మనసుని కోస్తున్నాయి.

"నేను సూర్యాన్ని ప్రేమించిన విషయం మీ దగ్గర దాచడం తప్పేనమ్మా! నన్ను క్షమించు"

"నువ్వు చేసింది చిన్న తప్పేనని క్షమించమంటున్నావా? "

"మన కులం కాకపోవడం ఒక్కటే తప్పు, అతను నన్ను పెళ్ళి చేసుకోడానికి అన్నివిధాల అర్హుడమ్మా! చాలా మంచివాడు! నేనంటే అతనికి ప్రాణం"

"నోర్ముయ్!" శకుంతల పళ్ళ బిగువున అరిచింది. "మరోసారి వాడి పేరెత్తితే చంపేస్తాను!" కాఫీ గ్లాసుని కూతురి ముందు పెట్టి, ఆవిడ విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

జయ కళ్ళు, ముఖం ఉబ్బి వుండడం సత్య గమనించింది. ఆ అమ్మాయిది మొద్దునిద్ర. రాత్రి జరిగిన గొడవ ఆమెకి తెలియదు. కానీ, పొద్దుట కాఫీ తాగుతుండగా తల్లి పళ్ళ బిగువున ఆగ్రహంగా అన్న మాటలు ఆమె చెవిన పడ్డాయి.

'వాడి పేరెత్తితే చంపేస్తాను!' ఎవరు? ఎవరావ్యక్తి? తల్లి ఆగ్రహానికి కారకుడైన ఆ వ్యక్తి? ఆమెకి భరించలేనంత సస్పెన్స్‌గా వుంది. జయ ముఖంలోని విషాదం, ఆమె కన్నీళ్ళు ఏదో జరిగి వుంటుందని చెప్పకనే చెబుతున్నాయి. కానీ ఏం జరిగి వుంటుందో ఆమె ఊహకి అందలేదు.

"ఏం జరిగింది అక్కా? ఎందుకలా వున్నావు? " జయని అడిగింది.

జయ కళ్ళలో మళ్ళీ నీళ్ళూరాయి. చెల్లెలికి జరిగింది చెప్పకూడదనుకుందామె.

"ఏం లేదు!" అంది ఎటో చూస్తూ.

"మరి నువ్వెందుకలా వున్నావు? "

"సత్యా! నువ్వివేళ కాలేజీకి వెళ్ళడం లేదా? " బలరామశాస్త్రి అడిగాడు. ఆయన ముఖం మామూలుగా లేదు.

"వెళ్తాను నాన్నా!"

"వెళ్ళి, త్వరగా తయారవు!"

తను అక్కతో మాట్లాడ్డం ఆయనకిష్టం లేదనిపించింది సత్యకి. ఆమె టవల్ తీసుకుని బాత్‌రూములోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

శకుంతల వనజ దగ్గరకొచ్చింది.

"రేపు విజయవాడ వెళ్దామనుకుంటున్నానండీ! ఒంట్లో బాగాలేదు. డాక్టరుకి చూపించుకుందామని"

"అరెరె! ఏమిటి సుస్తీ? " ఆదుర్దాగా అడిగింది వనజ.

"బ్లీడింగ్ ఎక్కువగా అవుతోంది. ఈమధ్య కాలంలో అందరికీ ఆపరేషన్లు చేస్తున్నారుగా! భయం వేస్తోంది"

"అవును! ముందే చూపించుకోవడం మంచిది"

"జయని నాతో తీసుకెళ్తున్నాను. మేం తిరిగి వచ్చేప్పటికి నాలుగయిదు రోజులు పడుతుందేమో! మేం వచ్చేవరకు సత్యని మీ ఇంట్లో వుంచుకుంటారా? "

"అయ్యో! దానికేం భాగ్యం? తప్ప కుండా!"

శకుంతల థాంక్సు చెప్పి వెళ్లిపోయింది.

ఆ రోజు సాయంకాలం ఉత్కళతో బాటు తమ ఇంటికి వచ్చిన సత్యని ఆరాగా అడిగింది వనజ.

"ఇక్కడ ఇంతమంది డాక్టర్లుండగా మీ అమ్మగారు విజయవాడ వెళ్ళడమెందుకు? "

"విజయవాడలో డాక్టరు వెంకటేశ్వర్రావు అని మా నాన్నగారికి దూరపు బంధువు వున్నారు. ఆయన భార్య కూడా డాక్టరే! ఆవిడ దగ్గర చూపించుకుంటారట!" తల్లి చెప్పిన మాట యథాతథంగా చెప్పింది

"అలాగా!" అని వూరుకుంది వనజ.

బలరామశాస్త్రి కుటుంబం విజయవాడ నుంచి వచ్చిన మరునాడు వనజ శకుంత లని పలకరించడానికి వెళ్లింది.

"మీకు చాలా శ్రమ ఇచ్చాను. మా సత్య మిమ్మల్నేమీ ఇబ్బంది పెట్టలేదు కదా!"

"శ్రమకేంవుంది? సత్యకి ప్రత్యేకంగా చేసింది ఏముంది? ఉత్కళతో బాటే తను కూడా! మీ ఒంట్లో ఎలా వుంది? "

"రిపోర్టులన్నీ నార్మల్‌గానే వున్నాయి. మందులు రాసిచ్చారు"

"ఆపరేషన్ అవసరం లేకపోవచ్చులెండి! ఇంకా ఏదో అనబోతున్న వనజ అప్పుడే అక్కడికి వచ్చిన జయని చూసి నోటమాట రానట్టయింది. చిక్కిశల్యమైపోయి తెల్లగా పాలిపోయివున్న ఆమెని చూసి "ఒంట్లో బాగా లేదామ్మా? " అనడిగింది.

సమాధానం శకుంతల నుంచి వచ్చింది. "విజయవాడ వెళ్లాక, జయకి బాగా జ్వరం వచ్చింది" అని.

"మంచినీళ్ళు కావాలంటే నన్ను పిలవా చ్చుగా! మంచం మీద నుంచి లేచి ఎందు కొచ్చావు? కళ్ళు తిరిగి పడతావు!" ఆప్యా యంగా అంటూ కూతుర్ని పొదివి పట్టు కుని గదిలో పడుకోబెట్టి వచ్చింది. వస్తూ ఆ గది తలుపుల్ని దగ్గరికి వెయ్యడం మరి చిపోలేదు.

"బంగారు బొమ్మలా వుండే పిల్ల! కళ్ళలో ప్రాణాలు పెట్టుకుని ఎలాగయిపో యింది!" అంది సానుభూతిగా వనజ.

ఆమె మరేమీ ప్రశ్నించకుండా శకుంతల టాపిక్ మార్చి మరేదో మాట్లాడసాగింది.

మూసిన తలుపుల వెనుక గదిలో పడు కుని వున్న జయకి ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది.

తన కలలన్నీ నాశనమయ్యాయి. ఆ రోజు.. తన గర్భంలో పెరుగుతున్న సూర్యం ప్రతిరూపాన్ని డాక్టరు తన శరీరం నుంచి వేరు చేసిన రోజు తన శరీ రంలోని సున్నితమైన భాగాన్ని ఎవరో నిర్దాక్షిణ్యంగా నరికేసినట్టు బాధపడింది. ఆమెకి శారీరకంగా ఏ బాధా లేదు. కొన్నా ళ్ళపాటు వాడమని డాక్టరిచ్చిన మందులని యంత్రంలా మింగుతోంది. తల్లి శాసనం ప్రకారం వేళకి ఇంత తింటోంది. కానీ ఆవిడ శాసించినట్టు సూర్యాన్ని మరిచిపోలే కపోతోంది. మరచిపోదామని ఎంత ప్రయత్నించినా అతను తన హృదయ పీఠం నుంచి తొలగిపోవడం లేదు.

సూర్యాన్ని ప్రేమిస్తున్న విషయాన్ని తల్లికి చెప్పడం తన తప్పా? అతన్ని ప్రేమించిన విషయాన్ని గుట్టుగా గుండెల్లో దాచుకుని అతన్ని రహస్యంగా పెళ్ళిచేసు కుని వుంటే వీళ్ళేం చేసేవారు? వాళ్ళ పెద్ద రికానికి విలువనిచ్చి తన ప్రేమ విషయం వాళ్లతో చెప్పడమే తను చేసిన తప్పా? తన మేనత్తలా ప్రేమించిన వ్యక్తితో వెళ్లి పోయి లోకం దృష్టిలో 'లేచిపోయింది' అనే పేరు తెచ్చుకోవాలనుకోలేదు. పెద్దల

అనుమతితో అతన్ని పెళ్లి చేసుకోవాలనుకుంది. అదే తను చేసిన తప్పా? జయ కుమిలిపోసాగింది.

★ ★ ★

జయకి జ్వరమొచ్చిందని శకుంతల చెప్పిన విషయం వనజకెందుకో నమ్మశక్యంగా అనిపించడంలేదు. ఆ రాత్రి భర్తతో అంది.

"ఈ వూళ్ళో ఇంతమంది డాక్టర్లుండగా శకుంతల విజయవాడ వెళ్ళడమేమిటి? ఆవిడ చెప్పిందంతా అబద్ధం! జయకి జ్వరమొచ్చిందని చెబుతోంది"

"నిజంగా ఆ అమ్మాయికి జ్వరమేనేమో!"

"జయకి అబార్షన్ చేయించి వుంటారు!"

"ఛ! ఏం వాగుతున్నావు? " శంకరం చిరాగ్గా అరిచాడు.

"ఆ పిల్ల వాలకం చూస్తే నాకు అలాగే అనిపించింది"

"నువ్వు నోరు మూస్తావా? లేదా? ఒక ఆడపిల్ల గురించి అలాగేనా మాట్లాడ్డం? శకుంతలగారు నీ ఫ్రెండంటావు! ఏవేవో ఊహించుకుని వాళ్ళ అమ్మాయిపై నింద మోపడం చాలా తప్పు! ఈ విషయం ఇక్కడితో మరిచిపో! ఎవరి దగ్గరైనా నోరుజారావంటే చంపేస్తాను నిన్ను!" భర్త అరుపులకి వనజ నోరు మూతపడింది.

గొణుక్కుంటూ ఇవతలకి వచ్చిన ఆవిడకి ఎదురుగా ఉత్కళ సెల్‌ఫోన్‌లో మాట్లాడ్డం కనిపించింది. ఆమె కళ్ళు అర మోడ్పులయి వుండడం, ముఖంలోని నునుసిగ్గు చూసిన ఆమెకి మొదటిసారిగా కూతురిపై అనుమానం వచ్చింది.

"ఉత్కళా!" బిగ్గరగా పిలిచింది.

ఆమె అదిరిపడి తల్లివైపు చూసింది.

"ఎవరది ఫోన్‌లో? "

"నా ఫ్రెండ్ పా.. పరిమళ!" ఉత్కళ క్షణం తడబడినా మళ్లీ నిబ్బరంగా చెప్పింది.

"వెళ్ళి చదువుకో! అస్తమానం ఫోన్‌లో మాట్లాడకు! సెల్‌ఫోను బల్లమీద పెట్టి వెళ్ళి చదువుకో!" కసిరినట్టు అంది.

"అలాగే మమ్మీ!" ఉత్కళ బుద్ధిగా సెల్‌ఫోనుని డైనింగ్ టేబుల్ మీద పెట్టి గదిలోకి వెళ్ళింది. వెళ్ళే ముందు పార్థు నెంబర్‌ని డిలీట్ చేసి ఫోను స్విచాఫ్ చేసింది.

★ ★ ★

విరజ తన అయిదేళ్ళ కొడుకు రవిని తీసుకుని, వాడు చదువుతున్న కాన్వెంట్‌కి బయలుదేరింది. వెళ్ళే ముందు అత్తగారితో చెప్పింది.

"ఇవాళ పేరెంట్ టీచర్ మీటింగ్ ఉంది. నేను స్కూలుకి వెళ్ళొస్తానత్తయ్యా"

"వెళ్లి రామ్మా" అంది కృష్ణవేణి.

స్కూల్ రాగానే డ్రైవరు కారాపి డోరు తెరచి పట్టుకున్నాడు. స్కూల్‌లో అప్పటికే కొంతమంది పేరెంట్సు వచ్చివున్నారు. ఇంకా కొంతమంది వస్తున్నారు. ఇంకా మీటింగ్ స్టార్టవలేదు. విరజ రవి అడుగుతున్న ప్రశ్నలకి ఓపికగా జవాబు ఇస్తోంది. ఇంతలో ఒక యువతి విరజ దగ్గరకొచ్చి నవ్వుతూ పలుకరించింది.

"బాగున్నారా? "

ఆమెకి ఎంత ఆలోచించినా ఆ యువతి ఎవరో గుర్తురావడంలేదు.

"మా టీచర్!" రవి రహస్యంగా తల్లి చెవిలో గొణిగి లేచి నిలబడి విష్ చేశాడు.

"గుడీవినింగ్ టీచర్!"

## కొత్తగాలి...

**మతం**
**మంచిని పెంచాలి**
**మనిషిని**
**చంపకూడదు**

– ధన్వూరి శ్రీధరాచార్యులు,
సీతారాంబాగ్, హైదరాబాద్

"గుడీవినింగ్! రవి మీ అబ్బాయా?" ఆమె చనువుగా అడిగింది.

"అవును! మీకు నేనెలా తెలుసు?" విరజ అడిగింది.

"మిమ్మల్ని అమృత పెళ్లిలో చూశాను. నేను అమృత మేనమామ కూతురిని. ఇక్కడే తెలుగు టీచర్‌గా పనిచేస్తున్నాను"

విరజ ఆమెని ఆపాదమస్తకం శల్యపరీక్ష చేస్తున్నట్టు చూసింది.

'చవక రకం నైలాన్ చీర.. మెడలో రోల్డ్‌గోల్డ్ గొలుసు.. చేతులకి మట్టిగాజులు.. ధరించి వున్న ఈమె అమృత మేనమామ కూతురా?'

"మీ పేరు?"

"శ్రీవల్లి"

"మీరిక్కడ పనిచేస్తున్నట్టు అమృత నాకు చెప్పలేదే?"

"దానికి తెలిసివుండదు లెండి!"

"మీవారు కూడా ఇక్కడే పనిచేస్తున్నారా?"

"లేదండి! ఆయన ఆటోడ్రైవర్"

ఆమె చెప్పింది విన్న విరజ కనుబొమ్మలు పైకి లేచాయి! "మన కులంలో ఆటోడ్రైవర్‌గా ఎవరూ పనిచెయ్యరే!"

"ఆయన మన కులం కాదు"

"మీది లవ్ మేరేజా?"

"అవునండీ!"

విరజకి అమృతని అవమనించడానికి ఒక ఆధారం దొరికింది. "మా అబ్బాయి తెలుగులో వీక్ అండీ! మీరు ట్యూషన్ చెబుతారా?"

"తెలుగు మన మాతృభాష కదండీ! తెలుగులో వీక్ ఏమిటి?" నవ్వింది.

"ఇంట్లో నేను, మావారు వాడితో ఇంగ్లీషులో మాట్లాడతాం! అదే పెద్ద ప్రాబ్లమ్! నేను తెలుగు టీచ్ చేస్తే నన్ను లెక్కచెయ్యడు. అమ్మని కదా! నా దగ్గర భయం వుండదు"

శ్రీవల్లి నవ్వింది.

"మీకు నెలకు రెండువేలు ఫీజు ఇస్తాను. మీరు రవికి ట్యూషన్ చెప్పడానికి మా ఇంటికి వచ్చినా సరే! లేకపోతే వాడిని మీ ఇంటికి పంపించమన్నా సరే"

ఆమె ఆఫర్ చేసిన అమౌంట్, రవికి ట్యూషన్ చెప్పడానికి శ్రీవల్లిని అంగీకరించేలా చేసింది.

ప్రస్తుతం తనున్న పరిస్థితిలో మరో రెండువేలు ఆదాయం పెరగడం ఆమెకి సంతోషాన్ని కలగజేసింది.

"మీరు రవిని మా ఇంటికి పంపండి!"

"అలాగే! మీ ఇంటి అడ్రస్ చెప్పండి!"

శ్రీవల్లి చెప్పింది. లోయర్ ఇన్‌కమ్ గ్రూప్ వాళ్ళు నివసించే కాలనీ అది.

విరజ సందేహించకుండా రవిని ట్యూషన్‌కి ఆమె ఇంటికి పంపడానికి ఒప్పుకుంది.

ఆ రాత్రి శ్రీకాంత్ ఇంటికి రాగానే విరజ చెప్పింది.. "అమృత మేనమామ కూతురట! మన రవి చదివే స్కూల్లోనే టీచర్‌గా పనిచేస్తోంది"

అయితే ఏమిటన్నట్టు చూశాడతను.

"ఆమె ఇంటర్‌కేస్ట్ మేరేజ్ చేసుకుంది! ఆమె భర్త ఆటోడ్రైవరట!"

"ఛీ! ఛీ!!" అన్నాడు అప్రయత్నంగా!

"ఆమెని రవికి ట్యూషన్ చెప్పమన్నాను"

"ఏ సబ్జెక్టు చెబుతుంది?"

"తెలుగు"

"తెలుగుకి ట్యూషన్ ఎందుకు?"

"ఎందుకంటే.." విరజ తన పథకాన్ని చెప్పింది. "దెబ్బతో అమృతకి పొగరణిగిపోవాలి! లేకపోతే మేం పెంకుటింట్లో వుండేవాళ్లమని మీ అమ్మగారి ముందు నన్ను అవమానిస్తుందా? అసలు ఇలాంటి వంశంలోని అమ్మాయిని ఎలా వరించాడండీ మీ తమ్ముడు?"

"ఏమో! వాడికే తెలియాలి!" చీదరగా ముఖం పెట్టాడు శ్రీకాంత్.

★ ★ ★

"నమస్కారమండీ!" అంటున్న ఆ

యువకుడి వైపు భయంగా చూస్తుండి పోయాడు బలరామశాస్త్రి. అతను అందంగా, హుందాగా వున్నాడు. పెదవులపై చిరునవ్వు, చేతులు జోడించడంలోని నమ్రత.. చూడగానే సదభిప్రాయం కలగ చేసేలా వున్నాడు.

"నమస్కారం! మీరు..? " అర్థోక్తిగా అన్నాడు.

"నా పేరు సూర్యం! ఇక్కడే బ్యాంకులో పనిచేస్తున్నాను. మీ అమ్మాయి జయ నా గురించి మీకు చెప్పే వుంటుంది!"

బలరామశాస్త్రి చేతిలోని జర్దా డబ్బా కింద పడిపోయింది. ఆయన అప్రయత్నంగా లేచి నిలబడ్డాడు.

"ఎందుకొచ్చావు? " ఆయన చాలా కోపంగా ఆ ప్రశ్న అడిగాననుకున్నాడు. కానీ ఆయన స్వరం నుంచి పేలవంగా ధ్వనించాయి ఆ మాటలు.

"జయ కోసం ఆమె చదివే కాలేజీకి వెళ్ళాను. జయకి జ్వరంగా వుందని ఆమె ఫ్రెండ్ చెప్పింది. తనని చూడాలని వచ్చాను"

జయకి అబార్షన్ చేయించి సమస్యని కొంతవరకు పరిష్కరించామని అనుకుంటున్న తరుణంలో, సూర్యం ఆమె కోసం ఇంటికి రావడంతో సమస్య మళ్ళీ మొదటికే వచ్చిందా? అని అనిపిస్తోందాయనకి.

శకుంతల ఏదో పనిమీద బయటికి రాబోయి, కొత్తవ్యక్తిని చూసి లోపలికి వెళ్ళిపోబోయింది.

"జయని ఒక్కసారి పిలుస్తారా? " నమ్రతగా అడిగాడు.

అతని నోటి వెంట 'జయ' అన్న పేరు వినగానే శకుంతలకి అతను సూర్యమేమో అని అనుమానం వచ్చింది. లోపలకి వెళ్ళిపోబోయినామె పైటకొంగుని భుజం మీదుగా ముందుకి లాక్కుని బయటకొచ్చింది.

"మీరు..? " అతని వంక చూస్తూ

# చతుర ప్రవేశిక

## డిసెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. అంజలి భర్త? | 6. విరజ కొడుకు? |
| జ. | జ. |
| 2. వనజ కూతురు? | 7. శ్రీవల్లి భర్త ఉద్యోగం? |
| జ. | జ. |
| 3. శకుంతల భర్త? | 8. చలపతి స్నేహితుడు? |
| జ. | జ. |
| 4. జయ ప్రేమించింది? | 9. 'కన్‌వర్జేషన్ ఇన్ ది కెథడ్రల్' రచయిత? |
| జ. | జ. |
| 5. సంధ్య ఎక్కడ ఉంటుంది? | 10. 'జీవనది' రచయిత్రి? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ---------------------------------------- వయసు (   )

చిరునామా: ----------------------------------------------------

-------------------------- పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

అర్థోక్తిగా అడిగింది.

"సూర్యం..!" బలరామశాస్త్రి గొణుగుతున్నట్టు అన్నాడు.

అతని పేరు వినగానే ఆవిడ ముఖంలో క్షణకాలం అనేక రంగులు మారాయి. మరుక్షణం ముఖంలో చిరునవ్వుని తెచ్చి పెట్టుకుంది.

"సూర్యం అంటే నువ్వేనా బాబూ! జయ నీగురించి అంతా చెప్పింది. మా అమ్మాయి చెప్పిన దానికంటే, నేను నీ గురించి ఊహించిన దానికంటే.. నువ్వెంతో ఉన్నతంగా వున్నావు!"

సూర్యం ముఖంలో ఆనందంతో కూడిన చిరునవ్వు మెరిసింది. "జయకి జ్వరంగా వుందని తెలిసి ఆమెని చూడాలని వచ్చాను"

"జయ కూడా నిన్ను చూడాలని తెగ కలవరించిపోయింది బాబూ! నాలుగు రోజుల కిందటి వరకు జ్వరం. ప్రస్తుతం వూళ్లో లేదు"

"ఎక్కడికి వెళ్ళిందండీ? "

"విజయవాడ వెళ్ళింది. వాళ్ల బాబాయి కూతురి పెళ్ళికి!"

"ఎప్పుడు వెళ్ళిందండీ? ఎప్పుడొస్తుంది? "

"నిన్ననే వెళ్ళింది. ఇరవై రోజుల దాకా రాదు"

"పెళ్లికి వెళ్తున్నానని నాకు చెప్పొచ్చుగా!"

"అనుకోకుండా పెళ్ళి కుదిరింది. నిన్న వాళ్ళ బాబాయి వచ్చి తీసుకెళ్ళారు"

అతని ముఖంలో నిరాశా నిస్పృహలు ప్రతిఫలిస్తున్నాయి. క్షణం తర్వాత అన్నాడు. "విజయవాడలో మీ మరిదిగారి ఇంటి అడ్రస్ ఇవ్వండి! జయని చూసి వస్తాను!"

అతనలా అడుగుతాడని ఊహించని శకుంతల, క్షణం నిరుత్తరురాలయినా

వెంటనే తేరుకుంది.

"క్షమించు బాబూ! అది మాత్రం అడగకు! ఎందుకంటే మీరు ప్రేమించుకున్న విషయం మాకు తప్ప ఎవరికీ తెలియదు. సదాచార సంపన్నమైన మా కుటుంబంలో మీ పెళ్లి పెద్ద అలజడినే సృష్టిస్తుంది. మీ పెళ్ళయిపోయాక మా బంధువులెవరికైనా తెలిసినా కొన్నాళ్ళు చెప్పుకుని పూరుకుంటారు! కానీ ముందే ఈ విషయం అందరికీ వెల్లడయితే మమ్మల్ని అందరూ ఈటెల్లాంటి మాటలతో గుచ్చి చంపేస్తారు. దయవుంచి ఈ విషయాన్ని రహస్యంగా వుంచు. చిన్నవాడివైనా నీకు చేతులెత్తి మొక్కుతాను బాబూ!"

"ఛఛ! అదేమిటండీ! మీరు పెద్దవారు! మమ్మల్ని ఆశీర్వదించవలసినవారు!" ఆవిడలా అనగానే కంగారుపడిపోయాడతను.

"నేను నిన్ను ప్రార్థించేది ఒక్కటే నాయనా! మీ ప్రేమ విషయాన్ని నీ గుండెల్లో దాచుకో! జయ ఊరి నుంచి రాగానే మీరిద్దరూ ఏ గుడిలోనో పెళ్ళిచేసుకోండి! లేకపోతే రిజిస్టర్ మేరేజ్ చేసుకోండి! మేం మీ పెళ్ళికి రాకపోయినా మా ఆశీస్సులు మీకెప్పుడూ వుంటాయి!"

సూర్యం కళ్ళు చెమర్చాయి.

"మీదెంత మంచి మనసమ్మా! మా ప్రేమ విషయం విని మీరు ఆగ్రహంతో మండిపడతారని, నన్ను శపిస్తారని.. ఏవేవో ఊహించుకుని భయపడ్డాను! నా కంటే జయే ఎక్కువ భయపడిపోయింది"

"మానవ కల్పితాలయిన ఈ కులమతాలపై నాకు వివక్ష లేదు. అయినా నీకేం తక్కువ? !"

"మీ అభిమానానికి కృతజ్ఞుడినండీ! మరి నేను వెళ్ళొస్తాను!" సూర్యం లేచి ఆ దంపతులకి నమస్కరించాడు.

బలరామశాస్త్రి నోట మాట రానట్టు చూస్తున్నాడు. భార్య ముఖంలో ప్రతిఫలిస్తున్న నిజాయితీని.. సూర్యంపై వెల్లివిరుస్తున్న ఆదరాభిమానాలని చూస్తూ..

'ఎంత చక్కగా నటించావే! నువ్వు సినిమాల్లో నటిస్తే నీ నటనకి ఆస్కార్ అవార్డు రావలసిందే!' అనుకున్నాడు.

సూర్యం బైక్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయే దాకా ఆగిన శకుంతల భర్తవైపు తిరిగింది.

"ఇంక ఆలస్యం చేస్తే లాభంలేదు! నెలలోగా జయ పెళ్ళయిపోవాలి! లేకపోతే ఆ దరిద్రుడు మన ఇంటి చుట్టూ తిరుగుతూనే వుంటాడు"

"నెలలోనా? ! ఇప్పటికిప్పుడు పెళ్ళి సంబంధం ఎక్కడ నుంచి తెచ్చేది? "

"పేరిశాస్త్రిగారు చెప్పిన కాకినాడ సంబంధం వుందిగా! వెళ్ళండి! ఇవాళ మంచిరోజే!"

"అలాగే!" అన్నాడాయన.

శకుంతల లోపలకి వచ్చి జయ వున్న గది తలుపులు మూసి వున్నాయని.. సూర్యం తమ ఇంటికి రావడాన్ని ఆమె గమనించలేదని నిర్ధారణ చేసుకుంది.

★ ★ ★

"మీరీ వూళ్ళో వున్నట్టు అమృతకి తెలుసా? " అడిగింది విరజ.

"తెలిసే వుంటుంది!" అంది శ్రీవల్లి.

"ఒకే వూళ్ళో వుంటూ మేనత్త, మేనమామ పిల్లలయిన మీరిద్దరూ కలుసుకోకపోవడం విచిత్రం! అమృత మిమ్మల్ని మా ఇంటికి రమ్మని పిలవలేదా? "

"అమృత.. నేను కలుసుకునే సందర్భం ఇంతవరకు రాలేదు! కలిస్తే పిలవకుండా ఎలా వుంటుంది? "

"ఓ! అవునుకదూ! మీరు ఇంటర్‌కేస్ట్ మేరేజ్ చేసుకున్న విషయం ఆమెకి తెలుసా? "

"తెలిసే వుంటుంది!" ఇబ్బందిగా అంది.

"బహుశా! అందుకే తను మిమ్మల్ని కలుసుకోడానికి ఇష్టపడడం లేదేమో!"

శ్రీవల్లి ముఖం మ్లానమయింది.

"అమృత మిమ్మల్ని మా ఇంటికి పిలవ

కపోతేనేం? నేను పిలుస్తున్నాను.. మా ఇంటికి రండి!" అంది విరజ, ఆమె చేతిని ఆప్యాయంగా స్పృశిస్తూ.

శ్రీవల్లి ముఖం వికసించింది.

"మీ నాన్నగారేం చేస్తుంటారు? " మెల్లిగా ఆమెని మాటల్లోకి దించింది.

"ఆయన రిటైర్డ్ టీచరండి!"

"మీకు అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్ళు ఎవరైనా వున్నారా? "

"నాకు ముగ్గురు అక్కలండి! అందరిలోకి నేనే ఆఖరుదాన్ని!"

"మిగతావాళ్ళు..? "

"మా పెద్దక్క భర్త టీచరండి! రెండో అక్క భర్త ప్రైవేటు కంపెనీలో అకౌంటెంట్‌గా పనిచేస్తున్నాడు. మూడో అక్క భర్త కూడా టీచరే!"

"ఓ! మీ ఫ్యామిలీలో నలుగురు టీచర్లు కదా? ఎవరైనా తప్పుచేస్తే వాళ్ళని బెంచి ఎక్కిస్తారా? లేక గుంజీలు తీయిస్తారా? "

నవ్వింది శ్రీవల్లి. "మీరు తమాషాగా మాట్లాడతారు! కానీ మా ఇంట్లో నలుగురు టీచర్లు కాదు. మా అక్కలు కూడా టీచర్లే! మొత్తం ఏడుగురం!"

"అవునా? మీది లవ్ మేరేజి కదా? అతనితో మీకెలా పరిచయం? "

"ఆయన ఆటోలోనే కాలేజీకి వెళ్ళేదాన్ని!"

"చాలా అందంగా వుంటారా ఆయన? "

"ఫర్వాలేదు.. బాగానే వుంటారు!" ఆమె బుగ్గల్లో ఎరుపు!

"మీ అమ్మానాన్నలు మీ పెళ్ళిని అంగీకరించారా? "

"లేదు, కులాంతరం! పైగా ఆయన ఆటో డ్రైవర్! వాళ్ళ వైపు నుంచి ఆలోచిస్తే నేను చేసింది తప్పే!"



"మీ వాళ్ళు కుటుంబం నుంచి మిమ్మల్ని వెలివేశారన్న మాట!"

"సొసైటీ కూడా మీ పెళ్ళిని విడ్డూరంగా చెప్పుకుని వుంటుంది కదా! ఎలా భరించారు ఈ అవమానాలని? "

"కొత్తలో భరించలేనంత బాధగా వుండేది! చచ్చిపోదామనుకున్నాను!" ఆమె కళ్ళలో నీళ్ళూరాయి.

"ఎందుకండీ! ఇంటర్‌కేస్ట్ మేరేజి చేసుకున్నందుకా? లేక ఒక ఆటోడ్రైవర్‌ని పెళ్ళి చేసుకున్నందుకా? " 'ఆటోడ్రైవర్' అనే పదాన్ని వత్తి పలుకుతూ అంది.

"ఆటోడ్రైవర్‌ని హీనంగా చూస్తుందీ లోకం. అదే కులానికి చెందిన ఏ డాక్టర్‌నో ఇంజనీర్‌నో చేసుకుంటే ఎంత గౌరవం!? "

"బాగా చెప్పారు! అంటే అంటరానితనం అనేది వృత్తికి తప్ప, కులానికి కాదన్న మాట! వృత్తిని బట్టి ఏర్పడిన కులాలు ఎన్ని అడ్డుగోడలని సృష్టిస్తున్నాయి? " ఆవేదనని ప్రతిఫలింప చేస్తూ అంది విరజ.

"మీరు ధైర్యంగా వుండండి! మీరే తప్పూ చెయ్యలేదు! మీ మనసుకి నచ్చినవాడిని ధైర్యంగా పెళ్ళి చేసుకున్నారు" అంది ఆమె భుజం తట్టి.

"నా పెళ్ళి విషయం తెలిసి నన్ను విమర్శించిన వాళ్ళని, ముఖం మీదే నవ్విన వాళ్ళని.. చూశాను. ఇలా విశాల హృదయంతో ఆలోచించిన వాళ్ళని మిమ్మల్నే చూశాను" అంది చెమర్చిన కళ్ళతో ఆమెని చూస్తూ.

"మిమ్మల్ని చూసిన మొదటి క్షణంలోనే ఎంతో ఆత్మీయురాలిలా, ఒక ఫ్రెండులా అనిపించారు మీరు. ఎలాంటి సంకోచాలూ, మొహమాటాలూ లేకుండా నాతో మనసు విప్పి మాట్లాడండి!" అంది విరజ.

పెద్దింటి కోడలు, తనకంటే ఎన్నోరెట్లు ఉన్నతస్థితిలో వున్న ఆమె.. అలా మాట్లాడేసరికి పొంగిపోయింది శ్రీవల్లి.

★ ★ ★

తనని చూసుకోడానికి పెళ్ళివారు వస్తున్నారని తల్లి చెప్పగా విన్న జయ నిర్విణ్ణురాలయింది.

"నాకు పెళ్ళి చేసుకోవాలని లేదమ్మా! సూర్యాన్ని మరచిపోవడం నాకీజన్మలో సాధ్యపడదు!" అంది ఆవేదనగా.

"మరచిపోవాలి!" శాసిస్తున్నట్టు అంది శకుంతల. "నీకీ పెళ్ళిసంబంధం దాదాపు స్థిరపడ్డట్టే! నువ్వు గతాన్ని మరచిపోయి పెళ్ళిచేసుకోవాలి"

"సూర్యాన్ని ప్రేమించిన నేను, మరొకరిని ఎలా పెళ్ళిచేసుకోగలనమ్మా? నాకు పెళ్ళి వద్దు! ఈ జన్మకి అతని జ్ఞాపకాలు చాలు! నన్నిలా బతకనీ!"

"పెళ్ళిచేసుకోకుండా జీవితాంతం మా గుండెల మీద కుంపటిలా కూర్చుందామనుకుంటున్నావా? "

"నేను మీకు భారం కాదలచుకోలేదు. చదువు పూర్తిచేసి, నా అర్హతలకి తగిన ఏ చిన్న ఉద్యోగం దొరికినా నా బతుకు నేను బతుకుతాను! దయవుంచి పెళ్ళి విషయంలో నన్ను బలవంతపెట్టొద్దు!"

"నువ్వీ సంబంధానికి ఒప్పుకుంటావని నమ్మకంతో మీ నాన్నగారు అన్నీ నిర్ణయించుకుని వచ్చారు. వాళ్ళు ఇవాళ పెళ్ళిచూపులకి వస్తున్నారు. నువ్వు కాదంటే మా పరువేమవుతుంది? అవతల పెద్దమనుషులతో వ్యవహారం. నువ్వు మొండికేసి పెళ్ళి వద్దంటే మేం ఏ నుయ్యో, గొయ్యో చూసుకోవలసిందే! కానియ్! నా ముఖాన బలవంతపు చావు రాసిపెట్టివుంది కాబోలు!" ముక్కుచీదుతూ అవతలకి వెళ్ళిపోయింది.

జయకి ఏడుపొస్తోంది. "తనని పెళ్ళిచేసుకుని తీరాలని శాసిస్తోందేమిటి అమ్మ? సూర్యాన్ని మరచిపోయి వేరే వ్యక్తిని తన జీవితంలోకి ఆహ్వానించగలదా? " ఆమె

అసహాయంగా ఏడుస్తోంది.

వంటగదిలో శకుంతల తన కోపాన్ని గిన్నెలపై చూపిస్తోంది.

"పెళ్లివారొచ్చేది ఇవాళే! ఇంట్లోకి ఏం కావాలో చెప్పు! కొనితెస్తాను" అడిగేడు బల రామశాస్త్రి వంటగది గుమ్మంలో నిలబడి.

"ఇంతోటి పెళ్ళికి బాజాలెందుకులే! అన్నాడట వెనకటికొకడు. జయ పెళ్ళి చేసుకోదట! వాళ్ళు పెళ్ళిచూపులకి రావడ మెందుకు? వాళ్లకోసం ఫలహారాలు, పళ్ళు కొని డబ్బు తగలెయ్యడమెందుకు? "

"పెళ్ళి చేసుకోనందా? "

"చేసుకోదట! వాడిని మరచిపోలేదట!"

"నువ్వు నచ్చచెప్పకపోయావా? "

"చెప్పాను! వినడంలేదు!"

ఆయన కూతురున్న గదిలోకి వెళ్ళాడు. ఏడుస్తున్న ఆమెని చూస్తే ఆయన మనసు ఆర్ద్రమయింది.

"అమ్మా! జయా!"

జయ కళ్ళెత్తి తండ్రిని చూసింది.

"సాయంకాలం నిన్ను చూసుకోడానికి పెళ్ళివారు వస్తున్నారు"

ఆమె తెలుసన్నట్టు తలవూపింది.

"ఈ సంబంధం చాలామంచిది! వాళ్ళు నీ ఫొటో చూసి ఇష్టపడ్డారు! నీ పెళ్ళి దాదాపు నిశ్చయమయినట్టే!"

"నేను పెళ్ళి చేసుకోను నాన్నా! నన్నిలా బతకనివ్వండి!" గాద్గదికంగా అంది.

"నువ్వు పెళ్ళి చేసుకోకపోవడానికి కారణం ఏదైనాగానీ, కూతురి పెళ్ళి చెయ్య లేని అసమర్థుడినని లోకం నన్ను ఎగతాళి చేస్తుందమ్మా!"

"సూర్యాన్ని ప్రేమించిన నేను మరో వ్యక్తిని పెళ్ళిచేసుకుని రాజీపడలేను. అలా చేస్తే నా భర్తకి అన్యాయం చేసినట్టు కాదా? అది తప్పుకాదా? "

"తప్పో? ఒప్పో? జరిగిపోయింది! ఆ తప్పుని సరిదిద్దడం, నిన్ను కన్నవాళ్ళుగా మా బాధ్యత! నువ్వు అందుకు సహకరిం చాలి. మన కుటుంబ పరువుప్రతిష్ఠలని దృష్టిలో పెట్టుకుని అయినా నువ్వీపెళ్ళికి అంగీకరించాలి!"

జయ అసహాయంగా తండ్రిని చూస్తోంది. ఆయన తను సూర్యాన్ని ప్రేమిస్తున్న విషయం బటయపడినప్పుడు కానీ, తను గర్భవతినని తెలిసినప్పుడు కానీ, తల్లిలా ఆగ్రహాన్ని వ్యక్తం చెయ్య లేదు. తనని తిట్టలేదు. కానీ ఆయన ముఖంలోని బాధ, వేదనలను చూస్తే తనెంత తప్పు చేసిందో ఆమెకి అర్థమ యింది. తనపై ఆయన పెంచుకున్న నమ్మకాన్ని తను వమ్ముచేసిందనే బాధతో ఆయన చూసిన చూపు.. తనని పెంచి పోషించిన కసాయివాడు తన మెడ నరు కుతున్నప్పుడు మూగబాధతో మేక అలాగే చూస్తుందేమో! జయ కళ్ళలో నీళ్ళూరుతు న్నాయి. తండ్రి మాటల్లోని నిస్సహాయత, అర్థింపు ఆమెని కదిలించాయి. ఆమె విచ లితంగా ఆయన్నే చూస్తోంది. మనసులో యుద్ధభేరీలు మోగుతున్నాయి.

'సూర్యాన్ని మరిచిపోయి వేరే వ్యక్తిని పెళ్ళిచేసుకోగలనా? '

'నువ్వు పెళ్ళి కాదంటే నేను ఏ నుయ్యో? గొయ్యో? చూసుకోవలసిందే'

తల్లి మాటల్లోని బెదిరింపు కంటే, తండ్రి మాటల్లోని అర్థింపే ఆమెని ఎక్కువగా కది లించివేసింది.

'సూర్యాన్ని మరచిపోవాలి! తప్పదు!' బలవంతంగా అతన్ని మనసులో నుంచి తొలగించడానికి ప్రయత్నించసాగింది.

జయను చూసిన పెళ్ళివారి కళ్ళలో సంతృప్తి మెరిసింది.

"అమ్మాయి మరీ సన్నగా వుంది! బల మైన ఆహారం పెట్టి, టానిక్కులవీ ఇప్పిం చండి! పెళ్ళినాటికి ముద్దబంతిలా వుండాలి" అబ్బాయి తల్లి తమకి అమ్మాయి నచ్చిందని పరోక్షంగా చెప్పింది.

శకుంతల ముఖం విప్పారింది. నాలుగు

రోజుల్లో మంచి ముహూర్తం వుందని తాంబూలాలు మార్చుకున్నారు.

★ ★ ★

పెళ్ళి అన్నవరంలో చేస్తామని మొక్కుకున్నామని పెళ్ళివారితో చెప్పింది శకుంతల. దైవసన్నిధిలో పెళ్ళి అనగానే వాళ్ళూ అంగీకరించారు. ఉన్న వూళ్ళో పెళ్ళి చేస్తే సూర్యానికి తెలుస్తుందని శకుంతల భయం. 'ఈకాలం అబ్బాయిలు హీరోలు కదా! పెళ్ళిపందిట్లోకి వచ్చి గొడవ చేస్తే?'

"అక్క పెళ్ళి నిశ్చయమయిందని ఎవరికీ చెప్పకు!" తల్లి అనగానే సత్య అర్థం కానట్టు చూసింది.

"ఎందుకు చెప్పకూడదు?" అడిగింది.

"అక్కకి మంచి సంబంధం కుదిరిందన్న ఈర్ష్యతో మనమంటే గిట్టనివాళ్ళు పెళ్ళి చెడగొడతారు"

సత్యకి తల్లి చెప్పిన కారణం నమ్మదగిందిగా అనిపించలేదు. ఏదోవుంది! తల్లీ తండ్రీ గుట్టుగా వున్నారు. తల్లితోబాటు విజయవాడ వెళ్ళొచ్చిన దగ్గర నుంచి అక్కలో వచ్చిన మార్పు, ఈ పెళ్ళి విషయం రహస్యంగా వుంచాలనుకోవడంతో కలిపి ఆలోచిస్తే అంతర్లీనంగా వున్న కారణమేదో అర్థమయినట్టే అనిపించిందామెకి.

'అక్క ఎవరినైనా ప్రేమించిందా? అసలు ఆమెని వున్నట్టుండి చదువెందుకు మానిపించారు? పెళ్ళి నిశ్చయమయిన విషయాన్ని అంత రహస్యంగా దాచవలసిన అవసరం ఏమిటి? పైగా ఆమె ముఖంలో ఏదో పోగొట్టుకున్న దిగులు తప్ప, పెళ్ళి కాబోతోందనే ఉత్సాహం మచ్చుకైనా కనిపించడంలేదు'

ఏదో జరిగిందని ఆ అమ్మాయికి కచ్చితంగా తెలుసు! కానీ ఏం జరిగి వుంటుందో ఆమె ఊహకి అందడంలేదు.

ఆ రోజు కాలేజీలో క్లాసులయ్యాక కేంపస్‌లో ఉత్కళ పక్కనే నడుస్తున్న సత్య జయ పెళ్ళి నిశ్చయమయిన విషయాన్ని చెప్పింది.

## నవంబరు - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **టి. రామలింగయ్య**
 - గద్దలగుంట, ఒంగోలు
2. **దొడియం లక్ష్మీప్రసన్న**
 - మల్లాపూర్, రంగారెడ్డి జిల్లా
3. **జి. అమర్‌నాథ్**
 - టొబాకో బజార్, సికింద్రాబాద్
4. **పి. రంగనాథ నాయుడు**
 - రైల్వేకాలనీ, తిరుపతి
5. **తాడేపల్లి సుభద్రాదేవి**
 - గాంధీనగర్, కాకినాడ

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. భాస్కర్ | 6. జిరాఫీ |
| 2. గురువయ్య | 7. ప్రశాంత్ కృష్ణన్ |
| 3. అప్పారావు | 8. రవీంద్రన్ |
| 4. కవిరాజు | 9. మార్గరీ |
| 5. ప్రకాశం | 10. మంథా వెంకట రమణారావు |

"మీ అక్క పెళ్ళా? ఎప్పుడు? ఎవరితో?" ఉత్కళ కుతూహలంగా అడిగింది.

"పెళ్ళివారిది కాకినాడ. అతను ఎల్.ఐ.సి.లో ఉద్యోగం చేస్తున్నాడు"

"సూర్యాన్ని కాదా మీ అక్క పెళ్ళి చేసుకునేది?" ఉత్కళ నిశితంగా సత్య ముఖంలోని భావాలని పరికిస్తూ అడిగింది.

"సూర్యమా? సూర్యం ఎవరు?" సత్య భ్రుకుటి ముడిపడింది.

"నీకు నిజంగా తెలియదా? లేకపోతే

తెలియనట్టు నటిస్తున్నావా?" అదోలా నవ్వింది.

"నిజంగానే నాకేమీ తెలియదు"

సత్య ముఖంలోని ఉద్విగ్నతని గమనించాక నిజంగానే సూర్యం విషయం ఆమెకి తెలియదని నమ్మకం కలిగింది ఉత్కళకి.

"మీ అక్క, సూర్యం ప్రేమించుకున్నారు. మీ అక్క సూర్యం గదికి వెళ్తూవుండేది"

"నీకు..? నీకెలా తెలుసు?" సత్య ముఖం పాలిపోయింది.

"సూర్యం, పార్థువాళ్ళింటి పక్కనే అద్దెకి వుంటున్నాడు. వాళ్ళ ప్రేమ వ్యవహారాన్ని నాకు పార్థు ఎప్పుడో చెప్పాడు"

"నిజమా? !" సత్యకి ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. ఆమె శరీరంలోని వణుకు ఆమెకే స్పష్టంగా తెలుస్తోంది.

"బహుశా! సూర్యం మన కులం కాకపోవడం వలన వాళ్ళ పెళ్ళికి మీ వాళ్ళు అంగీకరించి వుండరు!"

సత్యకి తన చుట్టూ వున్న ప్రపంచమంతా గిరగిరా తిరిగిపోతున్న అనుభూతి కలుగుతోంది.

"అక్క ఎవరినో ప్రేమించిందా? ఉత్కళ చెబుతున్నదంతా నిజమేనా?"

జయని కాలేజీకి వెళ్ళొద్దని తల్లి హెచ్చరించడం వెనుక నిగూఢంగా వున్న కారణమేదో ఆమెకి అర్థమయింది. జయ అనారోగ్యం, ఆమెకి జ్వరం వచ్చిందని తల్లి చెప్పడం కూడా అబద్ధమే అయివుంటుందనిపించింది. తల్లి డాక్టరుకి చూపించుకోడానికి విజయవాడ వెళ్ళడం, అదీ ఇక్కడ ఇంతమంది డాక్టర్లు వుండగా అంతదూరం వెళ్ళిందంటే ఏం జరిగివుంటుందో ఆమెకి అర్థమయింది. జయ ముఖంలోని వేదన, సర్వస్వాన్ని కోల్పోయినట్టున్న దైన్యం ఏం జరిగిందో ఆమెకి చెప్పకనే చెప్పాయి.

"నేను వెళ్తాను ఉత్కళా!" పరుగులాంటి నడకతో అక్కడ నుంచి బయటపడింది.

'మీ అక్క సూర్యం గదికి వెళ్తూవుండేది' సత్య చెవుల్లో ఉత్కళ మాటలే మార్మోగుతున్నాయి. వయసులో వున్న యువతీ యువకుల మధ్య ఏకాంతంలో ఏం జరుగుతుందో తెలియనంత చిన్నవయసేమీ కాదు తనది. 'అసలు పార్థు ఉత్కళకి చెప్పింది నిజమేనా? ఎవరో అమ్మాయిని చూసి జయ అని పొరపాటు పడుతున్నాడేమో! అక్క ప్రేమ విషయం నిజమా? కాదా? అని తల్లిని అడిగితే? ఆమె నిజం చెబుతుందా?' ఆలోచనల మధ్య ఇంటికి వెళ్ళింది.

మధ్య గదిలో పెళ్ళికోసం తల్లి సామాన్లు సర్దుతోంది.

"అమ్మా!" సత్య పిలిచింది.

"ఏమిటమ్మా?"

"అక్కకి ఈ పెళ్ళి ఇష్టం లేదా?"

"ఎందుకిష్టంలేదు? అలా ఎందుకనుకుంటున్నావు?"

"అక్క ఎవర్నయినా ప్రేమించిందా?"

"ఏమిటా పిచ్చివాగుడు? ఒళ్ళు తెలిసి మాట్లాడు!" మండిపడింది.

"నేనేమీ తప్పుగా మాట్లాడలేదు. అక్క ఎవర్నయినా ప్రేమించిందేమో? అందుకే దానికి ఈ పెళ్ళి ఇష్టం లేదని అనుమానం వచ్చింది"

"అలా అని నీతో చెప్పిందా?" పళ్ళు కొరుకుతూ అంది.

"అక్క ముఖం చూస్తే తెలియడం లేదూ! పెళ్లి అవబోతోందనే సంతోషం, ఉత్సాహం ఎక్కడా లేవు"

"అదా!" నవ్వింది శకుంతల. "దానికి మనందరినీ విడిచిపెట్టి అత్తవారింటికి వెళ్లిపోతున్నానని బెంగ!"

తల్లి ముఖంలోకి రెప్పవాల్చకుండా చూసింది సత్య ఒక క్షణం. ఆవిడ ముఖం చూస్తే అబద్ధం చెబుతోందని ఎవరూ అనుకోరు. ఆవిడ నిజం చెబుతోందో? లేదో? తనకి తెలియదు. నిజానికి ఉత్కళ మాటల్లో నిజమెంత ఉందో కూడా తెలి

చతుర సమగ్రతోట

# జోక్ పార్టీలు

ప్రజాస్వామ్య దేశాల్లో రాజకీయ పార్టీల మేనిఫెస్టోలు సాధారణంగా ప్రజాహితంగా ఉంటాయి. కానీ కొన్ని దేశాల్లో రిజిస్టర్ అయిన కొన్ని రాజకీయపార్టీల మేనిఫెస్టోలు సరదాగా ఉంటాయి..

★ బీర్‌లవర్స్ పార్టీ: సోవియట్ యూనియన్‌లోని బెలారస్ రాష్ట్రంలో 1993లో ఏర్పడ్డ ఈ పార్టీ ప్రధాన లక్ష్యం జాతీయ బీర్ నాణ్యత, శుభ్రత! ముళ్ళపంది దీని లోగో!



★ ది అబ్సల్యూట్లీ అబ్సర్డ్ పార్టీ: ఈ కెనడియన్ జోక్ పార్టీ లక్ష్యాలు, ఓటింగ్ హక్కుని పద్నాలుగేళ్ళకి కుదించడం, ఎన్నికల్లో అతి తక్కువ ఓట్లు వచ్చిన వారే పదవిని అధిష్ఠించేలా చట్టం చేయడం!

★ ది హంగేరియన్ డబుల్ టెయిల్డ్ డాగ్ పార్టీ: 2004లో స్థాపించిన ఈ జోక్ పార్టీ ఆశయం, ప్రపంచ శాంతి, వారానికి ఒక్క పని దినం, ఉచిత బీర్, సుంకాలని తగ్గించడం. ఇంకా రెండు సూర్యోదయాలు, భూమ్యాకర్షణ శక్తిని తగ్గించడం మీద పరిశోధనలు చేయడం.

★ ది మేక్ జొల్లీ కడ్లీ సీరియస్ పార్టీ: న్యూజిలాండ్‌కి చెందిన ఈ జోక్ పార్టీ ధ్యేయాలు.. డబ్బుకి ప్రత్యామ్నాయంగా చాక్లెట్ పూసిన చేపలని వాడటం! పద్దెనిమిదేళ్లలోపు వాళ్ళకి మాత్రమే ఓటు హక్కు ఇవ్వడం, సముద్రతీరాల్లో బీర్ బాటిల్స్‌ని సమృద్ధిగా ఉంచడం ద్వారా దండయాత్రకు వచ్చే సైనికులు అది తాగాక మత్తులోని వారిని పట్టుకోవడం మొదలైనవి.

★ ది డోనాల్డ్ డక్ పార్టీ: స్వీడన్‌కి చెందిన ఈ జోక్ పార్టీ ధ్యేయాలు ఉచిత మద్యం సరఫరా, ఇంకాస్త విశాలమైన పేవ్‌మెంట్స్‌ని ఏర్పాటు చేయడం.

★ ది యూత్ ఇంటర్నేషనల్ పార్టీ: ప్రతిసారీ ఈ పార్టీ వారు ఓ పందిని అభ్యర్థిగా నిలబెట్టి దాని ఊరేగింపులో డబ్బుని వెదజల్లుతారు. మార్జువానా(డ్రగ్) లీగలైజ్ చేయాలన్నది కూడా వీరి నినాదం!

యదు. సత్య తల్లితో సంభాషణ పొడిగించకుండా గదిలోకి వెళ్లిపోయింది.

★ ★ ★

"ఏమండీ! ఇది మోహన్రావుగారి ఇల్లేనా? " కాలింగ్‌బెల్ శబ్దం విని తలుపు తీసిన వనజని అడిగేడు ఆ యువకుడు. అతని పక్కనే కళ్లు మాత్రం కనిపించేలా బురఖా ధరించిన ఓ ముస్లిం యువతి.

"కాదండీ!" అంది.

"అడ్రస్ ఇదేనని చెప్పారే! వి. మోహన్రావు.. ఫ్లాటు నెంబరు 9"

"ఇది ఫ్లాటు నెంబరు తొమ్మిదే! కానీ మావారి పేరు మోహన్రావు కాదు.. శంకరం!"

అతను జేబులో నుంచి పర్సు తీసి ఒక కాగితం ముక్క తీసి అడ్రస్ చూశాడు. "ఇది విఘ్నేశ్వర అపార్ట్‌మెంట్స్ కాదా? "

"కాదండీ! వినాయక అపార్టుమెంట్స్"

ఓ! సారీ! రెండూ వినాయకుడి పేర్లే కదా! కన్‌ఫ్యూజ్ అయ్యాను. కాసిని మంచినీళ్లిస్తారా? "

"అలాగే బాబూ!" అని లోపలికి వెళ్లి ట్రేలో మంచినీళ్ల గ్లాసులు తెచ్చింది వనజ.

"నువ్వు తాగుతావా? " అతను గ్లాసు అందుకుని, ఆమెని అడిగాడు.

వద్దన్నట్లు తలాడించింది ఆ యువతి. మంచినీళ్లు తాగి "థాంక్సండీ!" అని బయటికి నడిచాడతను, వెనుకనే ఆమె కూడా.

వాళ్లు వెళ్లాక, వనజ తలుపులేసుకుంది.

అతను బైక్ స్టార్ట్ చేశాడు. ఆమె అతని

వెనుక కూర్చుంటూ, సరసంగా అతని భుజంపై చిన్నగా కొట్టింది.

"నన్ను మా ఇంటికే తీసుకెళ్లి మంచినీళ్లు తాగుతావా? అని అడుగుతావా? ఎలా తాగను? మా అమ్మకెదురుగా! ముఖం మీద బురఖా తీసి తాగనా? "

నవ్వేడు పార్థు. "నాకయితే మనమిద్దరం ఇలా కలిసి తిరగడం ఎంత థ్రిల్లింగ్‌గా ఉందో తెలుసా? నిన్నెవరూ గుర్తుపట్టలేరు. మనం అందరినీ చూసి నవ్వుకుంటూ.. ఓహ్!"

"మీ ఇంటికెళ్దామా? " అంది ఉత్కళ.

"ఎందుకు? "

"మీ ఇంట్లోవాళ్ల రియాక్షన్ తెలుసుకోవాలని ఉంది"

బురఖాలో ఉన్నది నువ్వు.. నేను కాదు! నాకెలాంటి థ్రిల్లూ ఉండదు.

"ఏం? నన్ను మీవాళ్లకి పరిచయం చేసే ధైర్యం లేదా? నువ్వు లవ్ మేరేజి చేసుకుంటానంటే మీవాళ్లు ఒప్పుకోరా? "

"ఒప్పిస్తాను! అయినా అప్పుడే పెళ్లేమిటి? ఇంకా చదువు పూర్తికావాలి! లైఫ్‌లో సెటిలవ్వాలి!"

"ఓకె! అంతవరకు మనం ఇలా ప్రేమించుకుందాం!" నవ్వింది.

"నువ్వు ఒక ముస్లిం అమ్మాయితో బైక్ మీద షికార్లు చేస్తున్నావని మీ నాన్నగారికి తెలిస్తే? "

"కచ్చితంగా తిడతారు! ఆ ముస్లిం అమ్మాయి పేరేమిటని అడిగితే నూర్జహాన్ అని చెబుతాను" ఇద్దరూ నవ్వుకుంటున్నారు.. తుళ్లిపడుతున్నారు.

ఒకరోజు షాపింగ్‌కి, మరోరోజు మ్యాట్నీ సినిమాకి వెళ్లారు. పార్థు ఎవరో ముస్లిం అమ్మాయితో షికార్లు చేస్తున్నాడని అతని ఫ్రెండ్సుకి తెలిసింది.

"ఎవరా అమ్మాయి? " అడిగారు కుతూహలంగా.

"నూర్జహాన్ అని మా ఎదురింట్లో ఉంటుంది"

"మరి ఉత్కళని ప్రేమిస్తున్నానన్నావు? ఆమెని మరచిపోయావా? "

"ఇద్దరినీ ప్రేమిస్తున్నాను" కన్నుగీటి నవ్వేడు.

"ఒకేసారి ఇద్దరమ్మాయిలతో ఎఫైరా? మాకు ఒకమ్మాయే దొరక్క చస్తుంటే!" అసూయపడ్డారు.




గేటు తీసుకుని లోపలకి వస్తున్న సూర్యాన్ని చూడగానే బలరామశాస్త్రి పై ప్రాణాలు పైనే పోయాయి. ఆయన నోట మాట రానట్టు చూస్తున్నాడు.

సూర్యం లోపలకి వచ్చాడు.

"ఎందుకిలా చేశారు? " ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా అతను అడిగిన సూటి ప్రశ్నతో అర్థమయిందాయనకి.. అతనికి జయ పెళ్లివిషయం తెలిసిపోయిందని.

"జయ ఊరికి వెళ్లిందని అబద్ధం చెప్పి, ఆమెని కనీసం కళ్లతో చూడనివ్వకుండా చేశారు. మా పెళ్లికి అంగీకరించినట్టు నన్ను ఎందుకు నమ్మించారు? ఇప్పుడామెకి వేరే సంబంధం నిర్ణయించి నన్ను ఆమెకి శాశ్వతంగా దూరం చెయ్యాలని ప్రయత్నిస్తున్నారా? "

శకుంతల లోపల ఉన్నా బయట మాట్లాడుతున్న వ్యక్తి ఎవరో పసిగట్టేసింది. బయటికి వస్తూ జయ ఉన్న గది తలుపులకి గొళ్లెం పెట్టి మరీ వచ్చింది.

"మీరు నన్ను నమ్మించి వెన్నుపోటు పొడిచారు!" అతని స్వరం రానురాను గాద్గదికంగా మారిపోయింది.

శకుంతల వస్తూనే సూర్యానికి అభిముఖంగా తిరిగి చేతులు జోడించింది.

"చిన్నవాడివైనా నీకు చేతులు జోడించి దణ్ణం పెడుతున్నాను. దయ ఉంచి ఇక్కడ నుంచి వెళ్లిపో బాబూ! పరువుగా బతుకుతున్న మమ్మల్ని రచ్చకీడ్చి నలుగురిలో నవ్వులపాలు చెయ్యకు. మరో నాలుగు రోజుల్లో జయ పెళ్లి జరగబోతోంది. ఆ పెళ్లి ఆగిపోతే మా కుటుంబం మొత్తం విషం మింగి చావవలసిందే!"

"మా పెళ్లికి మీకెందుకండీ అభ్యంతరం? నేను మీ కులం కాదనేగా?"

"నీ ప్రశ్నలోనే సమాధానం ఉంది"

"జయని నాతో పంపండి! మీ పవిత్రమైన కులానికి మా అపవిత్రమైన గాలి కూడా సోకనంత దూరం వెళ్లిపోతాం!"

బలరామశాస్త్రి శకుంతల నిశ్చేష్టులయి చూస్తున్నారు.

'సూర్యం జయని తనతో తీసుకెళ్లడానికే వచ్చాడు. అతన్ని ఆపడమెలా?' ఆవిడకి మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

గిరుక్కున వెనుదిరిగి లోపలికి వెళ్లి మళ్లీ అదే వేగంతో బయటికి వచ్చింది. ఏం జరగబోతోందో ఊహించేలోగా ఆవిడ తన చేతిలోని కిరసనాయిలు డబ్బాని ఎత్తి తల మీదుగా కుమ్మరించుకుంది.

"ఈ ఇంటి పరువు ప్రతిష్ఠలకంటే నా ప్రాణాలేమీ విలువైనవి కావు బాబూ! నా చావుని కళ్లారా చూసి, అప్పుడు జయని ఇక్కడ నుంచి తీసుకెళ్లు!" ఆవిడ అగ్గిపెట్టెలో నుంచి పుల్లని బయటికి తీసింది.

నిశ్చేష్టుడయిన సూర్యం తేరుకుని, ఒక్కంగలో ఆవిడని సమీపించి, ఆవిడ చేతిలోని అగ్గిపెట్టెని లాగేసుకున్నాడు.

"మీరు చావకూడదమ్మా! నూరేళ్లు జీవించాలి! జయని ప్రేమించడానికి అనర్హుడినైన నేను చావాలి!" అతని స్వరం గాద్గదికంగా ఉంది. "మీరు అఘాయిత్యం చెయ్యబోతున్నారనే ఆందోళనతో తక్కువ కులం వాడినని తెలిసీ మిమ్మల్ని తాకి మీ పవిత్రతని మంట కలిపాను. నన్ను మన్నించండమ్మా! సెలవు!" చేతులు జోడించి నీళ్లు నిండిన కళ్లతో వెనుదిరిగాడతను.

శకుంతల భర్తవైపు విజయగర్వంతో చూసింది.

"ఎంత అఘాయిత్యం చెయ్యబోయావు శకుంతలా! నీకేమయినా అయితే?!" బలరామశాస్త్రి చలిజ్వరం వచ్చిన వాడిలా వణికిపోతున్నాడు.

"నేనా మాత్రం సాహసం చేశాను కాబట్టే, వాడి ఆవేశానికి అడ్డుకట్ట వెయ్యగలిగాను. వాడి ఆవేశం చూస్తే జయని తనతో లాక్కుపోతాడనే అనుకున్నాను!"

"జయ..?"

"గదిలో వుంది! వాడి గొంతు విని ఇవతలకి వస్తూ, అది వున్న గది తలుపు గొళ్ళెం పెట్టి వచ్చాను"

"సత్య..?"

"టైలర్ దగ్గరకి వెళ్ళింది"

బలరామశాస్త్రి తేలికగా ఊపిరిపీల్చుకున్నాడు. శకుంతల తలస్నానం చెయ్యడానికి బాత్‌రూమ్‌లోకి నడిచింది.

★ ★ ★

జయకి సూర్యం గుర్తుకొస్తే గుండెల్లో మంటపెట్టినట్టవుతోంది. తన పెళ్ళి వార్త అతనికి తెలిసి వుంటుందా? తెలిస్తే అతనెలా రియాక్టవుతాడు? అన్నింటి కంటే దారుణమైన విషయం.. కనీసం అతన్ని ఏ పరిస్థితుల్లో పెళ్ళి చేసుకోలేకపోతోందో చెప్పుకోలేని దుస్థితి. ఆ సాయంకాలం అతని రూముకి వెళ్ళినప్పుడు తను గర్భవతినేమో? అనే అనుమానాన్ని బయటపెట్టింది. ఆ రాత్రే అతణ్ణి ప్రేమిస్తున్న విషయాన్ని తల్లితో చెప్పింది. అంతే! తన జీవితం తలకిందులయిపోయింది. తన

ఆశలు, కలలన్నీ సమాధి అయిపోయా యి. పోనీ సూర్యమైనా తనెలా వుందో తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదెందు కని? మనసును వేదన మెలిదిప్పుతోంది.

'ఇంక సూర్యం తనకేమీ కాదు! అతని జ్ఞాపకాల్ని సమాధి చేసి కొత్త జీవితాన్ని ప్రారంభించవలసిందే!'

"అమ్మా! నేనిప్పుడే వస్తాను!" అని సత్య తల్లితో చెప్పడం..

"ఎక్కడికే ఇప్పుడు? ఒక పక్క టాక్సీ వచ్చే టైమవుతోంది!" అని తల్లి సత్య మీద అరవడం వినిపించింది.

"ఇప్పుడే అయిదు నిమిషాల్లో వచ్చేస్తా నమ్మా! టైలర్ దగ్గర ఇంకొక జాకెట్టు వుండిపోయింది. ఇవాళ ఇస్తానన్నాడు"

"జయా! జడ వేసుకోడం ఇవాళ్టికి పూర్త వుతుందా?" పరధ్యానంగా చేతిలో దువ్వె నతో నిలబడిపోయిన జయని అరిచింది.

"అయిపోయింది!" ఆమె గబగబా జడ అల్లుకుని, దువ్వెన లోపల పెట్టి వచ్చింది.

"ఇలా వచ్చి ఆ పెట్టెలన్నీ ఒకచోట పెట్టండి! ఏం మరచిపోయినా అంతా రసాభాస అవుతుంది. నేను ఒక్కర్తినీ పనితో సతమతమవుతుంటే పెళ్ళికి వచ్చిన పెద్దలా అలా కూర్చుంటారేమిటి?" భర్త మీద రుసరుసలాడింది.

బలరామశాస్త్రి భార్య చెప్పిన పని చేశాడు.

"భోజనానికి రండి! ప్రయాణానికి వేళవు తోంది!"

"సత్యేది?"

"జాకెట్టు తెచ్చుకోడానికి టైలర్ దగ్గరకి వెళ్ళింది"

ఆయన కాళ్ళు చేతులు కడుక్కుని వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

"నువ్వూ తినమ్మా!" నిలబడి వున్న కూతురిని పిలిచాడు.

"సత్యతో కలిసి తింటాను" అంది జయ.

"దానికోసం నువ్వు ఆగడమెందుకు? నేను వున్నానుగా! త్వరగా భోజనం కానిస్తే ఇవన్నీ సర్దుకోవాలి నేను!"

జయ మౌనంగా కంచం ముందు కూర్చుంది. ఆమెకి మళ్ళీ సూర్యం గుర్తుకొ చ్చాడు. కళ్ళు తడి అవుతున్నాయి. గుండెల్లో ఏదో కలుక్కుమన్న బాధ.

*'కొసరు కొంచెమైనా వెయ్యని*
*పిసినారి దేముడు*
*ఆసలు తూకంలోనే మోసం చేసి*
*ఆనందాన్ని ఆయుః ప్రమాణాన్ని*
*తగ్గిస్తాడు!'*

అప్రయత్నంగా తిలక్ కవిత గుర్తుకొ చ్చిందామెకి.

*'అందమైన ఉదయాలూ..*
*స్పందించే హృదయాలూ..*
*చందనం చంద్రకళా..*
*సరదాలూ స్వప్నాలూ*
*ఇన్నింటినీ సమకూర్చిన*
*పసందైన గారడీ*
*చటుక్కున మడతపెట్టి చేస్తాడు*
*టెరిబుల్ ట్రాజెడీ!'*

ఆమె పెదవులు అస్పష్టంగా ఉచ్చరిస్తు న్నాయి.

"ఏమిటే? అన్నం తినకుండా నీలో నువ్వే గొణుక్కుంటున్నావు?" అడిగింది తల్లి.

"ఏమీ లేదు!" జయ అన్నం కలుపు కుంది.

సూర్యంతో పెళ్ళి కోసం ఎన్ని కలలు కంది! ఆ కలలన్నీ కల్లలయ్యాయి. తన స్వప్నాలని స్వప్నాలుగానే మిగిల్చి దేము డు తన జీవితాన్ని ట్రాజెడీ చేసేశాడు. ఆమె కళ్ళ నుంచి రెండు కన్నీటి బొట్లు రాలి కంచంలో పడ్డాయి.

"అమ్మా!" సత్య పిలుస్తూ సరాసరి వంటగదిలోకి వచ్చింది. నిజానికి అది పిలుపులా లేదు. ఆక్రందనలా వుంది. అందరూ ఒక్కసారిగా తలలు తిప్పి ఆమె వైపు చూశారు. ఆమె చలిజ్వరం వచ్చినట్టు వణికిపోతోంది. చెంపల మీద నుంచి

# ఆదా.. ఆదా...

డబ్బు పొదుపు చేయడం వ్యక్తులకే పరిమితం కాదు. వ్యాపార సంస్థలు కూడా పొదుపు చేస్తాయి. తక్కువ ఇస్తే ఎక్కువ ఆదాయం అన్నది వారి ఆదర్శం.

★ అమెరికన్ కొరియర్ కంపెనీ యు.పి.ఎస్. నిత్యం 96 వేల వేన్స్‌ని వాడుతుంది. ఇంధనం ఖర్చు తగ్గించడానికి ఎడమవైపు తిరిగే బదులు, కుడివైపు తిరిగితే ఇంధనం ఆదా అవుతుందని లెక్కకట్టింది (అమెరికాలో లెఫ్ట్ టర్న్‌కి ట్రాఫిక్ లైట్స్ దగ్గర చాలా సేపు ఆగాలి). 2004లో ఇలా కోటి గేలన్ల పెట్రోల్‌ని ఆదా చేసింది.




★ మెక్‌డొనాల్డ్స్ 2008లో డబుల్ చీజ్ బర్గర్‌లోంచి ఓ చీజ్ ముక్కని తొలగించింది. దీంతో ఆరు సెంట్ల చొప్పున ప్రతి రెస్టారెంట్‌లో ఏటా 15 వేల డాలర్లు ఆదా అవుతున్నాయి.

★ బ్యాంక్ ఆఫ్ అమెరికా ఏటీయం రసీదుల కాగితం బరువుని 11 కిలోల నుంచి 8 కిలోలకి తగ్గించడంతో ఏటా 5 లక్షల డాలర్లని ఆదా చేస్తోంది.

★ అమెరికన్ ఎయిర్‌లైన్స్ విమానంలో సర్వ్ చేసే భోజనంలోంచి ఓ ఆలివ్‌ని తొలగించడంతో ఏటా 5 లక్షల డాలర్లని పొదుపు చేస్తోంది.

★ యూరోపియన్ ఎయిర్‌లైన్స్ సంస్థ వియనైల్ ఇన్ ఫ్లైట్ మేగజైన్ బరువు (ఏ5 నుంచి ఏ4 పేపర్ సైజ్‌కి), ఐస్‌ని తగ్గించి, ఎయిర్‌హోస్టెస్‌లను బరువు తగ్గమని చెప్పి ఇంధనం ఖర్చుని తగ్గించింది. ఆదా ఎంతో తెలీదు.



★ సిస్కో కంపెనీ డిసెంబరు 29 నుంచి, జనవరి 2 దాకా ఉద్యోగులు తప్పనిసరిగా జీతం నష్టంతో సెలవు పెట్టే పథకాన్ని తెచ్చింది. ఎలక్ట్రిసిటీ కూడా కలుపుకుని సిస్కో వంద కోట్ల డాలర్లకి పైనే ఆదా చేసింది. దీన్నే నేడు అమెరికన్ కంపెనీలన్నీ అనుసరిస్తున్నాయి.

కన్నీళ్ళు జారిపోతున్నాయి.

"సూర్యం.. సూర్యం.. చచ్చిపోయాడమ్మా! ఆత్మహత్య చేసుకున్నాడు!" ఆమె స్వరం దుఃఖంతో బొంగురుపోయింది.

"సూర్యమా? సూర్యం ఎవరు?" శకుంతల అమాయకత్వాన్ని ముఖంలో ప్రతిఫలింపచేస్తూ అడిగింది.

"అక్కని ప్రేమించిన సూర్యం!"

"నీకేమయినా మతిపోయిందా? నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా?" శకుంతల ఆమెని కళ్ళతోనే వారించింది.

"నాకంతా తెలుసమ్మా! సూర్యం.. అక్కా ప్రేమించుకున్నారు. అతను మన కులం కాదని మీరు వాళ్ళ పెళ్ళికి అంగీకరించలేదు. మీరు.. మీరే అతని చావుకి బాధ్యులు!" సత్య ఆవేశంతో.. దుఃఖంతో వూగిపోతోంది.

జయ అయోమయంగా చూస్తూ ఆమె మాట్లాడుతున్నది వింటోంది. తను విన్నది అర్థం చేసుకోడానికి ఆమెకి ఒక నిమిషం పైగానే పట్టింది.

"సూర్యం!" ఆమె గావుకేక వేసింది.

బలరామశాస్త్రి గాభరాగా కంచంముందు నుంచి లేచి ఆమెని పొదివి పట్టుకున్నాడు.

"నీకేమయినా బుద్ధి వుందా? వాడి చావు వార్తని జయ వినేట్టు చెబుతావా?

అసలు నీకీ విషయాలన్నీ ఎలా తెలుసు? " శకుంతల సత్యని మింగేసేలా చూస్తూ పళ్ళుకొరికింది.

సత్య ఇంకా ఏడుస్తూనే వుంది. ఆమెకి తను టైలర్ దగ్గర నుంచి వస్తుంటే, దారిలో ఉత్కళ కనిపించి సూర్యం మరణ వార్తని చెప్పడం గుర్తొస్తోంది.

"సూర్యం ఆత్మహత్య చేసుకున్నాడు తెలుసా? "

సత్య అదిరి పడి ఆమెవైపు చూసింది "నిజమేనా? !"

"అతని కొలీగ్ సెల్‌కి తన ప్రేమ విఫలమయిందని.. ఆత్మహత్య చేసుకుంటున్నానని మెసేజ్ పెట్టాడట! మీ అక్కని ప్రేమించిన పాపానికి అతను బలయ్యాడు!" అంది. తన సెల్‌ఫోన్ తీసి పార్థు పంపిన మెసేజ్ ఆమెకి చూపిస్తూ.

"సూర్యం!" జయ అస్పష్టంగా అంటోంది. ఆమె చూపులు శూన్యంలో చిక్కడి వున్నాయి.

"అమ్మా జయా!" బలరామశాస్త్రి కూతుర్ని ఆదుర్దాగా కుదిపాడు. కానీ, ఆమెలో చైతన్యం లేదు. ఆ పిచ్చిచూపులు.. ఆ వాలకం చూస్తే, ఆమెకి మతి భ్రమించిందేమో? అనే అనుమానం వచ్చిందాయనకి.

"జయా!" శకుంతలకి కూతుర్ని చూస్తే గాభరావేసింది.

"సూర్యం!" జయ ఏడవసాగింది. ఆ ఏడుపు హృదయ విదారకంగా వుంది.

"సూర్యం!" ఆ ఆర్తనాదం ఆమె గుండెలని చీల్చుకుని వస్తున్నట్టుగా వుంది. శకుంతల వీధి తలుపు గడియవేసి వచ్చింది. ఆమెకి సత్యపై పట్టరాని ఆగ్రహంగా వుంది.

"ఈ వెధవ పీనుక్కి ఎప్పుడు ఏం మాట్లాడాలో తెలియదు. సూర్యం చావు వార్త విని గమ్మునుండక, జయ వినేట్టు చెబుతుందా? "

ఆవిడ ఏడుస్తున్న జయని, సత్యని కసురుకుంది. "ఏమిటా వెధవ ఏడుపు? ఆప్త బంధువెవరో చచ్చినట్టు!"

సత్యకి ఇన్నాళ్ళుగా తనెరిగిన తల్లిలో మరోవ్యక్తి కనిపిస్తోంది. ఆ వ్యక్తి తన సంతానాన్ని తనే భక్షించే పులిలా కనిపిస్తోంది. కోరలు కనిపించేలా నోరు తెరిచి మింగడానికి సిద్ధంగా వున్న బ్రహ్మరాక్షసిలా కనిపిస్తోంది. ఆమె నిరసనగా తల తిప్పుకుని అక్క దగ్గరకి నడిచింది.

జయ ఏడుస్తూనే వుంది. ఆ ఏడుపు కఠిన శిలలని సైతం కరిగించేలా వుంది.

"ఊరుకో అక్కా!" సత్య ఓదార్పుగా అంటూ ఆమె భుజంపై చెయ్యివేసింది. జయ ఏడుపు వున్నట్టుండి నవ్వుగా మారింది. ఉన్మాదంగా, కసిగా నవ్వసాగిందామె.

"నేను ప్రాణాధికంగా ప్రేమించిన సూర్యాన్ని మరచిపోమని అమ్మ శాసించినా మనసుని చంపుకున్నాను. నా గర్భంలో ఊపిరి పోసుకున్న అతని ప్రతిరూపాన్ని నాశనం చేసినప్పుడూ వూరుకున్నానే! కానీ నన్ను ప్రేమించిన పాపానికి అతను ఆత్మహత్య చేసుకున్నాడే! ఇప్పుడు కూడా ఎలా వూరుకోమంటావే!" అని నిలదీస్తున్నట్టుగా వుందా నవ్వు.

శకుంతల ఈడ్చిపెట్టి జయ చెంపపై కొట్టింది. జయ కొన్నిక్షణాలు నిశ్చేష్టగా వుండిపోయింది. మరుక్షణం గుండెలు బద్దలయ్యేలా రోదిస్తూ పెరట్లోకి పరిగెట్టింది. ఏం జరగబోతోందో ఊహించేలోగా నూతి గట్టెక్కింది. ఆత్రంగా ఆమెని వెన్నంటి వచ్చిన ఆ కుటుంబసభ్యులు చూస్తుండగానే నూతిలోకి దూకేసింది. ఇదంతా కనురెప్పపాటులో జరిగిపోయింది.

"జయా!" శకుంతల పిలుపు ఆక్రందనలా వుంది. "ఓరి భగవంతుడా! బిడ్డ నూతిలో పడిపోయింది. ఎవరైనా రండి! నా బిడ్డని రక్షించండి!" గుండెలవిసేలా అరవడం మొదలుపెట్టింది.

అప్పుడు చైతన్యం వచ్చింది బలరామశాస్త్రిలో! ఆయన వీధిలోకి పరిగెట్టాడు. ఇరుగు పొరుగు వాళ్ళంతా చేరారు. ఫైర్ సర్వీస్ స్టేషన్‌కి ఫోన్ చేశారెవరో!

జయని బయటికి తీసి నీళ్ళు కక్కించి ప్రథమ చికిత్స చేశారు. ఆమె ఊపిరి బలహీనంగా తీస్తోంది.

డాక్టరు వచ్చి చూసి ప్రాణాపాయం లేదని చెప్పాడు.

వయసులో వున్న ఆడపిల్ల నూతిలో పడిందంటే ఆమెది ఆత్మహత్యాప్రయత్నమే కానీ, ప్రమాదవశాత్తు పడిందేకానీ.. కాకుల వంటి లోకులు చెప్పుకునే కథలెన్ని..?

'నూతిలో ఎలా పడింది?'

'ఇంట్లో ఏమైనా గొడవపడ్డారా?'

'ఎవరినైనా ప్రేమించి మోసపోయిందేమో!' రకరకాల వ్యాఖ్యానాలు.

'కుండీలో నీళ్ళు అయిపోయాయని నీళ్ళు తోడడానికి వెళ్ళింది. సాయంకాలం కుళాయి వస్తుందమ్మా! నీళ్ళు తోడకు అని చెబుతూనే వున్నాను. కాలికి తాడు చుట్టుకొని పడిపోయింది'

తల్లి ఎంత తెలివిగా అక్క ఆత్మహత్యాప్రయత్నాన్ని యాదృచ్ఛికంగా జరిగిన ప్రమాదంగా చిత్రీకరించిందో చూస్తున్న సత్య ఆవిడని మనసులోనైనా మెచ్చుకోకుండా వుండలేకపోయింది.

జయకి స్పృహ వచ్చాక కానీ చుట్టూ వున్న జనం అక్కడ నుంచి కదలలేదు. ఆమెకి బట్టలు మార్చి గదిలో పడుకోబెట్టి ఇవతలకొచ్చి రహస్యంగా భర్తతో అంది శకుంతల.

"మీరు వెంటనే వెళ్ళి వాళ్లకి ఫోన్ చేసి రేపు పెళ్ళి జరగడంలేదని, ముహూర్తం మళ్ళీ పెట్టించి ఫోన్ చేస్తానని చెప్పండి"

"పెళ్ళి రేపటి ముహూర్తానికి ఎందుకు జరగడం లేదని అడిగితే ఏం చెప్పను?"

"నేను చచ్చిపోయానని చెప్పండి! కర్మ!" నుదురు బాదుకుంది. "మీకసలు తెలివితేటలు లేవు. నేను చస్తే మీరెలా బతుకుతారో ఏమో! జయ బహిష్టయిందని చెప్పండి!"

"అలాగే!" బలరామశాస్త్రి ఫోన్ దగ్గరికి నడిచాడు. ఫోన్ పనిచెయ్యడంలేదు. ఆ విషయమే భార్యకి చెప్పి, కాయిన్ బాక్సు నుంచి చేస్తానని బయటికి వెళ్ళాడు.

భర్త బయటికి వెళ్ళాక, శకుంతల సత్య దగ్గరికి వచ్చి ఆమె చెంపపై కొట్టింది.

"నన్నెందుకు కొట్టావు?" కళ్ళలో నీళ్ళూరుతుండగా అడిగింది సత్య.

"ఎందుకా? ఆ సూర్యంగాడి చావు వార్తని అక్క వినేలా చెప్పినందుకు! నీ వల్ల రేపు జరగవలసిన దాని పెళ్ళి ఆగిపోయింది. అసలు నీకీ విషయాలన్నీ ఎవరు చెప్పారు?"

"ఉత్కళ చెప్పింది. మా క్లాసుమేట్ పార్థు అనే అబ్బాయికి అక్క సూర్యంల మధ్య ప్రేమ వ్యవహారం తెలుసు. అక్క సూర్యం గదికి వెళ్ళడం అతనికి తెలుసు. పార్థు ఇంటి పక్కనే సూర్యం అద్దెకి వుంటున్నాడు"

"ఓరి భగవంతుడా! ఈ ఇంటి పరువు ఏమయిపోతోంది? శకుంతల కూలబడింది.

సత్య నిరసనగా ఆవిడని చూసి అవతలకి వెళ్ళింది.

★ ★ ★

"మెనీ మెనీ థాంక్సండి! మా అబ్బాయి

## కొత్తగాలి...

**సర్దుకు పోతేనే**
**సంసారం**
**లేదంటే**
**మహాసాగరం**

– పెరుక రాజు,
వెల్లింగ్టన్, తమిళనాడు





ఈ నెల స్లిప్‌టెస్ట్‌లో ఫస్టు వచ్చాడు" సంతోషంగా అంది విరజ.

"ఇందులో నా గొప్పతనం ఏముందండి? వాడికి చదువుపై చాలా శ్రద్ధ. నేను కేవలం పాఠం చెప్పాను. వాడు చదువుకున్నాడు. అయినా బలవంతంగా భక్తులని చేస్తామా?" అంది శ్రీవల్లి.

"అయినా ఈ క్రెడిట్ మీదే!" ఆమెని మరింత ఉబ్బేస్తూ అంది.

ఆమె శ్రీవల్లి ఇంటికొచ్చి పావుగంటయింది. ఇల్లంతా ఘాటైన మసాలా వాసన వ్యాపించింది. ఇల్లంటే అది ఇల్లు కాదు. ఒకే ఒక గది. ఒక పక్కగా నవారు మంచం, పక్కనే బల్లమీద వరసగా రెండు ట్రంకు పెట్టెలు. మరోవైపు బల్ల మీద గ్యాస్‌స్టవ్, కొద్దిపాటి వంటపాత్రలు. ఏహ్యతతో కూడిన చులకన భావంతో ఆ ఇంట్లోని సామాన్లని గమనిస్తోంది విరజ.

కాఫీ కలిపి తెచ్చింది శ్రీవల్లి.

"నేను కాఫీ తాగనండీ!" అంది విరజ.

'ఆఫ్టరాల్! ఒక ఆటోడ్రైవరు కాఫీ తాగిన గ్లాసుతో నేను తాగడమా?' అని ఏహ్యాభావంతో ఆమె కాఫీ వద్దంది కానీ, అలవాటు లేక కాదు.

"కాఫీయే కాదు, టీ, పాలు ఏవీ తాగను"

"అదృష్టవంతులు! నాకు రెండుపూటల కాఫీ తాగకపోతే తలనొప్పి వస్తుంది" అంటూ శ్రీవల్లి బయటికి వెళ్ళి పక్కింటి కుర్రాడిని పిలిచి డబ్బులిచ్చి కూల్‌డ్రింక్ తెమ్మంది.

ఆమె స్టవ్ దగ్గరికి వెళ్ళి గిన్నెలోని పదార్థాన్ని గరిటతో కలుపుతుంటే విరజకి ఆమె ఏం వండుతోందో తెలిసింది.

"ఏం వండుతున్నారు? చికెనా? మటనా?" జుగుప్సతో మనశ్శరీరాలు కంపిస్తున్నా.. నవ్వుతూ అడిగింది.

"చికెన్! ఆయనకి కనీసం వారానికి రెండుసార్లయినా నాన్‌వెజ్ లేకపోతే ముద్దఎత్తరు"

"మీరూ తింటారా?"

"తిననండీ! వండడం మటుకే! మావారి కోసం వండక తప్పదు. కొత్తలో చాలా కంపరంగా వుండేది. తరువాత మెల్లిగా అలవాటయిపోయింది. 'అతను వేరే కులానికి చెందినవాడని, నాన్‌వెజిటేరియన్ అని తెలిసేగా అతన్ని పెళ్ళి చేసుకున్నాను' అని నా మనసుకి నేనే సర్దిచెప్పుకున్నాను"

"నాకు తెలిసి మనుషులు రెండే వర్గాలు. వెజిటేరియన్స్, నాన్ వెజిటేరియన్స్. ఫలానా కులంవాళ్ళే నాన్‌వెజ్ తినాలని ఎక్కడా లేదు"

శ్రీవల్లి మెరుస్తున్న కళ్ళతో ఆమెని చూస్తూ అంది. "మీరు అచ్చం పుస్తకాల్లో భాష మాట్లాడతారండీ!"

నవ్వింది విరజ. ఇంతలో పక్కింటి అబ్బాయి కూల్‌డ్రింక్ తెచ్చాడు. మాంసం ఉడుకుతున్న వాసనకి కడుపులో తిప్పుతుంటే ఆమె డ్రింక్‌ని మర్యాదకోసం సిప్ చేసి వదిలేసింది.

"నేను వెళ్ళి వస్తానండీ! మీరు మా ఇంటికి రండి!"

"తప్పకుండా!" శ్రీవల్లి ఆమెని గుమ్మం వరకు సాగనంపింది.

★ ★ ★

"బలరామశాస్త్రిగారి పెద్దమ్మాయి జయ నూతిలో పడిందట! నీళ్ళు తోడుతుంటే కాలికి తాడు చుట్టుకుందట!" బయట

నుంచి వస్తూనే చెప్పాడు శంకరం.
"ఏమయింది? బతికిందా?" ఆత్రుతగా అడిగింది వనజ.
"బతికింది. పాపం! ఎంత గండం తప్పింది?"
"జయ ప్రమాదవశాత్తు నూతిలో పడ లేదు. కావాలనే దూకింది!"
'ఏమిటి? ఏం వాగుతున్నావు?" ఆయన కళ్ళెర్రచేశాడు.
"కులంకాని అబ్బాయిని ప్రేమించిందట! తరచుగా అతని గదికి వెళ్తుండేదట!"
"ఎవరు చెప్పారు నీకు?"
"ఉత్కళ చదివే కాలేజీలో అందరికీ తెలుసు!"
"అంటే! ఉత్కళ చెప్పిందా? అదీ నీలాగే తయారవుతోంది, గాలి కబుర్లు పోగేసి చెబుతూ! అది చెబుతుంటే నువ్వు దాన్ని మందలించకుండా సొల్లు కార్చు కుంటూ విన్నావా?"
"కాలేజీలో అందరూ చెప్పుకుంటున్నారని చెప్పింది"
"ఇందులో నిజమెంతో? అబద్ధమెంతో? తెలియదు. నువ్వు ఈ విషయం ఎవరి దగ్గరా నోరు జారకు! అర్థమయిందా?" హెచ్చరికగా అన్నాడు.
"అలాగే!" అంది ముఖం ముడుచుకుని.

★ ★ ★

"అమ్మా! సత్య పిలుపు ఆక్రందనలా వుంది. శకుంతల మడిబట్టలతో పూజకి ఉపక్రమించబోతున్నదల్లా దడదడలాడుతు న్న గుండెతో ఒక్కంగలో బయటికొచ్చింది.
"అమ్మా!" సత్య ఏడుస్తోంది.
"ఏమయిందే?" ఆత్రుత, ఆందోళన కల గలిపిన స్వరంతో అడిగింది.
ఆమె సమాధానం చెప్పే స్థితిలో లేదు. సత్య చలిజ్వరం వచ్చినట్టు వణికిపో తుంది. "అక్క.." దుఃఖోద్వేగంతో నిలు వెల్లా కంపిస్తున్న కూతురిని చూసేప్పటికి ఆవిడ గుండె పగిలింది. గబాల్న జయ వున్న గదిలోకి పరిగెట్టింది.
మంచం మీద కూర్చున్న జయ మామూలుగానే వుంది. కానీ ఆమె చూపు, ప్రవర్తనే మామూలుగా లేవు. ఎదురుగా ఎవరో మనిషి వున్నట్టు తనలో తనే మాట్లాడుకుంటోందామె.
"నువ్వంటే నాకెంత ఇష్టమో తెలుసా? నా శరీరాన్ని వదిలి నీ శరీరంలో పర కాయ ప్రవేశం చేసేంత ఇష్టం!" ఆమె కళ్ళు అరమోడ్పులవుతున్నాయి. పెదవులపై మ ధురమైన మందహాసం కదలాడుతోంది.
ఆమెని ఆ స్థితిలో చూసేప్పటికి శకుం తల నవనాడులూ కుంగిపోయాయి.
"జయా!" బిగ్గరగా పిలిచింది.
ఆ పిలుపు ఆమెకి వినబడిందో? లేదో? తెలియదుగానీ తన లోకంలో తను వుంది. శకుంతల ఆమెని ఇహలోకంలోకి తేవడానికి అన్నట్టు ఆమె చెంపపై బలంగా కొట్టింది. జయ కెవ్వున కేకవేసి మంచం మీద నుంచి లేచి వెనక్కి.. వెనక్కి.. నడుస్తూ గది మూలకి వెళ్ళిపోయింది. భయోత్పాతం నిండిన కళ్ళతో తల్లిని చూస్తూ అంది.
"వద్దు!.. రావద్దు! సూర్యాన్ని చంపినట్టే నన్నూ చంపేస్తావు!" పసిపిల్లాడు బూచా డిని చూసి భయపడినట్టు వణికిపోతోంది.
"ఏమిటే? పిచ్చిపట్టిందా!? ఎవరితో మాట్లాడుతున్నావు నువ్వు?" గద్దించింది.
జయ వున్నట్టుండి పగలబడి నవ్వుతూ అంది "సూర్యంతో!"
"సూర్యమా? ఎక్కడున్నాడు?"
"నాకెదురుగా వున్నాడు! నా మొగుడు నీకు కనిపించడం లేదూ!?" విరబోసివున్న జుట్టు.. విచిత్రంగా కళ్ళు తిప్పుతూ మాట్లా డుతున్న ఆమెని చూసేప్పటికి శకుంతల గుండె పగిలింది.
ఆవిడ తమాయించుకుంటూ అంది. "నీకు కాబోయే మొగుడు దీక్షితులు! సూర్యం కాదు!"

"నాకెప్పుడో పెళ్ళయిపోయింది! నాకు మళ్ళీ పెళ్ళి చేస్తానంటారేమిటే? మీకేమయినా పిచ్చా? నేనిప్పుడు కడుపుతో వున్నాను కూడా!" జయ చేతివేళ్ళు అపురూపంగా కడుపుని స్పృశిస్తున్నాయి.

సత్య వెడల్పయిన కళ్ళతో అక్కని చూస్తోంది. 'జయకి మతి చెడింది!' ఆమె ఊహకి తట్టిన విషయం అది.

కూతురికి నిజంగా మతి చలించిందో? ఇష్టం లేని పెళ్ళిని తప్పించుకోడానికి అలా నటిస్తోందో? శకుంతలకి అర్థం కాలేదు.

ఆవిడ ఒక్కంగలో గది బయటకొచ్చి గది తలుపుల్ని మూసేసింది.

"అమ్మా! అక్క.." సందేహంగా ఆగింది సత్య.

"వాడి చావువార్తని పెద్ద శుభవార్తలా చెప్పావుగా! అది షాక్ తింది. నువ్వా మాట చెప్పకుండా వుంటే ఈ పాటికి పెళ్ళయిపోను!" కోపంగా అంది.

'పెళ్ళయ్యాక సూర్యం మరణవార్త వింటే అక్క షాకవదా?' అని అడగాలనుకుంది సత్య. కానీ తనా ప్రశ్న వేస్తే ఆవిడ ఎలా రియాక్టవుతుందో తెలుసు కాబట్టి మౌనం వహించింది.

కూరగాయల కోసం బజారుకి వెళ్ళిన బలరామశాస్త్రి తిరిగి ఇంటికొచ్చేప్పటికి శకుంతల, సత్య దిగాలుగా కూర్చుని వున్నారు. ఆ ఇద్దరి ముఖాలు చూస్తే జరగరానిదేదో జరిగిందనిపించింది ఆయనకి.

"ఏమిటలా వున్నారు మీరిద్దరూ? ఏం జరిగింది?"

"జయ.." ఆవిడ కన్నీళ్ళతో జరిగిందంతా చెప్పింది.

బలరామశాస్త్రి నిస్తేజుడయ్యాడు. తరువాత తేరుకుని కూతురువున్న గది తలుపుల్ని తోశాడు. జయ శూన్యంలోకి చూస్తూ అక్కడ ఎవరో మనిషి వున్నట్టే మాట్లాడుతోంది. కూతురిని ఆ స్థితిలో చూసేప్పటికి ఆయన గుండె పగిలింది. ఎలా బయటికి వచ్చాడో? ఎలా గది తలుపులని మూశాడో? ఆయనకే తెలియదు.

"మన జయ.. జయ.. పిచ్చిదయిపోయింది శకుంతలా!" చేతుల్లో ముఖం దాచుకుని బావురుమన్నాడు.

భర్త బాధ్యతారహితంగా వుండడమే తెలుసు శకుంతలకి! 'రేపు ఎలా గడుస్తుందా?' అనే చింత లేకుండా మేరుపర్వతంలా, నిబ్బరంగా వుండే భర్త కళ్ళలో నీళ్ళు చూసి ఆవిడ కూడా చలించిపోయింది. పైటకొంగులో ముఖం దాచుకుని నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

"అక్కని సైకియాట్రిస్ట్‌కి చూపిద్దాం నాన్నా! తప్పకుండా బాగవుతుంది!" సత్య అలా అనగానే ఇద్దరూ ఆమెనే చూస్తుండిపోయారు.

"డాక్టరు దగ్గరకి తీసుకెళ్తే దాని పిచ్చి తాలూకు పూర్వాపరాలన్నీ చెప్పాలి! 'ఇంటి గుట్టు లంకకి చేటని..' అప్పుడు కానీ మన పరువు పోదు!" అంది శకుంతల.

'అలా అన్నవాళ్ళే 'సంసారం గుట్టు! రోగం రొష్టు!' అన్నారు. అది మరచిపోతున్నావు నువ్వు! అక్క సూర్యాన్ని ప్రేమించిన విషయాన్ని గుట్టుగా వుంచి, మరో సంబంధం నిర్ణయించావు! ఇప్పుడు దాని పిచ్చిని గుట్టుగా వుంచడం వల్ల ఎవరికి నష్టం? దాని పిచ్చి ముదిరిపోయి చివరికి దాన్ని మెంటల్ హాస్పిటల్‌లో చేర్చాల్సి వస్తుంది. లేదా అక్క రోడ్డు మీద తిరుగుతుంది' ఈ మాటల్ని సత్య పైకి అనలేదు. తనలో తనే అనుకుంది.

"పిచ్చి లేదు! ఏం లేదు! ఆ సూర్యం దెయ్యమై మన అమ్మాయిని పట్టి పీడిస్తున్నాడండీ! వడిశలేరులో మంచి భూతవైద్యుడున్నాడట! ఎలాంటి దెయ్యాన్నయినా వదిలించేస్తాడట! అక్కడకి తీసుకెళ్దాం!"

ఇంక వూరుకోలేకపోయింది సత్య.

"అమ్మా! నీకు మతిపోయిందా? వైద్య శాస్త్రం ఇంతగా అభివృద్ధి చెందుతున్న

# విషపు ఆహారం

చతుర సమగటుల

ఆహారం ఆరోగ్యానికి, కానీ కొన్ని దేశాల్లో కొన్ని రకాల ఆహారం ప్రమాదకరం, ప్రాణాంతకం. అయినా అక్కడి ప్రజలు వాటిని తింటుండటం విశేషం..

*ఫ్యూగూ చేప:* జపాన్‌లోని ఈ చేపలో విషం కూడా ఉంటుంది. శిక్షణ పొందిన నిపుణులే దీని లివర్‌ని, కడుపులోని ఇతర విషపు అవయవాలని జాగ్రత్తగా తొలగించి వండుతారు. అయినా 2015లో ఐదుగురు ఈ చేపని తిని మరణించారు. 1996-2006 మధ్య నలభై నాలుగు మంది ఇలా మరణించారు. ఈ చేపని రెస్టారెంట్స్‌లోనే తినాలి.



*బుల్‌ఫ్రాగ్:* నమీబియా, ఇతర ఆఫ్రికన్ దేశాలలో మాత్రమే తినే ఈ కప్ప 'పిల్ల'గా ఉన్నపుడు శరీరం నిండా విషం ఉంటుంది. దీంతో కిడ్నీలు ఫెయిలవుతాయి. అది పెరిగి పెద్దయ్యాక ఆ విషం పోతుంది. తరచూ బుల్‌ఫ్రాగ్ తిని అనారోగ్యం పాలయ్యేవాళ్లు ఆఫ్రికన్ దేశాల్లో ఎక్కువ.

*అక్కీ:* జమైకాలో తినే ఈ పండుకి ఉండే నల్లటి గింజలని తొలగించి తినాలి. ఈ విత్తనాల్లో విషం ఉంటుంది. అవి తింటే వాంతులు ఆరంభమవుతాయి. 2011లో 35 మంది ఈ విషం బారిన పడ్డారు. ఈ పండుని తినే ప్రతి వెయ్యిమందిలో సగటున ఒకరు అనారోగ్యం బారిన పడతారు.

*సన్నక్‌జీ:* ఈ ఆక్టోపస్‌లోని సక్షన్ కేప్స్, అవి మరణించాక కూడా పనిచేస్తాయి. పచ్చి ఆక్టోపస్‌నే ఇష్టపడతారు కాబట్టి బాగా నమిలి మింగాలి. సక్షన్ కేప్స్ గొంతుకు అడ్డుపడి సగటున ఏడాదికి ఆరుగురు మరణిస్తుంటారు.

*బ్లడ్ క్లామ్స్:* దీంట్లో హెపటైటిస్ ఏ, ఇ, టైఫాయిడ్, డిసెంట్రీ బ్యాక్టీరియా ఉంటాయి. దీన్ని బాగా ఉడకపెట్టి తినాలి. వీటిని తినే పదిహేను శాతం మంది ఈ రోగాల బారిన పడతారు. చైనీస్ వీటిని తింటారు.

*కసూమర్జు:* ఈ చీజ్ లోపల పురుగులు గుడ్లు పెడతాయి, తాజాది కాకపోతే. తిన్నాక ఆ గుడ్లు కడుపు గోడలని ఛేదించడంతో తీవ్ర అనారోగ్యానికి గురవుతారు.

*జపాన్‌లోని జెల్లీ ఫిష్:* టూనా చేపలో జీవిస్తుంది. దీని కొన్ని భాగాలు విషంతో కూడినవి కాబట్టి బాగా ఉడకపెట్టకపోతే అనారోగ్యం కలుగుతుంది.

---

ఈరోజుల్లో కూడా దెయ్యం, భూతం.. అని మూఢనమ్మకాలేంటి? సూర్యం మరణంతో అక్క షాక్ తింది. అతన్ని గాఢంగా ప్రేమించింది కాబట్టి అతనితో కలిసి వుంటున్న భ్రాంతిలో వుంది. దీనికి సరైన ట్రీట్‌మెంట్ ఇచ్చేది సైకియాట్రిస్టే!"

"నువ్వు నోర్మూయ్! 'పిచ్చ గిల్లి జోలపాడినట్టుంది' నీ వరస! అక్క పరిస్థితికి కారకురాలివి నువ్వు! పెద్ద ఆరిందాలా డాక్టరు దగ్గరకి తీసుకెళ్తుందట!" శకుంతల పళ్లు కొరుకుతూ అంది.

"అవును! నేను సూర్యం మరణవార్తని అక్క వినేలా చెప్పకపోతే దానికి పెళ్ళయ్యేది! ఎప్పటికైనా సూర్యం మరణవార్త దానికి తెలియదా? అప్పుడు దానికి పిచ్చెక్కితే దాని అత్తవారు.. మొగుడు.. నిజం తెలుసుకుని దాన్ని వదిలేసేవారు! ఇకొంకడ్ని ప్రేమించిన పిల్లని మోసంతో వాళ్ళకి అంటగట్టినందుకు నిన్ను, నాన్నని తిట్టిపోసేవారు" సత్య దుఃఖంతో, ఆవేశంతో వణికిపోతోంది.

"పాపిష్టిముండా! నాకే నీతులు చెప్పేటంత ఎదిగిపోయావా నువ్వు?" శకుంతల ఆమెని కొట్టబోయింది.

బలరామశాస్త్రి అడ్డుకున్నాడు.

"నువ్వు వెళ్ళి చదువుకోమ్మా!"

సత్య ఏడుస్తూ వెళ్ళి వీధి వరండాలో కూర్చుంది. అక్కకి మతి చలించిందనే బాధకంటే తల్లి మూర్ఖత్వంతో ఆమెకి సరైన వైద్యం చేయించకుండా ఆమెని పూర్తిగా పిచ్చిదాన్ని చేస్తుందేమో అనే భయం ఆమెని వణికించేస్తోంది.

## 7

"మీరు..? నువ్వు అంజలి కదూ!" వంటమనిషి వచ్చిందని మెయిన్ డోర్ తియ్యడానికెళ్ళిన అంజలి, గుమ్మం దగ్గర నిలబడివున్న ఆ అపరిచిత యువకుడిని సీరియస్‌గా చూసింది. అతనికి తన పేరెలా తెలుసా? అని.

"ఆ చెంప మీద పుట్టుమచ్చ! నాకు బాగా గుర్తు! నువ్వు అంజలివే!" అతని ముఖంలో ఆమెని గుర్తుపట్టిన భావం.

"సారీ! మీరెవరో నాకు తెలియదు!" అంది.

"నేను ఇంటర్‌మీడియెట్‌లో నీ క్లాస్‌మేట్‌ని! నా పేరు మహేష్!" అని అతను తనని పరిచయం చేసుకోగానే ఆమె ముఖం వెలవెలపోయింది.

ఈ మహేష్ గురించి భర్తతో చెప్పబట్టే కదా తన కాపురం నరకమైపోయింది! ఆమె ఇబ్బందిగా కదిలింది.

"ఓ! నువ్వా? !" అంది బలవంతాన నవ్వుతూ.

"చాలారోజులకు కలిశాం! మీ ఇంటికి నన్ను పిలవ్వా? ' ' చనువుగా అడిగాడు.

"రా..!" అంది ఇబ్బందిగానే. అంజలికి ఒకే ఒక ధైర్యం! చరణ్ ఆఫీసు నుంచి రాత్రి ఎనిమిది దాకా రాడు!

మహేష్ లోపలికి వచ్చి సోఫాలో కూర్చున్నాడు. అంజలి ఇప్పుడే వస్తానని లోపలికి వెళ్లి మంచినీళ్లు తెచ్చింది. "నువ్వు కాఫీ తాగుతావా? టీయా? " అడిగింది.

"కాఫీ ఇప్పుడే తాగాను! మరోసారి తాగడానికి అభ్యంతరం లేదుగానీ, కాస్సేపాగి తాగుతాను!" అన్నాడు.

అంజలి తనకెదురుగా కూర్చుంది.

"ఇప్పుడు చెప్పు! నీ పెళ్లి ఎప్పుడయింది? మీవారేం చేస్తారు? నువ్వు బీకామ్‌తో సరిపెట్టేశావా? పీజీ చేశావా? " అడిగేతడు.

"ఎమ్.కామ్. చదివాను! ఉద్యోగం చెయ్యాలనుకుంటుండగా పెళ్లి సంబంధం రావడం.. పెళ్లవడం.. జరిగిపోయాయి!"

"నీ సంగతేంటి? "

"సి.ఎ. చేశాను. మద్రాస్‌లో మా నాన్న



గారి దగ్గర ప్రాక్టీసు చేస్తున్నాను"

"పెళ్లయిందా? "

"ఇంకా లేదు!"

"ఏం నచ్చిన అమ్మాయి దొరకలేదా?" తనకి తెలియకుండా ఫ్రీగా అడిగింది.

"నిన్ను పెళ్లి చేసుకోవాలనుకున్నాను! నువ్వేమో నాకోసం ఆగకుండా పెళ్లి చేసేసుకున్నావు"

అంజలి ముఖంలో రంగులు మారాయి.

"ఊరికే తమాషాకి అన్నాను. నా పెళ్లి నిశ్చయమయింది. ఈనెల చివరలో పెళ్లి!"

"కంగ్రాచ్యులేషన్స్!" అంది.

"థాంక్యూ!.." క్షణం ఆగి అన్నాడు "పదిహేడేళ్ల వయస్సులో నేను నీకు ప్రపోజ్ చెయ్యడం తలచుకుంటే ఇప్పటికీ నవ్వొస్తోంది" పకపకా నవ్వేడతను.

చాలారోజుల తర్వాత అంజలి కూడా మనస్ఫూర్తిగా నవ్వింది. నవ్వుతూనే యథాలాపంగా గుమ్మంవైపు చూసిన ఆమె కళ తప్పిన ముఖంతో లేచి నిలబడింది.

ద్వారం పొడుగునా చరణ్! తనని, మహేష్‌ని మార్చి మార్చి చూస్తున్నాడు.

ఆ చూపులు చురకత్తుల్లా ఉన్నాయి.

"మావారు.." అంది. అస్పష్టంగా ఆమె గొంతు తడారిపోయింది. తన గుండె కొట్టుకునే శబ్దం పైకే విన్పిస్తోంది.

మహేష్ మర్యాద పూర్వకంగా లేచి నిలబడ్డాడు. "హలో!" కరచాలనం కోసం చెయ్యి చాపాడు. "ఐ యామ్ మహేష్! చిన్నప్పుడు అంజలి క్లాస్‌మేట్‌ని!"

'మహేష్' అని అతను పరిచయం చేసుకోగానే చరణ్ ఓరకంట అంజలిని చూశాడు.

"గ్లాడ్ టు మీట్ యూ! ఐ యామ్



చరణ్!" అంటూ అతనితో కరచాలనం చేశాడు.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు.

అంజలికి అక్కడుండాలో? వెళ్లిపోవాలో? అర్థకావడం లేదు. ఇబ్బందిగా చరణ్ కూర్చున్న సోఫా వెనుక నిలబడింది. నీ ఫ్రెండుకి కాఫీ ఇచ్చావా? లేదా? 'ఫ్రెండ్' అన్నచోట ఒత్తి పలుకుతూ అన్నాడు.

"లేదు.." చిన్నగా అంది.

"మరి తీసుకురా!" అన్నాడు చరణ్.

అంజలి అక్కడ నుంచి లోపలికి వెళ్లిపోయింది. పాల పాకెట్టు ఫ్రీజ్‌లో నుంచి తీసి పాలు స్టవ్ మీద పెట్టింది.

రాత్రి వంటకి కూరలు తరుగుతున్న కాంత అడిగింది. "కాఫీ కలపనామ్మా? "

"ఫర్వాలేదు! నేను కలుపుతాను!" అంది కప్పులు ట్రేలో పెడుతూ అంజలి. కాఫీ కప్పులతో డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చేటప్పటికి ఆ ఇద్దరూ నవ్వుకుంటున్నారు. చరణ్ ఎలాంటి వాళ్లనైనా తన నటనతో పడగొట్టగలడని ఆమెకి తెలుసు! ట్రేని టీపాయ్ మీద పెట్టి వెనుదిరగబోయింది.

"అదేమిటి? అతనికి కప్పు అందివ్వు!" అన్నాడు చరణ్!

అతని మాట వినిపించుకోనట్టు లోపలికి వెళ్లిపోయింది.

"ఫర్వాలేదండి! నేను తీసుకుంటాను!" అన్నాడు మహేష్ కప్పు అందుకుంటూ!

"వచ్చి కూర్చో! ఎప్పుడూ వంటింట్లోనే వుంటావు! వంటమనిషి వున్నా! అంత పనేం చేస్తావు? " అన్నాడు చరణ్.

అంజలి సందిగ్ధంలో పడింది. అతని మాట విని కూర్చోవాలా? అక్కడ నుంచి వెళ్లిపోవాలా? అని.

"కూర్చో! అంజలీ!" అన్నాడు మహేష్.

అంజలి భర్త పక్కన కూర్చుంది. ఆమెకి ఇబ్బందిగానే కాదు, భయంగా కూడా వుంది. ఆమె గుండె గుబగుబలాడుతోంది. మహేష్ తొందరగా వెళ్లిపోతే బాగుండును! అనుకుంది.

"మీరు ఎక్కడుంటారు? ఏం చేస్తున్నారు? " అడిగేడు చరణ్.

"చెన్నైలో వుంటున్నానండీ! నేను సి.ఎ. చేశాను. మా నాన్నగారు కూడా చార్టెడ్ అకౌంటెంట్!"

"అంజలిని ఎలా గుర్తుపట్టారు? "

"మీ ఫ్లాట్‌కి ఎదుటి ఫ్లాట్‌లో మా బాబాయ్‌వాళ్లు వుంటున్నారు. ఈ రోజు పొద్దుటే ఇక్కడకొచ్చాను. నేను బయటకి వెళ్లబోతుంటే మీ గుమ్మంలో అంజలి కనిపించింది. ఆమె నన్ను గుర్తుపట్టలేదు. కానీ నేనామెను గుర్తుపట్టాను!"

"ఎంత అదృష్టం! చాలా ఏళ్ల తరువాత అంజలిని చూసినా, ఆమెని గుర్తుపట్టగలిగారంటే మీరామెని మరచిపోలేదన్న మాట!" అన్నాడు అదోలా నవ్వుతూ.

అంజలి ముఖం మరింత నల్లబడింది. చరణ్ వచ్చాక ఆమె ముఖంలో నవ్వు మాయమవడం గమనించాడు మహేష్. అందుకే లేచి నిలబడ్డాడు.

"ఓకేనండీ! నేను బయలుదేరుతాను! బై అంజలీ!" అన్నాడు.

"నీ ఫోన్ నెంబరు అతనికివ్వు అంజలి! ఎప్పుడైనా ఫోన్‌లో మాట్లాడుకోవచ్చు ఎంతయినా మీరిద్దరూ ఫ్రెండ్స్ కదా!"

"వచ్చేనెలలో నా పెళ్లి! కార్డు పంపిస్తాను. మీరిద్దరు తప్పక రావాలి!" అని మహేష్ వెళ్లిపోయాడు.

అతను చరణ్ మాటతీరులోని తేడాను గమనించాడు. అతనికి ఇంక అక్కడ వుండబుద్ధి కాలేదు.

అంజలి ఖాళీ కప్పులు తీసుకొని లోపలికి వెళ్లిపోయింది.

చరణ్ మూడు బెడ్‌రూములూ తిరిగి చూసి వచ్చాడు.

అతన్ని గమనించిన అంజలికి, అతనెందుకు బెడ్‌రూముల్లోకి వెళ్లి వచ్చాడో?

అర్థం కాలేదు.

తరువాత డ్రాయింగ్ రూములో కూర్చొని లాప్‌టాప్ ఓపెన్ చేశాడు. మధ్యలో సెల్ ఫోన్‌లో ఎవరితోనో సంభాషిస్తున్నాడు.

కాంత వంట పూర్తిచేసి అన్నీ డైనింగ్ టేబుల్ మీద సర్ది వెళ్లిపోయింది.

ఇంట్లో అతను, తను.. ఇద్దరే వున్నారనే నిజం అంజలికి భయంకరంగా వుంది.

మరో గంట తర్వాత చరణ్ కూర్చున్న చోటనుంచి లేచాడు. వంటింట్లో గిన్నెలని సర్దినవే సర్దుతున్న అంజలి దగ్గరకొచ్చాడు.

"ఇప్పుడు చెప్పు! ఎన్నాళ్లనుంచి నడుస్తోంది వ్యవహారం? " తీవ్రంగా వుందతని స్వరం.

"ఏమిటి మీరనేది? " అర్థం కానట్టు చూస్తూ అడిగింది.

"మహేష్ నీ దగ్గరికి ఎన్నాళ్ల నుంచి రాకపోకలు సాగిస్తున్నాడు? "

"అతను మన ఇంటికి ఇవాళే వచ్చాడు! ఇదివరకెప్పుడూ రాలేదు!"

"అబద్ధం! నేను ఆఫీసుకి వెళ్లగానే వాడిని ఇంటికి రప్పించుకుని వాడితో కులికి, నాకు అనుమానం రాకుండా బెడ్‌షీట్సు మార్చేసి ఏమీ తెలియనట్టు ఎంత అమాయకురాలిలా నటిస్తున్నావే? !"

ఆమె మనశ్శరీరాలు అవమానంతో దహించుకుపోతున్నాయి. నిరాధారమైన అతని అనుమానానికి దుఃఖం వస్తోంది.

"మీరు నమ్మినా? నమ్మకపోయినా? ఇది నిజం!" గొంతు పూడుకుపోతుండగా నిస్సహాయంగా చూస్తూ అంది. "అతన్ని కొన్నేళ్ళ తరువాత ఇవాళే చూశాను. బెడ్ షీట్సు ఉదయం మీరు ఆఫీసుకి వెళ్ళాక మార్చాను"

"ఓకే! నాకు నమ్మకం కలగాలంటే నువ్వు అతనితో తప్పుచెయ్యలేదని నిరూపించాలిగా? " రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తూ అన్నాడు.

"మిమ్మల్ని నమ్మించడానికి నన్నేం చెయ్యమంటారు? అలనాటి సీతలా అగ్నిప్రవేశం చేసి నేను శీలవతినే అని నిరూపించనా? " నిస్సహాయంగా అంది.

"అరె! నా మనసులో వున్నది నువ్వెలా కనిపెట్టేశావు? ఇప్పుడే వస్తాను! ఒక్క నిమిషం!" అతను గిరుక్కున వెనుదిరిగి హాలులోకి వెళ్ళి అక్కడ టీపాయ్ మీదున్న కారు తాళాలందుకుని బయటికి వెళ్ళాడు.

'అతనేం చెయ్యబోతున్నాడిప్పుడు? నిజంగానే తనని అగ్నిపరీక్షకి సిద్ధపడమంటాడా? అలా చేస్తే తనేం చెయ్యాలి? !" అంజలి ఆలోచిస్తూ కిచెన్‌లో మధ్యగా నిలబడిపోయింది.

★ ★ ★

"నువ్వంటే నాకెంత ఇష్టమో? తెలుసా? నా శరీరాన్ని వదిలి నీ శరీరంలో పరకాయప్రవేశం చేసేంత ఇష్టం" జయ కళ్ళు అరమోడ్పులవుతున్నాయి. ఎదురుగా ఎవరో మనిషి వున్నట్టు తనలో తాను మాట్లాడుకుంటోంది.

అక్కని ఆ స్థితిలో చూసేప్పటికి సత్యకి ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది.

'ప్రేమంటే కలిసి జీవించడం కలిసి మరణించడం' అని నమ్మిన జయ సూర్యం మరణవార్తని విని ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. సమయానికి రక్షించబట్టి బతికి బయటపడింది. కానీ, సూర్యం మరణాన్ని తట్టుకోలేక ఆమెకి మతి చలించింది.

## కొత్తగాలి...

**నీ కనుచూపుల కదలికల్లో**
**నా కవితల ప్రాచీనత్వం!**
**నీ పెదాల చాటున శబ్దాల్లో**
**నిత్య సంతోష నూతనత్వం!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవల్లి

## కొత్తగాలి...

**ఎక్కడా ఏ ఆధారం**
**లేదని నేనేడుస్తుంటే**
**ఎక్కడ నీ ఆధార్?**
**అని నన్ను సంపుతున్రు!**

– డా. యండపల్లి పాండురంగ,
గణపవరం, ప.గో. జిల్లా

కూతురికి మతి చలించిన విషయాన్ని దాచిపెట్టి ఆమెకి పెళ్ళిచెయ్యాలని, పెళ్లయితే పిచ్చి తగ్గుతుందని తల్లి ఆలోచన.

"నాకెప్పుడో పెళ్ళయిపోయిందే! మళ్ళీ పెళ్ళి చేస్తానంటారేమిటి? నేనిప్పుడు కడుపుతో వున్నాను కూడా!" జయ పగలబడి నవ్వుతోంది.

సత్య ఇంట్లో వుండలేక, పుస్తకాలు తీసుకుని కాలేజీకి బయలుదేరింది.

ఉత్కళ గేటు దగ్గర కనిపించింది. "ఏమైపోయావు ఇన్నాళ్ళూ? " అడిగింది.

"ఏమీ అయిపోలేదు! ఇంట్లోనే వున్నాను!" ముక్తసరిగా అంది.

"మీ అక్క పెళ్ళికి పిలవనే లేదు!"

సత్య మాట్లాడలేదు.

"పెళ్ళి బాగా జరిగిందా? "

'అక్క సూర్యాన్ని ప్రేమించిన విషయం ఉత్కళకి తెలుసు! అందుకే ఆమె పెళ్ళి గురించి ప్రత్యేకంగా అడుగుతోంది' అనే ఊహకే ఆమె మనసు చిన్నబోయింది.

తనడిగిన దానికి ఆమె జవాబివ్వకపోవడంతో తిరిగి ఉత్కళే అంది.

"మీ అక్కని ప్రేమించిన పాపానికి సూర్యం బలయిపోయాడు! మీ అక్క మాత్రం సుఖంగానే వుంది"

గుండెల్లో బాకులా దిగబడిందా మాట!

'అక్క సుఖంగా వుందా? చుట్టూ ఏం జరుగుతోందో తెలయకుండా, అనుక్షణం సూర్యాన్నే కలవరిస్తూ పిచ్చిదైపోయింది!' కళ్ళలో నీళ్ళూరుతుండగా ఉత్కళ పిలుస్తున్నా పట్టించుకోకుండా అక్కడి నుంచి క్లాస్‌రూమ్‌కి వచ్చేసింది సత్య.

★ ★ ★

హఠాత్తుగా వచ్చిన సోమయాజుల్ని చూసి బలరామశాస్త్రి ముఖం వెలవెలబోయింది.

"నమస్కారం! రండి బావగారూ!" తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అహ్వానించాడు.

ఆయన లోపలికొచ్చాడు. "మా బావమరిది ఈ వూళ్ళోనే వుంటున్నాడు. అతన్ని చూడ్డానికి వచ్చాను. ఇంతదూరం వచ్చాను కదా, మిమ్మల్ని కూడా చూసి పోదామని వచ్చాను!"

"చాలా సంతోషం! కూర్చోండి!" అని కుర్చీని ఇవతలకి లాగి "శకుంతలా!" అని భార్యని పిలిచాడు.

ఇలాంటి సమస్యని భార్య చాకచక్యంగా పరిష్కరిస్తుందని ఆయన నమ్మకం.

భర్త పిలుపుతో వచ్చిన ఆవిడ, కాబోయే వియ్యంకుడ్ని చూసి కొయ్యబారిపోయింది.

"నమస్కారం! అన్నయ్యగారూ! కులాసాగా వున్నారా? వదినగారు బాగున్నారా? " అడిగింది, మర్యాద ఉట్టిపడే స్వరంతో!

"ఆc! మీ దయవల్ల అందరం బాగున్నాం! మా కోడలేది? "

"జయ, స్నేహితురాలింటికి వెళ్ళింది!" తడుముకోకుండా చెప్పింది.

"అలాగా! ఎప్పుడొస్తుంది ఇంటికి? "

"ఇప్పుడే! మీరు వచ్చేముందే వెళ్ళింది! పిల్లలు కబుర్లలో పడితే, గంట పట్టొచ్చు! రెండు గంటలు పట్టొచ్చు!"

"దానికేముంది? ఇవాళంతా ఇక్కడే వుంటాను! జయని చూసే వెళ్తాను!" సోమయాజులు స్థిమితంగా కూర్చున్నాడు.

శకుంతల ముఖం కళ తప్పింది. 'ఈయన ఇవాళంతా ఇక్కడే వుంటాడా?

జయని చూసే వెళ్తాడా? కొంపదీసి జయకి మతి చలించిన విషయం తెలిసే ఇక్కడకొచ్చాడా? " ఆవిడకి ముచ్చెమటలు పోస్తున్నాయి. జయ వున్న గది తలుపులు తాళం పెట్టిందా? లేక పని తొందరలో మరచిపోయిందా?

"మీకు కాఫీ తెస్తాను!" అంటూ వెనుది రగబోయింది. అప్పుడే గదిలోంచి బయట కొచ్చింది జయ.

విరబోసిన జుట్టు, మాసిపోయిన బట్టలు, శుష్కించిన శరీరంతో వున్న ఆమెని చూడగానే తల్లి శకుంతల "స్నానం చేసిరా! మీ మామగారు నిన్ను చూడ్డానికి వచ్చారు!" అని ఆమెని అక్కడ నుంచి పంపెయ్యబోయింది.

"సూర్యం వచ్చాడా? " జయ అడిగింది.

ఆ సమయంలో సోమయాజులు ఎదురుగా ఆమె నోటివెంట 'సూర్యం' ప్రస్తావన రాగానే శకుంతల ముఖంలో రంగులు మారాయి.

"లోపలికి రా!" పళ్ళ బిగువున అంటూ, చెయ్యిపట్టుకుని ఆమెను లాక్కెళ్ళబో యింది. ఆమె తల్లి చేతిని విదిలించి ఒక్కంగలో హాల్లోకి దూసుకొచ్చింది.

సోమయాజులు రెప్పవాల్చకుండా చూస్తూ, ఆమె గురించి తన బావమరిది చెప్పింది నిజమేనని నిర్ధారించుకున్నాడు.

"ఏమిటమ్మాయ్? అలా వున్నావు? మరో పది రోజుల్లో పెళ్ళి జరగబోతుండగా! పెళ్ళికూతురివి! ఎంత కళకళలాడుతూ వుండాలి!" ఆప్యాయంగా అన్నాడు.

"పెళ్ళా! నాకా? " విరగబడి నవ్వింది. "నాకూ సూర్యానికి ఎప్పుడో పెళ్ళయిపో యింది! నాకు మళ్ళీ పెళ్ళి చేస్తానంటారే మిటండీ వాళ్ళు? వాళ్ళకందరికీ పిచ్చా? "

బలరామశాస్త్రి పాలిపోయిన ముఖంతో నేలచూపులు చూస్తున్నాడు.

జయ వున్నట్టుండి సోమయాజులుకు ఎదురుగా నేల మీద కూలబడింది.

"సూర్యాన్ని వీళ్ళందరూ కలిసి ఎక్కడో దాచేశారు! నన్ను గదిలో పెట్టి గొళ్ళెం పెట్టేస్తున్నారు! నాకు అతని దగ్గరకి వెళ్ళి పోవాలని వుంది! నన్ను అతని దగ్గరకి పంపమని చెప్పరూ? ప్లీజ్!"

శకుంతల గుండె దడదడలాడుతుండగా, సోమయాజులికి ఎదురుపడలేక తలుపుచాటున నిలబడింది.

"నాకు పుట్టిన బాబుని హాస్పిటల్లో వది లేశారు! నా బాబుని నా దగ్గరకి తెచ్చుకో వాలని వుంది! కానీ అంతదూరం ఎలా వెళతాను? విజయవాడ వెళ్ళడానికి డబ్బు కావాలి! మా నాన్న నాకు డబ్బివ్వడు! మీరైనా నాకు డబ్బులివ్వరూ? " దీనంగా అడుగుతూ చెయ్యి జాపింది.

సోమయాజులు లేచి నిలబడ్డాడు. ఆయనకి ఇంక బలరామశాస్త్రిని అడిగి తెలుసుకోవలసింది ఏమీ లేదనిపించింది.

"మీరిచ్చిన కట్నం డబ్బు మీకు పంపిస్తాను! అమ్మాయిని మంచి సైకియాట్రిస్ట్‌కి చూపించండి!" అని గడప దాటాడు.

ఆయన నిష్క్రమించే వరకు లోపల గదిలో శిలాప్రతిమలా నిలబడి, జయ సోమయాజులుతో మాట్లాడింది వింటూ అసహాయంగా పళ్ళుకొరుక్కుంటున్న శకుంతల సుడిగాలిలా బయటకొచ్చింది. కూతురి భుజాన్ని గుచ్చిపట్టుకుని "లే..!" అంది కఠినంగా!

"నేను రాను! నువ్వు మళ్ళీ గదిలోపెట్టి తలుపు తాళం వేస్తావు!" భయంగా చూస్తూ అంది జయ.

"పాపిష్టిముండా? మా పరువు మంటకలిపావు కదే! మమ్మల్ని తల ఎత్తుకోకుండా చేసేశావు!" శకుంతల ఒళ్ళు తెలియని ఆవేశంతో కూతుర్ని ఎడాపెడా కొడుతోంది.

దెబ్బలని తట్టుకోలేక జయ కెవ్వుమంటూ చేస్తున్న ఆర్తనాదాలు తల్లి మనసుని కరిగించలేకపోయాయి.

నిశ్చేష్టుడయి జరుగుతున్నది చూస్తున్న

## కొత్తగాలి...

**విషాదమనే సముద్రాన్ని**
**కలంతో చిలికితే**
**వచ్చే అమృతమే**
**కవిత్వం!**

– బొడ్డు గోవిందరాజు,
మన్యంవారిపాలెం, తూ.గో. జిల్లా

బలరామశాస్త్రి ఒక్కంగలో వచ్చి కూతురికి, భార్యకి మధ్య అడ్డుగా నిలిచాడు.

"నీకేమైనా మతిపోయిందా? మతిస్థిమితంలేని పిల్లని గొడ్డుని బాదినట్టు బాదుతావెందుకు? "

"కొట్టడం కాదు! దీన్ని చంపెయ్యాలి! నిశ్చయమయిన పెళ్ళిని చేజేతులా చెడగొట్టుకుంది!"

"నోర్ముయ్!" ఆయన కళ్ళెర్రచేశాడు. "ఇది వున్న పరిస్థితిలో ఎవరే దీన్ని పెళ్ళి చేసుకునేది? ఒకవేళ మసిపూసి మారేడు కాయచేసి ఎలాగో పెళ్ళిచేసినా, ఈ పిచ్చిది భర్తతో కాపురం చేస్తుందా? దీని విషయం బయటపడి పెళ్ళయిన మరునాడే మొగుడు వదిలేసిపోతాడు!"

"దాని కర్మ ఎలా వుంటే అలా జరుగుతుంది!"

"నువ్వు తల్లివి కాదే! రాక్షసివి! అసలు ఇదంతా చేసింది నువ్వు! దానికి అబార్షన్ చేయించి, పెళ్ళిచెయ్యాలని సలహా ఇచ్చావు! నీ మాట విని గుడ్డిగా నీ సలహా పాటించాను! లోకంలో ఎన్ని కులాంతర.. మతాంతర వివాహాలు జరగడంలేదు! పెద్దల అనుమతితోనో? వాళ్ళ అంగీకారం లేకుండానో? ఎందరు ప్రేమించిన వాళ్ళని పెళ్ళిళ్ళు చేసుకోడంలేదు! జయ తన ప్రేమ విషయాన్ని గుట్టుగా దాచి, స్వతంత్రంగా సూర్యాన్ని పెళ్ళి చేసుకుని వుంటే ఏం చేసేదానివి? వాళ్ళ పెళ్ళికి అనుమతి ఇస్తామనే పిచ్చిభ్రమతో అది మనకు చెప్పినందుకు, చూశావా? ఏం చేశామో! దాని జీవితాన్ని ఛిన్నాభిన్నం చేశాం! సూర్యం చచ్చిపోయాడు. జయ జీవచ్ఛవమైంది! దాని పరిస్థితికి పరోక్షంగా కారకులమైన మనమే దాని జీవితాన్ని చక్కదిద్దాలి! నీకిష్టం వున్నా, లేకపోయినా నేను దానికి తోడుగా నిలబడతాను!" అంటూ కూతురి దగ్గరకి వెళ్ళి ఆమె భుజంపై చెయ్యి వేశాడు.

"జయా!" ఆదరంగా పిలిచాడు.

ఆమె తలెత్తి పిచ్చినవ్వు నవ్వింది.

"సూర్యం దగ్గరికి వెళ్దాం! రామ్మా!"

"నిజంగానా! నన్ను సూర్యం దగ్గరకి తీసుకెళ్తావా? "

"నిజం తల్లీ!"

"భలే! భలే!! ఎంత మంచివాడివి నువ్వు!" ఆమె ముఖం సంతోషంతో దీప్తిమంతయింది. చెంగున లేచి నిలబడింది.

బలరామశాస్త్రి కూతురిని ఆటో ఎక్కించి తను కూడా ఎక్కాడు. ఆటో అతనికి ఎక్కడికి వెళ్ళాలో చెప్పాడు. ఆటో ఆ వూళ్ళో ప్రముఖ సైకియాట్రిక్ హాస్పిటల్ వైపు దూసుకుపోయింది.

★ ★ ★

చరణ్ తిరిగి కిచెన్‌లోకి వచ్చాడు. అతని చేతిలోని పెట్రోల్ టిన్నుని చూడగానే అంజలి నిటారుగా అయింది. ఏం జరగబోతోందో ఊహించేలోగా చరణ్ పెట్రోల్ టిన్ను మూతతీసి ఆమె తలమీద పోసేశాడు. వికటంగా నవ్వుతూ అగ్గిపెట్టె కోసం జేబులో చెయ్యి పెట్టాడు.

"నువ్వు శీలవతివే అయితే కాలిపోవు! కులటవే అయితే.."

అతని చేతిలోని అగ్గిపెట్టెని చూడగానే, అంత షాక్‌లోనూ అంజలికి అర్థమయింది, అతను తనని సజీవదహనం చెయ్యబోతున్నాడని! నిరాధారమైన అనుమానంతో తనని అగ్నిపరీక్షకి సిద్ధమవమంటున్న

భర్తవైపు దిమ్మెరపోయి చూస్తున్న ఆమెలో అసహాయమైన కోపం, దుఃఖం క్షణంలో తెగింపుగా మారాయి! ఆమెలో చెప్పలేనంత ధైర్యం వచ్చేసింది. పిడికిలి బిగించి అతని ముక్కు మీద బలంగా గుద్దింది. చరణ్ చేతిలోని అగ్గిపెట్టె ఎగిరి దూరంగా పడింది. ఆమె ఎంత బలంగా గుద్దిందంటే అతని ముక్కు, నోరు ఏకమైనట్టయింది.

"అమ్మా!" అరుస్తూ అప్రయత్నంగా నేల మీద కూలబడిపోయాడు.

అదే అదనుగా అంజలి పరుగు లంకించుకుని, ఇంట్లోంచి బయటపడింది. ఫ్లాట్ బయటికి రాగానే మెయిన్ ఎంట్రెన్స్ డోర్ బయట గడియ పెట్టేసింది. అదృష్టవశాత్తు లిఫ్ట్ ఆ ఫ్లోర్‌లోనే ఆగివుంది. ఆమె అదే ఊపుతో లిఫ్ట్‌లోకి వచ్చి గ్రౌండ్ ఫ్లోర్ బటన్ నొక్కింది. వెనుక చరణ్ తలుపు దబదబా బాదుతూ 'అంజలీ! తలుపు తియ్యి!' అని అరవడం వినిపిస్తోంది.

లిఫ్ట్ ఆగగానే బయటపడి మళ్ళీ పరుగు లంకించుకుంది. రోడ్డు మీదకొచ్చినా పరుగు ఆపలేదు.

మహేష్ తన ఫ్రెండుని కలవడానికి వెళ్ళి కారులో తిరిగి వస్తున్నాడు. ఎదురుగా పరిగెడుతూ వస్తున్న స్త్రీని చూసి ఎవరో పిచ్చిది అనుకున్నాడు. కారు హెడ్ లైట్ల వెలుతురులో ఆమెని గుర్తుపట్టి కారు స్లో చేసి ఒక పక్కగా ఆపి కారు దిగాడు.

"అంజలీ!" బిగ్గరగా పిలిచాడు.

ఆమె పరిగెట్టడం ఆపింది. ఆయాసంతో వగరుస్తూ అతన్ని చూసింది. "మహేష్! ప్లీజ్! రైల్వేస్టేషన్ దాకా లిఫ్ట్ ఇవ్వవా?"

ఆ రాత్రి వేళ రోడ్డు మీద ఆమె పరిగెట్టడం, ఆమె దగ్గర పెట్రోల్ వాసన.. మహేష్‌కి ఏదో అనుమానం వచ్చింది.

"రా! కారెక్కు!" అని కారు దగ్గరకి దారి తీశాడు.

ఆమె సీట్లో ఒక పక్కకి ఒదిగి కూర్చుంది. అతను డ్రైవ్ చేస్తున్నాడు.

"ఇంత రాత్రివేళ ఎక్కడికి వెళ్తావు?"

"ఏదో ఒక ట్రెయిన్ పట్టుకుని వైజాగ్ వెళ్తాను!"

"డబ్బులున్నాయా?"

ఉలిక్కిపడింది. "లేవు!"

"నీ దగ్గర డబ్బుండి ట్రెయిన్ టికెట్టు కొనుక్కున్నా, నిన్ను రైలెక్కనివ్వరు!" నిలువెల్లా పెట్రోల్‌తో తడిసివున్నావు.

ఆమె ముఖం పాలిపోయింది.

"నిన్ను రేపు పొద్దుట ఫ్లయిట్‌లో వైజాగ్ పంపిస్తాను. ఇప్పుడు మా బాబాయ్ ఇంటికి వెళ్దాం!"

విద్యుదాఘాతం తిన్న దానిలా అదిరిపడింది. "నేను రాను! అక్కడ చరణ్ వున్నాడు. నన్ను చంపేస్తాడు!" వణికే స్వరంతో అంది.

"మీ ఇంటికెదురుగా వున్న బాబాయి కాదు! మరో బాబాయి వున్నాడు చిక్కడపల్లిలో"

"సరే!" హీనస్వరంతో అంది.

మహేష్ సెల్‌ఫోను తీసి ఏదో నెంబరు నొక్కాడు.

"పిన్నీ! నేను ఈ రాత్రికి ఇంటికి రాను. చిక్కడపల్లి వెళ్తున్నాను. రేపు మధ్యాహ్నం వస్తాను. కారు రేపటి దాకా ఇవ్వలేనందుకు బాబాయిని ఏమీ అనుకోవద్దని చెప్పు! ఓకే!" అతను ఫోన్ ఆఫ్ చేశాడు.

సన్నగా వెక్కిళ్ళు వినిపించి పక్కకి చూశాడు. అంజలి ఏడుస్తోంది. ఆమె మనసులో దుఃఖభారం దిగేదాకా ఏడవనిచ్చాడు. ఆమెని ఓదార్చే ప్రయత్నం చెయ్యలేదు. కొద్దిసేపటి తరువాత దుఃఖోపశమనం కలిగి స్థిమితపడింది.

"చరణ్ పైకి కనిపించేంత మంచివాడు కాదు మహేష్! నరరూప రాక్షసుడతను"

"నిలువెల్లా పెట్రోల్‌తో తడిసి, ఈ రాత్రి వేళ రోడ్డు మీద పరిగెడుతున్న నిన్ను చూస్తేనే అర్థమవుతోంది విషయం!" అన్నాడు, సెల్‌ఫోన్ తీసి నెంబరు

## కొత్తగాలి...

**సుడిగుండాలు**
**నదిలోనే కాదు**
**మదిలోనూ**
**ఉంటాయ్..!**

– జి. రంగబాబు,
అనకాపల్లి

నొక్కుతూ.

"పిన్నీ! నేను ఈ రాత్రి మీ ఇంట్లోనే వుందామని వస్తున్నాను! నాతోబాటు నా ఫ్రెండ్ కూడా! మా ఇద్దరికీ కొంచెం భోజనం ఏర్పాటు చూడు! ఇప్పుడు శ్రమ పడి ఏవీ వండకు! పెరుగన్నం వున్నా చాలు! ఓకే!" అతను ఫోన్ పెట్టేశాడు.

అరగంట తరువాత మహేష్‌తో బాటు లోపలికి వచ్చిన అంజలిని విస్తుపోతూ చూశారు అతని పిన్ని, బాబాయి.

"రామ్మా! ముందు తలస్నానం చెయ్యి!" అని ఆదరంగా ఆమె చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళిందావిడ.

అంజలి లోపలికి వెళ్ళగానే "ఏమిట్రా ఇది? ఏం జరిగింది?" అడిగేడు అతని బాబాయి.

"ఆమె భర్త ఆమెపై హత్యాప్రయత్నం చేశాడు!"

"ఎంత ఘోరం!?" ముక్కున వేలేసుకున్నాడాయన.

"అంజలి ఇంటర్‌లో నా క్లాస్‌మేట్! చాలా ఏళ్ళ తరువాత ఇవాళ ఈ సాయంకాలమే ఆమెని చూశాను. నిరంజనం బాబాయి ఫ్లాటుకెదురుగానే వీళ్ళ ఫ్లాటు!" క్లుప్తంగా చెప్పాడు.

"పాపం! ఇప్పుడేం చెయ్యాలని? ఈ వూళ్ళో ఆమె బంధువులెవరైనా వున్నారా?"

"ఆ విషయం తెలియదు! ఆమె ఈ పరిస్థితిలో పేరెంట్సు దగ్గరకి వెళ్ళడమే మంచిది! వైజాగ్‌లో వున్నారు వాళ్లు. రేపు ఫ్లయిట్‌లో ఆమెని అక్కడికి పంపిస్తాను" అని "ఒకసారి నీ కంప్యూటర్ కావాలి బాబాయి!" అనడిగేడు.

ఆయన తన లాప్‌టాప్‌ని ఇచ్చాడు.

మహేష్ ఆన్‌లైన్‌లో ఫ్లయిట్ టికెట్టు బుక్‌చేశాడు.

★ ★ ★

"అమృతవాళ్ళు మీ ఇంటికొస్తూ వుంటారా?" అడిగింది విరజ.

"మా అక్కల పెళ్ళిళ్ళకి మా అత్త, మామయ్యలతో బాటూ వచ్చారు. మేమూ అంజలి పెళ్ళికి వెళ్ళాం! చిన్నప్పుడు వేసవి సెలవులకి అందరం మా నాయన్నమ్మగారింట్లో కలుసుకునే వాళ్ళం! పెద్దయ్యాక చదువులతోనే సరిపోయింది. రాకపోకలు తగ్గిపోయాయి" అని క్షణం ఆగి అడిగింది. "అమృత మీతో ఎలా వుంటుంది?"

"చాలా ఫ్రెండ్లీగా వుంటుంది!"

"మీరు నన్ను కలిసిన విషయం ఆమెకి చెప్పారా?"

"చెప్పాను! పెద్దగా పట్టించుకోలేదు!" ఆమె శ్రీవల్లి ముఖంలోని భావాలని ఓర కంట పరిశీలిస్తూ అంది.

శ్రీవల్లి ముఖం చిన్నబోయింది. 'అవును! ఇప్పుడు గొప్పింటి కోడలు కదా! తనలాంటి వాళ్ళని బంధువు అని చెప్పుకోడానికే అవమానంగా ఫీలయి వుంటుంది' అనుకుంది మనసులో.

"మీకు వాళ్ళక్క విషయం చెప్పే వుంటుంది!"

"చెప్పింది!" అంది చప్పున అబద్ధమాడేస్తూ.

"పాపం! దారుణం కదా! పెళ్ళయిన ఏడాదిన్నరకే విడాకులకి సిద్ధపడడం!"

"ప్చ్" సానుభూతిగా అంది.

"ఆమె భర్త ఒట్టి అనుమానం మనిషిట! పెట్రోల్ పోసి ఆమెని సజీవదహనం

చెయ్యడానికి సిద్ధపడ్డాడట! ఎలాగో అతని నుంచి తప్పించుకుని ఇంట్లోంచి పారిపోయి వైజాగ్ చేరిందిట!"

"అవును పాపం! అమృత చాలా బాధపడుతోంది!" అంది, తెలివిగా విషయాన్ని శ్రీవల్లిచేతే చెప్పించానని సంతోషిస్తూ.

"అవును! మీకీ విషయాలన్నీ ఎవరు చెప్పారు? " అనడిగింది.

"మా నాన్నగారు ఫోన్ చేశారు!" అంది శ్రీవల్లి.

"మీరు కులాంతర వివాహం చేసుకున్నందుకు మీవాళ్ళు మిమ్మల్ని వెలివేశారన్నారు మరి!"

"మొదట్లో వున్నకోపం తరువాత వుండదు కదండీ! ఈమధ్య ఫోన్ చేసి నా యోగక్షేమాలను విచారిస్తున్నారు" నవ్వింది.

"ఎన్నిసార్లు పిలిచినా మీరు మా ఇంటికి రావడం లేదు!" అంది నిష్ఠూరంగా విరజ.

"రేపు సాయంకాలం వస్తాను!"

"అడ్రస్ చెబుతాను. మా ఇంటి దగ్గరకొచ్చాక మీకు తెలియకపోతే ఫోన్ చెయ్యండి నాకు. నేను వచ్చి తీసుకెళ్తాను" అంది విరజ.

★ ★ ★

"రండి! శ్రీవల్లిగారూ!" అంది విరజ నవ్వుముఖంతో.

ఆమె లోపలకి అడుగుపెట్టింది.

అతి సాధారణమైన నైలాన్ చీర, మెడలో పసుపుతాడు, చేతులకి మట్టి గాజులతో వున్న ఆమెని 'ఎవరన్నట్టు' చూసింది కృష్ణవేణి.

"రవి చదివే స్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్నారత్తయ్యా! పేరు శ్రీవల్లి! ఈవిడ మా అత్తగారు!" పరస్పరం పరిచయం చేసింది.

ఆమె మర్యాదగా చేతులు జోడించి నమస్కరించింది.

"కూర్చోమ్మా!" అందావిడ.

శ్రీవల్లి సోఫాలో కూర్చుంది.

"అత్తయ్యా! మీకు చెప్పడం మరచిపోయాను, టీచర్‌గారు మన అమృతకి స్వయానా మేనమామ కూతురే!"

"అవునా? !" ఆవిడ కనుబొమలు పైకి లేచాయి.

"అవునండి!" అంది శ్రీవల్లి. "అమృత ఇంట్లో లేదాండి? " అమృత కోసం చుట్టూ చూస్తూ అడిగింది.

"వైజాగ్ వెళ్ళింది. వాళ్ళమ్మగారిని చూసివస్తానని!" చెప్పింది విరజ.

"మీకు మంచినీళ్ళు కావాలా? "

"కొంచెం"

వెంటనే విరజ లోపలకి వెళ్ళి, ట్రేతో బయటకి వచ్చింది. శ్రీవల్లికెదురుగా టీపాయ్ మీద ట్రేని పెడుతూ "తీసుకోండి!" అంది.

ఒక గ్లాసులో మంచినీళ్ళు, మరో గ్లాసులో కాఫీ.. రెండూ డిస్పోజబుల్ గ్లాసులే! ఆ గ్లాసులని చూడగానే ఆమె ముఖంలో రంగులు మారాయి. మడి ఆచారం గల తన తల్లి, తమకంటే తక్కువ కులంవాళ్ళు తమ ఇంటికొస్తే ఇలాంటి గ్లాసులతోనే మంచినీళ్ళిచ్చేది. బాగా దాహంగా వుండడంతో ఆమె ఆ గ్లాసు అందుకుని నీళ్ళు తాగింది.

"మీవారేం చేస్తారు? " కృష్ణవేణి ఏదో ఒకటి అడగాలి కదా అన్నట్టు అడిగింది.

"ఆటో డ్రైవరండి!" శ్రీవల్లి ఆవిడకి ఆ మాట చెప్పడానికి సిగ్గుపడింది.

"టీచర్‌గారు లవ్‌మేరేజి చేసుకున్నారత్తయ్యా! అతను మన కులం కాదు!"

కృష్ణవేణి భ్రుకుటి ముడిపడింది. ఆ క్షణంలో ఆవిడకి తమ స్టేటస్ గుర్తుకొచ్చింది. 'ఆఫ్టాల్! ఒక ఆటోడ్రైవర్ పెళ్ళాం! తమతో సమంగా తమ సోఫాలో కూర్చోవడమా? ' అనే నిరసన భావం వ్యక్తమయింది ఆవిడ ముఖంలో!

"బోర్నవిటా తాగండి!" అంది విరజ.

"నాకు బోర్నవిటా వాసన పడదండీ!" అంది శ్రీవల్లి.

"అయ్యో! సమయానికి ఇంట్లో కాఫీ డికాషన్ లేదు. టీ పొడి అయిపోయింది. ఇవాళ్టికి తాగండి!"

"వద్దండి! నాకు ఆ వాసన ఇష్టం వుండదు!"

"అదేమిటండీ! మీ ఇంటికొచ్చినప్పుడు నేను కాఫీ తాగనంటే కూల్‌డ్రింక్ తాగేవరకు వదిలారా? ఒకపక్క మీరు చికెన్ వండుతున్నారు! ఆ వాసనకే నాకు కడుపులో తిప్పేస్తుంటే.. డ్రింక్ తాగమని మీ బలవంతం! 'కక్కలేక మింగలేక' అన్నట్టు డ్రింక్ తాగడానికి ఎంత యాతన పడ్డానో తెలుసా? " 'చికెన్' అనే మాటని ఒత్తి పలుకుతూ అంది.

కృష్ణవేణి ఆమె వైపు ఏహ్యంగా చూస్తోంది! శ్రీవల్లి నల్లబడిన ముఖాన్ని దించుకుని, చేసేదేంలేక అయిష్టంగానే గ్లాసందుకుని తాగసాగింది. తనని ఆప్యాయంగా ఇంటికి ఆహ్వానించిన విరజ ఇప్పుడెందుకిలా మాట్లాడుతోందో ఆమెకి అర్థం కాలేదు. అక్కడ గాలి లేనట్టు ఊపిరాడ్డం లేదామెకి! ఎలాగో తాగడం పూర్తిచేసి లేచి నిలబడింది.

"నేను వస్తానండీ!"

"అప్పుడప్పుడూ వస్తూ వుండండి!" విరజ స్వరంలో అదే ఆప్యాయత.

కృష్ణవేణికి కూడా నమస్కరించి శ్రీవల్లి ఆ ఇంటి గేటు దాటింది. ఆమెకి కృష్ణవేణి చూపులు గుర్తొస్తున్నాయి. ఆ చూపుల్లో గొంగళిపురుగుని చూసినంత జుగుప్స!

శ్రీవల్లి వెళ్ళగానే ఆవిడ తీక్షణంగా విరజవైపు చూసింది.

"అసలు ఆ అమ్మాయిని మన ఇంటికెందుకు పిలిచావు? "

"రవికి ట్యూషన్ చెబుతున్న టీచర్ కదా! అని" అమాయకంగా అంది.

"కాస్త స్టేటస్ చూసి మరీ పిలుస్తుండు! ఎవరిని పిలవాలో? ఎవరిని పిలవకూడదో? బొత్తిగా తెలియదు నీకు!"

"క్షమించండి అత్తయ్యా! మీకు కోపం వస్తుందనుకోలేదు!" విరజ క్షమాపణ కోరగానే ఆవిడ కరిగిపోయింది.

ఆవిడ కోపం వున్నట్టుండి అమృతపైకి తిరిగింది.

"కళ్ళుమూసుకుపోయి సంబంధం కలుపుకున్నాం! వాళ్ళకి ఆస్తిపాస్తులు లేకపోయినా, వాళ్ళు మన స్టేటస్‌తో సరితూగకపోయినా, పిల్ల అందంగా వుంది, వాడికి నచ్చిన పిల్ల.. అని కోడలిగా చేసుకున్నందుకు నా చెప్పుతో నన్నునేను కొట్టుకోవాలి! వెధవ వంశం! వెధవ సంప్రదాయం!"

అత్తగారు అమృత వంశాన్ని దుమ్మెత్తిపోస్తుంటే విరజకి పట్టరానంత సంతోషంగా వుంది. పనిలో పనిగా అమృత వాళ్ళక్క విడాకుల విషయం చెప్పింది.

"అంతే! ఇంక కృష్ణవేణి నోటికి అడ్డూ అదుపు లేకుండా పోయింది.

"పెళ్ళయి రెండేళ్ళయినా కాలేదు! అప్పుడే విడాకులా? ఆడదానికి ఎంత సహనం వుండాలి! మొగుడు తిట్టినా, ఏదో కోపంలో చెయ్యి చేసుకున్నా ఓర్పుతో అతన్ని మార్చుకోవాలి! అంతేగాని విడాకుల కోసం కోర్టుకెక్కుతుందా? ఏం చూసుకుని అంత ధైర్యం? ఆ పిల్ల మొగుడిని వదిలి పుట్టింటికొస్తే తల్లీ తండ్రీ మాత్రం ఎలా వూరుకున్నారు? "

"అంజలిపై ఆమె భర్త పెట్రోల్ పోసి సజీవదహనం చెయ్యబోయాడట! ఎలాగో తప్పించుకుని వైజాగ్ చేరిందట!"

"ఓహో! అయితే అమృత మావాళ్ళని చూసొస్తానని వైజాగ్ వెళ్ళిన కారణం ఇదన్నమాట!"

"అయి వుంటుందత్తయ్యా!"

"అంజలి భర్త పెట్రోల్ పోసి తగలబెట్టాలనుకోడం తప్పే! ఈ అమ్మాయి ఏం చేసిందో?! అయినా దరిద్రంలో నుంచి వచ్చిన ఆడపిల్లలు అంత డబ్బు చూసేప్పటికి వెర్రెక్కిపోతారమ్మాయి!"

"అవునత్తయ్యగారూ! మీరు చెప్పింది నిజమే!" అంది విరజ. అత్తగారు అమృత పుట్టింటివాళ్ళను 'దరిద్రుల'నే పద ప్రయోగం చేసి దూషించడం ఆమెకి అమితానందాన్ని కలుగజేసింది.




**చ**రణ్ తల్లికి ఫోన్ చేసి చెప్పాడు. "అంజలి ఇల్లు వదిలి వెళ్ళిపోయింది"

"ఎక్కడకి? " షాకింగ్‌గా అడిగింది సంధ్య.

"తెలియదు! అయినా ఇంకెక్కడకి వెళ్తుంది? బహుశా తన పేరెంట్సు దగ్గరకి వెళ్ళి వుంటుంది!" అంటూ జరిగినదంతా చెప్పుకొచ్చాడు.

"దరిద్రుడా! కొంపముంచేద్దువు కదురా! ఆ అమ్మాయిని పెట్రోల్ పోసి నిప్పంటించెయ్యాలని చూశావా? ఈపాటికి జైల్లో వుందువురా వెధవా!" ఎప్పుడూ కొడుకుతో ఇంగ్లీషులో మాట్లాడే సంధ్య కొడుకు చేసిన పనికి షాకయిపోయి తెలుగులో తిట్టడం మొదలుపెట్టింది.

"ఏదో ఆవేశంలో..." నాన్చాడు. "ఆ బిచ్ ముక్కుమీద గుద్ది, నన్ను ఇంట్లో వుంచి బయట గడియపెట్టి పారిపోయింది తెలుసా? "

"లేకపోతే నువ్వు ఆ అమ్మాయిని సజీవ దహనం చెయ్యాబోతుంటే 'నీ పాదదాసిని! నన్ను అంటించెయ్!' అని ఒదిగి నిలబడుతుందా? అసలు మీ మధ్య ఏం జరుగుతోంది? నీ వెధవ్వేషాలు ఆమెకి తెలిసి నిన్ను నిలదీసిందా? "

"నన్ను నిలదియ్యడానికి అదేమైనా పతివ్రతా? దానికి ఇంటర్మీడియెట్ చదివే రోజుల్లో ఒక బాయ్‌ఫ్రెండు వుండేవాడు. చదువులు పూర్తయి లైఫ్‌లో సెటిలయ్యాక మనం పెళ్ళి చేసుకుందాం అని వాడంటే ఇది 'ఓకె' అందట! నిన్న సాయంకాలం వాడు నా ఇంట్లో వున్నాడు తెలుసా? "

"ఒరేయ్! నీకిష్టం లేకపోతే అంజలి నుంచి డైవోర్సు తీసుకో! అంతేగానీ ఆమె కేరెక్టర్ గురించి మాట్లాడకు! ఆ అమ్మాయి గురించి, వాళ్ళ కుటుంబం గురించి చాలామందిని ఎంక్వయిరీ చేశాకే నీ పెళ్ళి నిశ్చయించాను" విసుగ్గా ఫోన్ పెట్టేసింది సంధ్య.

'కొడుకు నైజం తెలిసివుండీ వాడికి అనవసరంగా పెళ్ళి చేశాను!' అనుకుంది సంధ్య. తప్పు తనదే! చరణ్‌ని మంచి వ్యాపారవేత్తగా చూడాలని కలలు కందే తప్ప, మంచి కొడుకుగా, మంచి భర్తగా తీర్చిదిద్దాలనుకోలేదు! జీన్స్‌ని నమ్మితే తండ్రి పోలికలు వాడిలోనూ వున్నాయి! తను భర్త నుంచి విడిపోయాక, అతని నుంచి భరణంగా సంక్రమించిన ఆస్తితో వ్యాపారం మొదలుపెట్టి అంచలంచెలుగా పైకి ఎదిగింది. చరణ్‌ని ఆయా సంరక్షణలో వదిలిపెట్టింది. తన బిజినెస్‌ని తప్ప, వాడిని ఏనాడూ పట్టించుకోలేదు! వాడికి తప్పొప్పులు, నీతి నియమాలు, నైతిక విలువలని ఏనాడూ బోధించలేదు. డబ్బు.. తద్వారా వచ్చే పేరుప్రతిష్ఠలు! ఆ మత్తులో పడి వాడిని నిర్లక్ష్యం చేసింది. పద్ధెనిమిదేళ్ళ వయసులోనే వాడు స్త్రీసాంగత్యానికి అలవాటుపడ్డాడు. తను కళ్ళుతెరిచి వాడిని సరైన మార్గంలో పెట్టాలనుకునేప్పటికే చేయిదాటిపోయాడు! వాడిని వ్యాపారవేత్తగా తీర్చిదిద్దాక వాడి పెళ్ళి ప్రయత్నాలు మొదలుపెట్టింది. తమకంటే

అంతస్తులో తక్కువస్థాయిలో వున్న అమ్మాయి వాడి చెప్పుచేతల్లో వుంటుందని, ఏరికోరి అంజలిని వాడికిచ్చి పెళ్ళిచేసింది. కానీ చరణ్ పువ్వుల చుట్టూ తిరిగే తుమ్మె దలాంటి వాడు! పెళ్ళి అనే చట్రంలో ఇమ డలేడు! సంధ్య దీర్ఘంగా నిట్టూర్చింది.

★ ★ ★

తనని రిసీవ్ చేసుకోడానికి స్టేషన్‌కి వచ్చిన తండ్రి ముఖం మామూలుగా లేక పోవడం గమనించింది అమృత.

"మీ అత్తగారు బాగున్నారా? అల్లుడెలా వున్నాడు? " చలపతి ఎంత మామూలుగా వుందామన్నా, వుండలేకపోతున్నాడు.

ఆటో ఇల్లు చేరగానే శ్రీదేవి ఎదురొ చ్చింది. కూతురిని చూడగానే ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అమ్మ తనకోసం బెంగపె ట్టుకుందేమో అనుకుంది. ఆ వెనుకనే వచ్చిన అంజలిని చూసి నిర్ఘాంతపో యింది. కళ్ళకింద నల్లటి వలయాలతో జబ్బుపడి లేచిన దానిలా వుందామె.

"అదేమిటక్కా? అలా అయిపోయావు? " ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ ఆప్యాయంగా అడిగింది.

"ఏంలేదే! కొంచెం ఒంట్లో బాగాలేదు!" పేలవంగా నవ్వుతూ అంది.

'నిజమే కాబోలు!' అనుకుంది. కానీ తం డ్రి ముఖంలోని గాంభీర్యం, తల్లి ముఖం లోని బెంగ.. జరగరానిదేదో జరిగిందని చెబుతున్నాయి! ఆమె తరచి తరచి అడగ్గా ఏడుస్తూ జరిగిందంతా చెప్పింది తల్లి.

అమృత అక్కని కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. అంజలి ఏడవలేదు. వైరా గ్యపూరితమైన నవ్వు ఆమె పెదవులపై కదలాడింది.

"పెళ్ళితో ఆడదాని జీవితం మొదలవు తుందంటారు! కానీ, నా జీవితం అంతమ యిపోయిందే!"

"అలా మాట్లాడకు! పెళ్ళి జీవితంలో ఒక భాగమే కానీ, పెళ్ళే జీవితం కాదు. నువ్వు చదువుకున్నావు! నీ కాళ్ళ మీద నువ్వు నిలబడగలవు!" అంది, ఆమెకి ధైర్యం చెబుతూ!

కానీ, ఆమె మనసు దుఃఖసముద్రంలా వుంది! పెళ్ళంటే నూరేళ్ళపంట అంటారు. కానీ, పెళ్ళయిన కొద్దికాలానికే జీవితంలో ఆ ఘట్టం ముగిసిపోయిందనే వేదన ఆమె మనసులో సుడి తిరుగుతోంది.

★ ★ ★

"ఆడదానికి ఎంత సహనం వుండాలి! భార్యాభర్తల మధ్య తగాదాలు రావా? అంతమాత్రానికే పెట్టె సర్దుకుని పుట్టింటికి వెళ్ళిపోడానికి, కోర్టుకి ఎక్కి విడాకులు కోరుకోడానికి.. ఇదేమైనా సినిమానా? జీవితం!" అత్తగారు ఆ మాటలని ఎవరిని ఉద్దేశించి అందో తెలియకపోయినా, ఆ మాటలు అమృతని సూటిగా తాకాయి. ఆమె పాలిపోయిన ముఖాన్ని కిందకి దించుకుంది.

"విడాకులు తీసుకుని ఒంటరిగా ఎలా బతుకుదానుకుంటున్నారమ్మా ఈ ఆడపి ల్లలు! వెనకాల రికాణా వుండదు! చదివిన చదువుకి పెద్ద ఉద్యోగాలు రావు! మరి ఏమిటో ఆ ధైర్యం? గొప్పింటి సంబంధం వచ్చిందని మురిసిపోయి తాహతుకి మిం చి ఖర్చు పెట్టి పెళ్ళిచేస్తారు మధ్యతరగతి తండ్రులు. అందిన అదృష్టాన్ని నిలబెట్టుకో లేక, చిన్న గొడవలకే విడాకులకోసం తెగ బడతారు" శ్రీకాంత్ సన్నాయి నొక్కులు.

అమృతకి అన్నం గొంతు దిగడం లేదు. ఎలాగో రెండు ముద్దలు తిన్నాననిపించి ప్లేటు తీసుకుని సింక్‌లో పడేసింది.

"ఇంకో రకం ఆడపిల్లలుంటారత్తయ్యా! ఎవరిని పడితే వాళ్ళని ప్రేమించి పెళ్ళి చేసుకుంటారు. పాపం! కట్నాలిచ్చి, లక్షలు ఖర్చుపెట్టి పెళ్ళిచెయ్యడానికి వాళ్ళ అమ్మ నాన్నల దగ్గర డబ్బుండదు! వెనకా ముందూ ఆలోచించకుండా ఎవడో ఒకడు.. మగాడయితే చాలన్నట్టు ప్రేమి

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

## హృదయాన్ని కదిపిన అనుభూతులు!




నవంబరు నెల చతురలో వెలువడిన 'సీతారామాంజనేయ లాంచి సర్వీసు' నవల హృదయాన్ని మెల్లగా, సున్నితంగా తాకింది. రచయిత కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత బి.వి.ఎస్. రామారావుగారు కథను మనసుకు హత్తుకునేలా తీర్చిదిద్దారు. భాషలోను, యాసలోను విభిన్నంగా అనిపించింది. పల్లె అందాలను, గోదావరి గలగలలను, ప్రకృతి పైట కొంగులా అలరించేలా చిత్రించారు. మానవ సంబంధాలు, ప్రేమలు, ఆప్యాయతలు, కోప తాపాలు, సంఘర్షణలు - ఇలా ఒక జీవితం లోని అనుభూతులను అన్నిటినీ నవలలో చూపించారు.

ఒక నవలలో కొన్ని కుటుంబాల స్థితిగతులు, సమస్యలు, బాంధవ్యాలను వివరించడం గొప్పవిషయం. అది కూడా లాంచి ప్రయాణంలో జరగడం విశేషం. లాంచి ప్రయాణం అలవాటయిన వారికి ఈ నవల ఒక చక్కని అనుభూతి కాగా ఎప్పుడూ లాంచి ప్రయాణం చేయనివారికి ఎప్పుడెప్పుడు చేద్దామా? అనిపిస్తుందనడంలో అతిశయోక్తి లేదు.

మరో నవలిక 'మేడ్ ఇన్ హెవెన్' చాలా కొత్తగా ఉంది. జీవితం ఎటువంటి మలుపులు తిరుగుతుందో ప్రశాంత్ ద్వారా చక్కగా వివరించారు. కథను ఇలా కూడా రాయవచ్చా? అనుకునేలా ఉంది. ఈ కథను బట్టి కొత్తకథా రచయితలకు ఒక మార్గం దొరికిట్లే! బాదుషా తయారీ 'వావ్' అనిపించేలా ఉంది. 'చిట్కాలక్ష్మి' ద్వారా చాలా విషయాలు తెలుస్తున్నాయి. 'టెక్ గురూ' కొత్తవిషయాలు చెబుతోంది. 'నవలావలోకనం' లో మంథా వెంకటరమణారావు నవల 'తృష్ణ'పై విశ్లేషణ బాగా అలరించింది. ఆ నవల ఎప్పుడు చదువుదామా అన్నంత ఆసక్తికరంగా సాగింది.



– నల్లపాటి సురేంద్ర,
పెదగంట్యాడ,
విశాఖ జిల్లా

స్తారు!" వాష్‌బేసిన్ దగ్గర చెయ్యి కడుక్కుంటున్న అమృతని ఓరగా చూస్తూ అంది విరజ.

"వ్రతం చెడ్డా, ఫలితం దక్కాలని.. కులం తక్కువయినా కాస్త 'వీడు నా భర్త' అని చెప్పుకోదగినవాడిని చేసుకుంటే ఫర్వాలేదు! కారు డ్రైవరు, ఆటో డ్రైవరు.. ఎవర్నిపడితే వాళ్ళని చేసుకోడమే! రేపటి నుంచి కారు డ్రైవర్లు, ఆటోవాళ్ళు చుట్టాలమంటూ మన ఇంటికి వచ్చినా వస్తారు"

అమృతకి ఊపిరి స్తంభించినట్టయింది! అత్తగారికి, విరజకి శ్రీవల్లి గురించి తెలిసిపోయింది! కానీ ఎలా? ఎవరు చెప్పారు? తన గుండెల్లో గుట్టుగా వుంచిన ఆ విషయం ఎలా బయటపడింది?

ఆ రాత్రి ప్రభాత్‌తో అంది "మీతో ఒక విషయం చెప్పాలి!"

"చెప్పు!"

"ఇది విన్నాక మీరెలా రియాక్టవుతారోనని భయంగా వుంది!"

"నా గురించి నువ్వు తెలుసుకున్నది ఇంతేనా? " చిరుకోపంగా చూశాడు.

అమృత భయపడుతూనే అంజలి కాపురం సవ్యంగా లేదని, ఆమె ఏ పరిస్థితుల్లో పుట్టింటికి వచ్చేసిందో చెప్పింది.

"నిజమా? !" ప్రభాత్ షాకయ్యాడు.

"మా అక్క తప్పు చేసిందా? "

"ఎవరన్నారలా? "

"ఎవరూ అనలేదు! మీ అభిప్రాయాన్ని అడుగుతున్నాను"

"మీ అక్కయ్య చేసిన దాంట్లో తప్పేమీ లేదు. మనం ఆమెకి ఎలాంటి సహాయం కావాలన్నా చేద్దాం! ఈ విషయంలో. నిశ్చింతగా వుండు!" అన్నాడు ప్రభాత్.

ఇంత మంచి మనసున్న వ్యక్తి తన భర్త కావడం తన అదృష్టమని పొంగిపోయింది అమృత.

★ ★ ★

చలపతి సంధ్యకి ఫోన్ చేశాడు. "మీతో మాట్లాడాలి! ఎప్పుడు రమ్మంటారు? "

"మీ ఇష్టం!" అంది.

"రేపు బయలుదేరుతున్నానండి!"

"ఏ ట్రెయిన్‌లో వస్తారు? స్టేషన్‌కి కారు పంపిస్తాను!"

"అవసరం లేదండీ! బెంగళూర్‌లో మా కజిన్ వున్నాడు. వాడింట్లో దిగుతున్నాను! నేను ఎక్కడికి రావాలో చెప్పండి!"

ఆమె తన ఫ్లాట్ అడ్రస్ చెప్పింది.

చలపతికి సంధ్యని చూడగానే చెడామడా తిట్టాలన్నంత ఆవేశం వచ్చింది. కానీ, ఆడపిల్ల తండ్రినని గుర్తుకొచ్చింది.

ఆవిడ ముందు చేతులు జోడించి నిలబడి ఒకే ఒక మాట అన్నాడు. "మా అమ్మాయికి మీ అబ్బాయి నుంచి విడాకులిప్పించండి!"

సంధ్య చరణ్‌ని వెనకేసుకుని రాలేదు. "నేను లాయర్‌తో మాట్లాడాను. మ్యూచువల్ కన్‌సెంట్ కింద అయితే విడాకులు తొందరగా వస్తాయని చెప్పారు"

"కృతజ్ఞుడిని! మరోమాట! మీ అబ్బాయి నుంచి అంజలి భరణాన్ని కోరుకోడం లేదు. కేవలం విముక్తిని మాత్రమే కోరుకుంటోంది! విడాకులు ఎంత త్వరగా లభిస్తే అంత మంచిది!"

"మీరు నిశ్చింతగా వుండండి!" అందామె.

★ ★ ★

బలరామశాస్త్రి నిస్తేజంగా కూర్చుని వున్నాడు. సైకియాట్రిస్ట్ ట్రీట్‌మెంట్ మొదలుపెట్టాక జయ ఆ మందుల ప్రభావం వల్లనో? ఏమో? రోజులో చాలాభాగం నిద్రపోతూనే వుంటోంది! ఆమెకి పూర్తిగా మానసిక స్వస్థత చేకూరే వరకూ పెళ్లిమాట తలపెట్టవద్దని హెచ్చరించాడు డాక్టర్.

"జయకి పూర్తిగా బాగయ్యేసరికి ఎన్నాళ్లు పడుతుందో? ! ఆమె మామూలు మనిషి అయినా సూర్యాన్ని మరచిపోయి పెళ్లి చేసుకుంటుందా? "

అ
క్ష
రం

పనిలేకుండా ఉన్న
ఇనుము తుప్పు పట్టినట్టే
చురుగ్గా లేని మెదడు
ఎందుకూ పనికిరాకుండా పోతుంది



– రూసో

ఇంతలో ఫోన్ మోగింది. ఆయన లేచి ఫోన్ చేతిలోకి తీసుకున్నాడు. చెన్నైలో ఉంటున్న బలరామశాస్త్రి తమ్ముడు. "అన్నయ్యా! లక్ష్మి పెళ్లి కుదిరింది. వచ్చే నెల పదహారో తారీఖు పెళ్లి! నువ్వు, వదిన, పిల్లలు తప్పకుండా రావాలి!"

"చాలా సంతోషం రా! ఎవరబ్బాయి? ఏం చేస్తున్నాడు?"

"ఏం చెప్పమంటావులే! లక్ష్మి దాని పెళ్లి అదే కుదుర్చుకుంది. లవ్ మ్యారేజ్! అతను మన కులం కాదు. ఇంజినీరింగ్‌లో ఇద్దరూ క్లాస్‌మేట్స్. నీ పెళ్లి నువ్వే చేసుకో! నాకేం సంబంధం లేదు అన్నాను. నేను పీటల మీద కూర్చుని కన్యాదానం చేస్తేనే పెళ్లి చేసుకుంటానని పట్టుపట్టింది. రాజీపడక తప్పలేదన్నయ్యా! మన పిల్లల్ని మనమే వీధిన పడేసుకుంటామా?"

"నిజమేలే!" ఏదో ఆలోచిస్తూ అన్నాడాయన. ఆయన ఫోన్ పెట్టేసి అప్పుడే అక్కడకొచ్చిన భార్యకి విషయం చెప్పాడు.

"రామ! రామ! మన కులం కాని వాడికి కాళ్లు కడిగి కన్యాదానం చేస్తున్నాడా మీ తమ్ముడు?" బుగ్గలు నొక్కుకుందామె.

"పిల్లలకి ఏది మంచో? ఏది చెడో? చెబుతాం! విన్నవాళ్లు వింటారు! లేకపోతే వాళ్ల ఇష్టానికి తల్లిదండ్రులని తలవంచేలా చేస్తున్నారు. ఎవరూ కన్నపిల్లలని కాదనుకోడం లేదు. మా తమ్ముడి కూతురి విషయంలో జరిగిందదే! అయినా మారుతున్న కాలంతోబాటు మనమూ మారక తప్పదు!"

"అంటే? ఆ పిల్ల కులం కానివాడిని పెళ్లి చేసుకుంటానంటే మీ తమ్ముడు కన్యాదానానికి సిద్ధపడ్డాడా? కాళ్లు విరగ్గొట్టక!"

"అవును! మాట వినకపోతే కాళ్లు విరగ్గొట్టాలి! కాలు జారితే కడుపు తీయించి ఇంకొకడికిచ్చి పెళ్లిచెయ్యాలి! నిజం బయట పడి దాని మొగుడు వదిలేస్తే.. లోకులు కాకుల్లా పొడుస్తుంటే ఇంటిల్లిపాదీ ఆత్మహత్య చేసుకోవాలి! ఇంక నీ ధోరణిలో మార్పు రాదా? ఆడవాళ్లకి శీలం, పవిత్రత విషయంలో కచ్చితమైన అభిప్రాయాలుంటాయి! నువ్వు ఆడదానివేగా! నీకా విషయం బాగా తెలిసి ఉండాలే! ఒక అబ్బాయిని ప్రేమించి అతనితో అనుభవాన్ని పంచుకున్న పిల్ల మరొక వ్యక్తిని ఎలా పెళ్లి చేసుకోగలదనుకున్నావు? పెళ్లి చేసుకున్నవాడిని మోసం చేస్తున్నాననే గిల్టీ కాన్షస్‌తో ఆనందంగా బతకగలదా? నువ్వు జయ విషయంలో పొరబాటు చేశావని నీకనిపించడం లేదా? నువ్వు గుట్టుగా దాచావనుకున్న విషయం ఈ ఊళ్లో ఎంతమందికి తెలిసిందో తెలుసా? కొందరి హేళన, ఇంకొందరి సానుభూతి.. అలా వీధిలోకి వెళ్లు! 'మీ అమ్మాయికి పిచ్చెక్కిందట! పిచ్చిలో నూతిలోపడిందా? నూతిలో దూకాకే పిచ్చిపట్టిందా?' అని అడిగేవాళ్లే అందరూ! జయకి పిచ్చి నయమవుతుందా? నయమయ్యాక పెళ్లి చేసుకోడానికి అంగీకరిస్తుందా? అది చేసుకోవాలనుకున్నా దాన్నెవరు పెళ్లిచేసుకుంటారు?" ఆయన చేతులలో ముఖం దాచుకుని పసివాడిలా ఏడుస్తున్నాడు.

భర్త మాట్లాడుతున్న ఒక్కొక్క మాట శకుంతలని నిలదీస్తున్నాయి. ప్రశ్నార్థ

కంగా నిలిచిన కూతురి భవిష్యత్తు తొలి సారిగా ఆమెని భయపెట్టింది. ఎంత సేపూ పరువుకోసం పాకులాడిందే తప్ప ఆమె జీవితం ఏమవుతుందని ఎందుకు ఆలోచించలేకపోయింది?

'దయ ఉంచి ఈ జన్మలో నా పెళ్లి మాట తలపెట్టవద్దమ్మా! ఈ జన్మకి సూర్యం జ్ఞాపకాలు చాలు నాకు' అని జయ దీనంగా వేడుకోవడం గుర్తొస్తోంది.

ఎంత తెలివితక్కువ పనిచేసింది! ఒక రిని ప్రేమించిన పిల్లని మరొకరికిచ్చి బల వంతంగా పెళ్లిచెయ్యాలని ప్రయత్నిం చింది! కూతురి మనసుని శాసించాలని చూసింది. భర్త చెప్పినట్టు లోకంలో ఎన్ని కులాంతర, మతాంతర వివాహాలు జర గడం లేదు? ఆ మధ్య సాంబశివంగార మ్మాయి కులాంతర వివాహం చేసుకుంటే ఏం చేశారు? కొన్నాళ్లు ఆగ్రహంతో చిందులు తొక్కినా తరువాత క్రమేణా కూతురింటికి రాకపోకలు మొదలుపె ట్టారు. పరమేశ్వరం గారబ్బాయి ముస్లిమ్ అమ్మాయిని పెళ్లి చేసుకున్నా రాజీపడి సర్దుకుపోయారుగా!

"జయ బతుకుని నాశనం చేసింది నేనే నండీ!" బావురుమంది ఆవిడ. పశ్చాత్తా పంతో కుమిలికుమిలి ఏడుస్తున్న భార్యను రుద్ధస్వరంతో ఓదార్చాడు బలరామశాస్త్రి.

★ ★ ★

"శ్రీవల్లీ! బాగున్నావా? " అమృత పలక రింపుతో తల తిప్పింది ఆ యువతి. అమృతని చూడగానే ఆమె ముఖంలో రంగులు మారాయి.

"ఆс! నువ్వెలా ఉన్నావు? " ముభా వంగా అడిగింది.

"బాగున్నాను! మా అమ్మ చెప్పింది, నువ్విక్కడే ఉన్నావని!"

"అవునా? " తను ఈ ఊళ్లోనే ఉన్నట్లు తెలిసినా అమృత తనని కలుసుకునే ప్రయత్నం చెయ్యలేదని, కారణం తను ఆమె కంటే ఎంతో తక్కువ స్థితిలో ఉన్నందున ఆమెకి చిన్నచూపని శ్రీవల్లి భావిస్తోంది. "నేనిక్కడే కాన్వెంటులో టీచ ర్‌గా పనిచేస్తున్నాను. మీ బావగారబ్బాయి రవి మా స్కూల్లోనే చదువుతున్నాడు"

"నిజమా? "

"అవును! మీ తోటికోడలు చెప్పలేదా? ఆమె రవిని కొన్నాళ్లు నా దగ్గరకి ట్యూష న్‌కి పంపింది కూడా!"

"ఏ సబ్జెక్టుకి ట్యూషన్? "

"తెలుగు! నేను తెలుగు టీచర్‌ని!"

"తెలుగుకి ట్యూషనేమిటి? అదీ యు. కె.జి. చదువుకి? " ఆశ్చర్యంగా అడిగింది.

"వాడికి తెలుగు సరిగ్గా రాదట!"

అమృత ఆలోచిస్తోంది. 'శ్రీవల్లికి తనతో ఉన్న బంధుత్వం తెలిసే ఆమె దగ్గరకి ట్యూషన్‌కి పంపిందా విరజ? '

"అసలు ఈ విషయం చెప్పు! నీకు మా తోటికోడలితో ఎలా పరిచయం? మన బంధుత్వం ఆమెకి తెలుసా? "

"తెలుసు! నేనే చెప్పాను! ఒకసారి పేరెంట్ టీచర్ మీటింగ్‌కి మా స్కూలుకి వచ్చింది. అయినా ఈ విషయాలన్నీ ఆమె నీకు చెప్పలేదా? మీరిద్దరూ చాలా ఫ్రెండ్లీగా ఉంటారట కదా? "

అమృత ముఖం పాలిపోయింది. తన తో ఆమెకి ఉన్న బంధుత్వాన్ని శ్రీవల్లి విర జకి చెప్పగానే ఆమెతో పరిచయం పెంచు కుని, తన పుట్టింటి సంగతులని రాబట్టిం దన్నమాట! ఆమెకి అత్తగారి పుల్లవిరుపు మాటలు, విరజ ఎకసెక్కంగా మాట్లాడ్డం గుర్తుకొస్తోంది.

"నువ్వు వైజాగ్ వెళ్లినప్పుడు ఆమె ఆహ్వానంపై మీ ఇంటికి వచ్చాను" అంటూ విరజ తనని ఎలా అవమానించిందీ చెప్పింది శ్రీవల్లి. ఆమెకి అమృత ముఖం చూస్తే విరజతో ఆమెకి చెప్పుకోదగినంత సత్సంబంధాలు లేవని అర్థమైంది.

"విరజ ఒక పథకం ప్రకారమే ఇదంతా

చేసింది" అంది అమృత.

"అవును!" అంది శ్రీవల్లి. "ఆమె నాతో ఎంత బాగా మాట్లాడేదంటే అది నటన అని అనుకోవు!"

"అవును!" అంది అమృత. "మా అక్క కాపురంలో కలహాలు వచ్చాయని, ఆమె మా బావ నుంచి విడాకులు తీసుకోబోతోం దని నువ్వే చెప్పావా? "

"అవును! నాతో చెప్పించింది విరజ చాలా తెలివిగా!"

ఈ విషయాలన్నీ తెలుసుకుని అత్తగారి ముందు తనని లోకువ చేస్తే విరజకి వచ్చే లాభమేమిటో అర్థం కాలేదు అమృతకి.

"ఐ యామ్ సారీ! ఆమె ఇలా చేస్తుంద నుకోలేదు" అంది.

"ఫర్వాలేదు లేవే! నన్ను అవమానించ మని నువ్వు ఆమెకి చెప్పలేదుగా? ఇంకా రవికి ట్యూషన్ చెబుతున్నావా? "

"లేదు! నేను మీ ఇంటికి వచ్చి వెళ్లిన తరువాత రవి ట్యూషన్‌కి రాలేదు. వాడు ట్యూషన్‌కి ఎందుకు రావడం లేదని నేను అడగలేదు. ఆమె మర్యాదకి ఒక ఫోన్ కాల్ కూడా చెయ్యలేదు"

అమృత శరీరంలోని రక్తమంతా నీళ్లుగా మారిపోతున్న అనుభూతి కలుగుతోంది! తనని అత్తగారి ముందు చులకన చెయ్యడమే విరజ ధ్యేయం! కానీ, ఎందుకు? అనే ప్రశ్నకి మాత్రం ఎంత ఆలోచించినా ఆమెకి జవాబు దొరకడం లేదు.

ఇంటికెలా వచ్చిందో తెలియదు. హాలులో కూర్చుని విరజ, అత్తగారు ఏదో మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు! వాళ్లు అంజలి గురించో? శ్రీవల్లి గురించో? మాట్లాడుకుంటున్నారని అనుమానం! తలవంచుకుని తన గదిలోకొచ్చింది. ఆమెకి కన్నీళ్లు పొంగివస్తున్నాయి.

"చీకట్లో పడుకున్నావేమిటి? " ప్రభాత్ స్వరం వినిపించింది. అతను లైటు స్విచ్ ఆన్‌చేశాడు.

అతను తన కన్నీళ్ళని చూడకూడదని అమృత తలగడలో ముఖం దాచుకుంది.

ప్రభాత్ వచ్చి ఆమె పక్కలో కూర్చున్నాడు. "ఒంట్లో బాగాలేదా? ఈ టైంలో పడుకున్నావేమిటి? " ఆమె నుదురు తాకి చూస్తూ అడిగాడు.

ఆమె దుఃఖం మరింత ఉధృతమయింది. ఆమె వెక్కిళ్ళు విని ఆమె ఏడుస్తోందని గ్రహించిన అతను ఆదుర్దాగా ఆమెని తనవైపు తిప్పుకున్నాడు.

"ఏమైంది అమృతా? మీ అక్కయ్య కోసం బెంగపెట్టుకున్నావా? వైజాగ్ వెళ్తావా? "

కాదన్నట్టు తల వూపింది.

"మరి ఏం జరిగిందో చెప్పు! చెప్పందే నాకెలా తెలుస్తుంది? "

ఆమె బలవంతాన ఏడుపు ఆపుకుంటూ అంది. "నేను చెప్పేది విన్నాక నన్ను అసహ్యించుకుంటారు! ఇలాంటి వంశంలోని అమ్మాయినా నేను పెళ్ళి చేసుకుందని"

"కాస్త అర్థమయ్యేలా చెప్పు!"

అమృత సిగ్గుతో చితికిపోతూ శ్రీవల్లి గురించి చెప్పింది.

అంతా విని తేలిగ్గా అన్నాడు. "అందు కోసం కళ్ళు వాచిపోయేలా ఏడవాలా? "

"అందుకు కాదు!" అంటూ.. విరజ శ్రీవల్లిని పరిచయం చేసుకుని ఆమెని ఇంటికి ఆహ్వానించి ఎలా అవమానించిందో చెప్పింది. "నన్ను మీ అమ్మగారి దృష్టిలో లోకువ చేస్తే ఆమెకేమిటి లాభం? "

"మా వదిన తను ఆగర్భశ్రీమంతురాలి నని గొప్పలు చెబుతూంటుంది! ఆమె నువ్వు బాల్యస్నేహితులని, మీ ఇంటి పక్కన పెంకుటింట్లో వుండేదని చెప్పావుగా! ఆ విషయాన్ని అవమానంగా ఫీలయి వుంటుంది! అందుకిది ప్రతీకారం!"

"పెంకుటింట్లో వుండేదని ఆమెని అవమానించడానికి అనలేదండీ!"

"ఇంక ఈ విషయాన్ని ఇంతటితో వది

లెయ్యి! మా అమ్మ, వదిన ఏమన్నా పట్టించుకోకు! డబ్బుతో గౌరవం వస్తుందని వాళ్ళ అభిప్రాయం. అదే మీ శ్రీవల్లి ఇంకా తక్కువ కులానికి చెందిన ఏ ఐ.ఎ.ఎస్ ఆఫీసర్నో చేసుకునుంటే వీళ్ళే ఆమెని ఇంటికి పిలిచి రాచమర్యాదలు చేసివుండేవారు! నువ్వు ఏమీ జరగనట్టు మామూలుగా ఉండు! సరేనా!" అన్నాడు ఆమెని అనునయిస్తూ.

అమృత అతని సహృదయతకి, సంస్కారానికి ముగ్ధురాలయింది.




రోడ్డు మీద పరధ్యానంగా నడుస్తున్న బలరామశాస్త్రి ఓ బైక్‌కి అడ్డుపడ్డాడు. బైక్ నడుపుతున్న వ్యక్తి సడన్‌బ్రేక్ వేసి బండి ఆపాడు.

"జాగ్రత్తండీ! నేను స్లోగా వస్తున్నాను కాబట్టి సరిపోయింది! లేకపోతే ఎంత ప్రమాదం జరిగివుండేది!" అన్నాడు మందలిస్తున్న ధోరణిలో!

ఆయన సిగ్గుపడుతూ క్షమాపణ కోరాడు. "నన్ను మన్నించు బాబూ! ఏదో ఆలోచిస్తూ, పరధ్యాసలో చూసుకోలేదు!" అని ఆ యువకుడి ముఖాన్ని చూసిన ఆయన నిటారుగా అయ్యాడు.

"సూర్యం! నువ్వు.. నువ్వేనా? !"

"ఓ! మీరా! అతని ముఖంలో ఆయన్ని గుర్తుపట్టిన భావం కదలాడింది.

ఆయన తను చూస్తున్నది కలా? నిజమా? అని నమ్మశక్యం కానట్టు అతన్నే చూస్తున్నాడు.

"అవునండీ! సూర్యాన్నే!" పేలవంగా నవ్వేడతను.

"నువ్వు ఆత్మహత్య చేసుకున్నావని!? " ఎలా పూర్తిచెయ్యాలో తెలియక ఆగిపోయాడు ఆయన.

"జయకి మీరు పెళ్ళి నిర్ణయించారని ఆ బాధలో ఆత్మహత్య చేసుకోవాలనే అనుకున్నాను. నేను ఆత్మహత్య చేసుకుంటున్నానని నా కొలీగ్‌కి, ఫ్రెండ్సుకి మెసేజ్ పంపించాను. ఒక క్షణం ఆలోచించమని నా మనసు హెచ్చరించింది. జయ నన్ను మరచిపోయి మీరు నిర్ణయించిన పెళ్ళి చేసుకుంటోందో? లేక తప్పనిసరి పరిస్థితులలో పెళ్ళికి తలవంచిందో? నాకు తెలియదు. కానీ నాకొక్కసారి కనిపించి 'సూర్యం! నన్ను మరచిపో! నేను వేరే అబ్బాయిని పెళ్ళి చేసుకుంటున్నాను!' అని చెప్పొచ్చుగా! ఆమె నన్ను మరచిపోయిందో? లేక నాకు ఎదురుపడే ధైర్యం లేదో? జయ నన్ను మరచిపోయినంత మాత్రాన నేనెందుకు చావాలి? ఆమె నన్ను మరచిపోయినా నేను ఆమెని మరచిపోలేను! ఆమె జ్ఞాపకాలు ఈ జన్మకి చాలు! అందుకే ఆత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకున్నాను. జయని పెళ్ళి చేసుకుని హానీమూన్‌కి వెళ్ళడానికి నెలరోజులు సెలవు అంతకుముందే పెట్టాను. ఆ సెలవులో వృద్ధాశ్రమంలోని వృద్ధులకి సేవచేశాను. అనాథాశ్రమంలో పిల్లలకి చదువు చెప్పాను. సెలవు అయిపోయాక మళ్ళీ ఉద్యోగంలో చేరాను. నెలరోజుల పాటు నేను ఎవరికీ కనిపించకుండా పోవడంతో మీరే కాదు అందరూ నేను చనిపోయాననే అనుకున్నారు!" క్షణం ఆగి అడిగేడు "జయ ఎలావుంది? "

"నీ కోసం.. నీ కోసం పిచ్చిదయిపోయింది బాబూ! నువ్వు ఆత్మహత్య చేసుకు

న్నావని తెలిసి నూతిలో దూకింది. సమయానికి దగ్గరుండబట్టి బయటికి తీశాం. ప్రాణాలతో మిగిలింది" అన్నాడాయన కన్నీళ్ళు పెట్టుకుంటూ!

సూర్యం స్తంభీభూతుడయ్యాడు.

★ ★ ★

బలరామశాస్త్రి ముఖంలో అంత సంతోషాన్ని ఈ మధ్య కాలంలో చూడలేదు శకుంతల.

"సూర్యం బతికేవున్నాడు శకుంతలా! ఆత్మహత్య చేసుకోలేదు!" అంటూ యాదృచ్ఛికంగా అతన్ని కలిసిన విషయం చెప్పాడు.

సత్య ఆనందాతిరేకంతో చిన్నగా అరిచింది. "నిజమా! నాన్నా!" అంది.

"అవునమ్మా! సూర్యం మన కారణంగా ఆత్మహత్య చేసుకున్నాడని ఆ పాపం మనదని నాలో నేను కుమిలిపోతున్నాను! ఇవాళ అతన్ని చూశాక ఎంత రిలీఫ్‌గా వుందో తెలుసా? "

అక్కడే కూర్చున్న శకుంతల భర్త చెప్పింది మౌనంగా వింది. ఎలాంటి వ్యాఖ్యానం చెయ్యలేదు. తరువాత సత్య ఒంటరిగా వున్నప్పుడు అడిగింది. "సూర్యం ఏ బ్యాంకులో పనిచేస్తాడో తెలుసా? "

"తెలియదు! ఏం? " అనుమానంగా ఆవిడని చూస్తూ అడిగింది.

"తెలుసుకో! నేనతన్ని కలుసుకోవాలి!"

"ఏం? అతని కారణంగానే అక్క పిచ్చిదయిందని శాపనార్థాలు పెట్టడానికా? "

"చచ్చిన పాముని ఇంకా చంపకు సత్యా!"

ఆవిడ ఏడ్చేసింది. సత్య ఆవిడ కన్నీళ్ళలో పశ్చాత్తాపాన్ని చూసింది.

★ ★ ★

"సూర్యం ఆత్మహత్య చేసుకోలేదు. బతికే వున్నాడు తెలుసా? ఉత్కళా!"

సత్య చెప్పిన వార్తవిని ఉత్కళ ఏమాత్రమూ సంతోషాన్ని వ్యక్తం చెయ్యలేదు.

"అలాగా!" అని వూరుకుంది.

"అయినా పార్థు నీకీ విషయాన్ని చెప్పే వుంటాడు! సూర్యం పార్థువాళ్ళ ఇంటి పక్కనేగా అద్దెకి వుండేది!"

పార్థు పేరెత్తగానే ఉత్కళ ముఖంలో నీలినీడలు వ్యాపించాయి. సమాధానం చెప్పలేదు.

'ఏమయింది దీనికి? ' అనుకుంది సత్య.

కాలేజీ కేంపస్‌లో ఒంటరిగా కూర్చున్న ఉత్కళ మనసు కల్లోలిత సాగరంలా వుంది. ఆమెకి పార్థు గుర్తుకొస్తే గుండెలో మంటపెట్టినట్టవుతోంది. 'ఐ లవ్ యు' అన్నాడు. నువ్వు లేకపోతే చచ్చిపోతానన్నాడు. ఇద్దరూ బైక్ మీద షికార్లు చేశారు. తన బర్త్‌డే అని వాళ్ళ గెస్ట్‌హౌస్‌కి తీసుకెళ్ళాడు. ముద్దుపెట్టుకున్నాడు. తొలిముద్దుతో పరవశించిపోయాడు. మరి కాస్త చొరవ తీసుకున్నాడు. తనని తాను నియంత్రించుకోలేక పోయింది. తొలి అనుభవం తాలూకు మత్తునుంచి తేరుకుని "పెళ్ళి చేసుకుందాం పార్థూ!" అంది.

"చేసుకుందాం! కానీ ఇప్పుడే పెళ్ళి చేసుకోవద్దు! మనది పెళ్ళి చేసుకునే వయసు కాదు" అన్నాడు.

'సెక్స్‌కి అభ్యంతరం లేని వయసు పెళ్ళికెందుకు? ' అని తను అడగలేదు.

"మన చదువులు పూర్తయి ఉద్యోగం వచ్చాక అప్పుడు పెళ్ళి" అన్నాడు.

'మరోసారి.. ఇంకోసారి.. ఇదే ఆఖరుసారి అతన్ని కలవడం' అనుకుంటూనే అతనికి శారీరకంగా దగ్గరవుతూనే వుంది.

వారం రోజుల నుండి పార్థు నుంచి ఫోన్ కాల్స్‌లేవు. ఎస్.ఎమ్.ఎస్.లు లేవు. తను ఫోన్ చేస్తే కట్ చేస్తున్నాడు. కనిపిస్తే చిరునవ్వు నవ్వుతున్నాడు. తనకెందుకు ఫోన్ చెయ్యడం లేదో అర్థంకావడం లేదు. తనపై ప్రేమ తగ్గిపోయిందా? అనే అనుమానం! 'తప్పు చేశానేమో? ' అనిపిస్తోంది. పార్థు ఆకర్షణలో పడి, దానికి 'ప్రేమ' అని పేరు పెట్టుకుని, అతనికి శారీ

రకంగా దగ్గరయి, ఇప్పుడు అతను దూర మైపోతున్నాడని భయపడుతోంది. 'తనని పెళ్ళి చేసుకునేంత బలమైన ప్రేమ అతనికి వుందా?' అని ఆలోచిస్తే 'లేదేమో?' అనిపిస్తోంది. ఆ ఊహే వణికిస్తోంది. 'ఇంకా ఆలస్యం చేస్తే లాభంలేదు! పార్థుని ఇవాళ కలుసుకుని అటోఇటో తేల్చుకోవాలి. తమ పెళ్ళి వెంటనే జరిగాలని వత్తిడి తేవాలి!' దృఢంగా నిశ్చయించుకుంది.

'ఒకసారి మీ గెస్ట్‌హౌస్‌లో కలుసుకోవాలి! చాలా ముఖ్యమైన విషయం నీతో మాట్లాడాలి!' అని ఉత్కళ పంపిన మెసేజ్‌ని చూసి పార్థు 'తప్పకుండా కలుద్దాం!' అని తిరిగి మెసేజ్ పెట్టాడు.

క్లాసులయ్యాక ఉత్కళ బ్యాగ్ తీసుకుని లేడీస్ వెయిటింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. సత్యకి బాత్‌రూమ్ అవసరం వచ్చి తను కూడా వెయిటింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. బాత్‌రూమ్‌లో నుంచి బురఖా ధరించి వున్న ముస్లిమ్ అమ్మాయి బయటికి రావడం గమనించింది. సత్య భ్రుకుటి ముడిపడింది. 'తమ కాలేజీలో ముస్లిం అమ్మాయిలు చదువుతున్నారు. కానీ వాళ్ళు బురఖా ధరించరు. మరి ఎవరీ అమ్మాయి?' అని ఆలోచిస్తుండగానే ఆమె సత్యని దాటి బయటికి వెళ్ళిపోయింది.

గెస్ట్‌హౌస్ గేటు లోపల పార్థు బైక్ కనిపించి ఉత్కళ ధైర్యంగా లోపలికెళ్ళింది.

"హాయ్!" అన్నాడు పార్థు.

"హాయ్!" అంది.

బురఖా తీసేసి అతని పక్కనే సోఫాలో కూర్చుంది.

"నాతో ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలన్నావు" సూటిగా అడిగేడు పార్థు.

"మన పెళ్ళి విషయం"

"చదువు పూర్తయి, ఉద్యోగం రాందే, పెళ్ళిమాట ఎత్తితే ఎవరైనా నవ్విపోతారు!"

"మన చదువు పూర్తవడానికి ఇంకా ఏడాది టైముంది. తరువాత పి.జి. అయ్యాక ఉద్యోగం. అంటే కనీసం నాలుగేళ్ళు పడుతుంది! అప్పటివరకు నన్ను పెళ్ళి చేసుకోవా? నాలుగేళ్ళ తర్వాత నన్నే పెళ్ళి చేసుకుంటావనే నమ్మకం ఏమిటి?"

"నువ్వు నన్ను నమ్మాలి!"

"నీపై నమ్మకం పోయింది. ఇదివరకటిలా నీ నుంచి ఫోన్‌కాల్స్, ఎస్.ఎమ్.ఎస్.లు లేవు. నేను నీ సెల్‌కి ఫోన్ చేస్తే కట్ చేస్తున్నావు. ఎందుకని? నువ్వు నన్ను తప్పించుకుని తిరుగుతున్నావు"

"అదా! మా అమ్మ, నాన్న దగ్గరుండగా ఫోన్ చేస్తున్నావు. నీతో ఫోన్‌లో ఎలా మాట్లాడను?"

"ఏం? తప్పేంవుంది? నన్ను ప్రేమిస్తున్నానని చెప్పు! నన్ను మీ ఇంటికి తీసుకెళ్ళి మీవాళ్ళకి పరిచయం చెయ్యి!"

"ఫూలిష్‌గా మాట్లాడకు! నాలుగేళ్ళ తర్వాత ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని నిన్ను ఇప్పుడే పరిచయం చెయ్యమంటావా? నాపై నమ్మకం వుంటే నాలుగేళ్ళు ఓపికపట్టు! అయినా నాపై నమ్మకం లేనిదానివి నా బెడ్ మీదకి ఎలా వచ్చావు?"

ఉత్కళ ముఖం సిగ్గుతో.. అవమానంతో ఎర్రబడింది.

"అవును! నమ్మాను! ఇక మీదట నిన్ను నమ్మను! ఈ నెలలోనే మన పెళ్ళి జరిగిపోవాలి! నువ్వు ఒప్పుకోకపోతే నిన్ను నడి

## కొత్తగాలి... 

**భోగం**
**మనుషులను విడగొడుతుంది**
**త్యాగం**
**మనసులను కరిగిస్తుంది**

– బి.ఎ.ఎస్. ప్రసాద్,
చాగల్లు, ప.గో. జిల్లా

బజారుకి ఈడుస్తాను. నీ ఇంటిముందు టెంట్ వేసుకు కూర్చుని, పెళ్ళి చేసుకునే దాకా ఆమరణ నిరాహారదీక్ష చేస్తాను"

"నువ్వు మరోసారి పెళ్ళి చేసుకోమని గొడవచేస్తే ఏం చేస్తానో తెలుసా?" అంటూ తన సెల్‌ఫోన్ ఆన్‌చేసి ఆమె కళ్ళ ముందుంచాడతను. అందులోని ఫొటోలని చూడగానే ఆమె కాళ్ళకింద భూమి కంపించింది. ఆ ఫొటోలు తనవే! బెడ్ మీద నగ్నంగా పడుకుని వుంది తను. తన ముఖం, రహస్యావయవాలు అన్నీ క్లోజ్‌షాట్స్ తీశారెవరో?

"ఎవరు..! ఎవరు తీశారివి?" ఆమె స్వరం కీచుమంది.

"నేనే తీశాను! నీ కుడి తొడమీద పుట్టుమచ్చ నచ్చి తీశాను. నీ ఎడమ వక్షం మీద పెసరబద్దంత పుట్టుమచ్చ చూడు ఎంత బాగా పడిందో! నాలో ఇంత మంచి ఫొటోగ్రాఫర్ వున్నాడని నాకే తెలియదు. నువ్వు మరోసారి పెళ్ళి మాటెత్తితే ఈ ఫొటోలని నీ ఫ్రెండ్సుకి, నా ఫ్రెండ్సుకి అంతెందుకు, కాలేజీలో అందరి సెల్‌ఫోన్లకు ఫార్వార్డ్ చేస్తాను" వికటంగా నవ్వుతున్న పార్థు కాటెయ్యడానికి సిద్ధంగా వున్న కాలనాగులా కనిపించాడు.

"స్కౌండ్రల్! నీ అంతు చూస్తాను! నన్ను ప్రేమించానని నమ్మించిన నిన్ను వూరికే వదిలిపెట్టను! ఇప్పుడే మీ నాన్న దగ్గరకి వెళ్తాను. మీ నాన్న ఎమ్.ఎల్.ఎ. అనుచరుడు కదా! ఆ ఎమ్.ఎల్.ఎ. దగ్గరకి వెళ్ళి నీపై పోలీస్ కంప్లయింట్ పెట్టమంటాడో? నన్ను నీకిచ్చి పెళ్ళి చేస్తాడో? అడుగుతాను" ఉత్కళ బెదిరింపుగా అంది.

ఆమె బెదిరింపుకి భయపడినట్టు ముఖం పెట్టాడు. "వద్దు! ఆ పని మాత్రం చెయ్యకు ప్లీజ్! మన విషయం ఈ రాత్రికే మా నాన్నతో మాట్లాడతాను" అన్నాడు.

"మీ నాన్నని మన పెళ్ళికి ఒప్పిస్తావో? లేక మీ ఇంట్లోంచి వచ్చి నన్ను పెళ్ళి చేసుకుంటావో? నాకు తెలియదు. రేపు ఇదే టైముకి మా ఇంటికి నువ్వు రావాలి! అర్థమైందా?" ఉత్కళ తర్జని చూపించి, బెదిరింపుగా అని ధీమాగా బయటికినడిచింది.

ఆమె వెళ్ళేదాకా ఆగిన పార్థు ముఖంలో క్రూరమైన చిరునవ్వు మెరిసింది. అతను తన సెల్‌ఫోను చేతిలోకి తీసుకున్నాడు.

★ ★ ★

"మీకోసం ఎవరో వచ్చారు" అని అటెండరు చెప్పడంతో సూర్యం బయటికి వచ్చాడు. అక్కడ కుర్చీలో కూర్చున్న స్త్రీని చూసి నిటారుగా అయ్యాడు. ఆ స్త్రీ శకుంతల! పక్కనే పందొమ్మిదేళ్ల అమ్మాయి.

"మీరా?!" అన్నాడు. ఆవిడ రాకపట్ల ఏ మాత్రం ఆశ్చర్యాన్ని వ్యక్తపరచకుండా.

"ఏం కావాలండీ? ఇది లంచ్ అవర్! అరగంట తర్వాత బ్యాంకులో వర్క్ స్టార్టవుతుంది. అంతవరకు మీరు వెయిట్ చెయ్యగలరా?"

"నేను బ్యాంక్ పనిమీద రాలేదు బాబూ! నీతో మాట్లాడాలని వచ్చాను"

"చెప్పండి!" అన్నాడు కూర్చుంటూ.

"నన్ను క్షమించు బాబూ! నేను నీకు తగని ద్రోహం చేశాను. నిన్ను నమ్మించి వెన్నుపోటు పొడిచాను. నిన్ను, జయని విడదీసిన పాపం నాదే! ఆచారానికి, సంప్రదాయానికి విలువనిచ్చాను తప్ప, నా బిడ్డ భవిష్యత్తుని ఆలోచించలేదు. జయ నిన్నే కలవరిస్తూ పిచ్చిదయిపోయింది. దాన్ని మామూలు మనిషిగా చేసే శక్తి నీలోనే వుంది. మా ఇంటికి రా బాబూ! నామాట కాదనకు!" ఆవిడ ఏడుస్తోంది.

"ఇంటికి రండి బావగారూ! అక్క మిమ్మల్నే కలవరిస్తోంది" అంది సత్య.

సూర్యం కదిలిపోయాడు. నిజానికి నిన్న బలరామశాస్త్రి జయ పిచ్చిదయిపోయిందని చెప్పినప్పుడే ఆమెని చూడాలనుకున్నాడు. కానీ, అలా వెళ్ళకుండా ఏదో అడ్డొచ్చింది. ఇప్పుడు వెళ్ళకుండా ఆగడం

అసంభవమనిపిస్తోంది. అతను మేనేజరు దగ్గరకి వెళ్ళి పర్మిషన్ తీసుకుని "పదండి!" అన్నాడు.

★ ★ ★

ఉత్కళ క్లాసరూమ్‌లో అడుగుపెడుతుండగానే 'మ్యావ్' అంటూ అరిచారు అబ్బాయిలు. ఆమె తలవంచుకుని తన సీట్లో కూర్చుంది. బ్లాక్ బోర్డువైపు చూస్తూ అబ్బాయిలు వెకిలిగా కామెంట్లు చేస్తున్నారు. అమ్మాయిలు గుసగుసలాడుకుంటూ నవ్వుకుంటున్నారు. ఆమె కూడా బ్లాక్ బోర్డువైపు చూసింది. నగ్నంగా వున్న అమ్మాయి బొమ్మని చాక్‌పీసుతో వేశారెవరో? పైన 'ఉత్కళ' అని రాసి వుంది. శరీరంలోని రక్తమంతా ముఖంలోకి వచ్చి చేరినట్లు ఎర్రబడిపోయింది.

"సెల్‌ఫోన్‌లో ఫోటోలు చూడరా! సుద్ద ముక్కతో వేసిన బొమ్మలేం చూస్తావు?" అంటున్నాడొకడు.

అబ్బాయిలు తమ చేతుల్లోని సెల్‌ఫోన్లలో చూస్తున్నారు. సెల్‌ఫోను లేని వాళ్ళు పక్కవాళ్ళ ఫోనులో చూస్తున్నారు.

"వావ్! పెర్‌ఫెక్టు ఫిగర్‌రా! ఆ కుడితొడ మీద పుట్టుమచ్చని చూశావా? ఇంత అందాన్ని కళ్ళారా చూసిన పార్థుగాడెంత లక్కీ ఫెలోరా!" రకరకాల కామెంట్లు.

'పార్థు అన్నంత పని చేశాడు. తన ఫోటోలని అందరి సెల్‌ఫోన్లకి ఫార్వర్డ్ చేశాడు' ఆమెకిక భూమి రెండుగా చీలిపోయి తను అందులోకి కూరుకుపోతే బాగుండుననిపిస్తోంది. ఆమె ఉదుటున లేచి పరుగులాంటి నడకతో బయటకొచ్చింది. చెవుల్లో హోరు. కళ్ళముందు తన ఫోటోలు. అందరూ తన ఫోటోలని చూస్తూ.. ఆమెకి నడిబజారులో నగ్నంగా నిలబెట్టినట్టుంది. తనెంత దారుణంగా మోసపోయింది? అవును మోసం.. తనని అల్లారుముద్దుగా పెంచుకుంటున్న తల్లిని, తండ్రిని తను మోసం చేసింది. అందుకే భగవంతుడు తనని పార్థు చేతిలో మోసపోమని శపించాడు. దారిలో కనిపించిన ఆటోని ఆపింది. అడ్రస్ చెప్పి ఆటో ఎక్కి కూర్చుంది. ఆటో ఇంటిముందు ఆగగానే పర్సులో నుంచి వందనోటు తీసి ఇచ్చి, చిల్లర తీసుకోకుండానే ఇంట్లోకి నడిచింది. తండ్రి ఇంట్లోనే వున్నాడు. ఆయన ముఖం మామూలుగా లేదు. ఆయనకీ పార్థు తన ఫోటోలని పంపి వుంటాడా? ఇంట్లోకి వస్తుండగా వనజ అడిగింది "ఏమే క్లాసులు లేవా? అప్పుడే ఇంటికొచ్చేశావు?"

"అవును!" అని గదిలోకి వెళ్ళిపోయింది.

శంకరం దిగులుగా అన్నాడు. "పాపం! మా అన్నయ్యని చూస్తే జాలేస్తోంది! అంజలి పెళ్ళి చేసి ఏడాదిన్నరయింది. ఇంతలోనే ఇలా జరగడం దురదృష్టం! అన్నయ్య ఫోన్ చేసి ఈ విషయాన్ని చెప్పగానే ఆఫీసులో వుండలేకపోయాను"

"అమృత పెళ్ళిలోనే మీతో అన్నాను కదండీ! అంజలి మాటల్లో, నవ్వులో ఏదో వెలితి వుందని! మీరు నా మాట కొట్టిపారేశారు. ఇంక అమృత కాపురం ఎలా వుందో?" అంది వనజ తన అంచనా తప్పదన్నట్టు చూస్తూ!

"నోర్మూయ్! శుభం పలకరా అంటే.. నీ నోటికి మంచిమాటలు రావా?" కసిరాడు.

"అంజలిలాగే అమృతకీ గొప్పింటి సంబంధం వచ్చింది కదా! గొప్పవాళ్ళ

---

## కొత్తగాలి...

**సెల్ఫీ ఉత్సాహం**
**తనివి తీరదు**
**మాఫియా బీభత్సం**
**తరిమినా ఆగదు**

– నల్లపాటి సురేంద్ర,
పెదగంట్యాడ, విశాఖ జిల్లా

భాగోతాలు ఇలాగే వుంటాయి మరి!"

"డబ్బున్నవాళ్ళంతా మంచివాళ్ళు కాదనా నీ ఉద్దేశం! అది వాళ్ళ సంస్కారం మీద ఆధారపడి వుంటుంది!"

"అయినా నాకెందుకులెండి!" అంది వనజ వంటింట్లోకి వెళ్తూ!

సమయం మధ్యాహ్నం ఒంటి గంట యింది. వనజ వంట పూర్తిచేసి భర్తని భోజనానికి పిలిచింది.

"ఉత్కళని కూడా పిలువు!" అన్నాడు.

ఆమెకి భర్తని చూస్తే చిరాకేసింది. 'అంజలికి భర్తతో గొడవొచ్చి పుట్టింటికి వస్తే బెంగపెట్టుకున్నాడేమిటి?' అనుకుంటూ కూతరు గది తలుపు తట్టింది.

ఉత్కళ తలుపు తెరవలేదు. 'అన్నం తినలేదు! అప్పుడే దీనికి నిద్ర ముంచుకొచ్చింది కాబోలు! క్లాసులు లేవని ఎప్పుడైనా ఇంటికొస్తే పగలంతా నిద్ర పోతూనే వుం టుంది' అనుకుంటూ మరోసారి తలుపును దబదబా బాదింది. అయినా ఉత్కళ తలుపు తెరవలేదు.

"అది నిద్రపోతోంది! మీరు భోజనానికి వస్తారా? దానికి ఆకలయినపుడు లేచి అదే తింటుంది"

శంకరం సెల్‌ఫోన్ తీశాడు ఎవరికో ఫోను చెయ్యడానికి. పదిన్నరకి ఉత్కళ సెల్ నుంచి వచ్చిన మెసేజ్ వుంది. ఉత్కళ ఇంటికొచ్చాక తన సెల్‌కి మెసేజ్ ఎందుకు పంపిందో ఆయనకి అర్థం కాలేదు. ఆయన ఆ మెసేజ్‌ని ఓపెన్ చేశాడు.

'డేడీ!

మీరు నాపై ఎంతో నమ్మకాన్ని పెట్టుకున్నారు. కానీ నేను మిమ్మల్ని దారుణంగా మోసం చేశాను. ఫలితంగా నేను మోసపోయాను. నాకు బతికే అర్హత లేదు. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను.

- ఉత్కళ'

"ఉత్కళా!" శంకరం గావుకేక వేశాడు. అతని చేతిలోంచి సెల్‌ఫోను జారి పడిపోయింది. ఒక్క ఉదుటున లేచి కూతురి గది తలుపులు దబదబా బాదడం మొదలుపెట్టాడు. "ఉత్కళా! ఎంత పని చేశావు!" విహ్వాలంగా వుంది అతని స్వరం.



"ఏమైందండీ! ఉత్కళ గది తలుపు తెరవకపోతే అంత గాభరా పడుతున్నారేంటీ?" వనజ అయోమయంగా అడిగింది.

"మన ఉత్కళ ఆత్మహత్య చేసుకుంటున్నానని నా సెల్‌కి మెసేజ్ పంపింది" భయకంపితుడవుతూ, ఏడుస్తూ చెప్పాడు.

"అయ్యో ఉత్కళా! ఎంతపని చేశావే!" వనజ ఏడుపుకి ఇరుగుపొరుగువాళ్ళు వచ్చి ఉత్కళ వున్న గది తలుపులని పగ



లకొట్టారు.

సీలింగ్ ఫ్యాన్ నుంచి వేలాడుతోంది ఉత్కళ.. కాదు ఆమె శవం!

★ ★ ★

"జయా! సూర్యం వచ్చాడు చూడు!" శకుంతల కూతురిని పిలిచింది.

"సూర్యమా!? " జయ కళ్ళలో మెరుపు! "ఏడి? ఎక్కడ? " ఎదురుగా నిలబడిన సూర్యాన్ని గుర్తుపట్టిన భావం.

"జయా! నేను సూర్యాన్ని!" అతని కళ్ళల్లో నీళ్ళు.

"సూర్యం!" అతని ముఖంలోకి నమ్మ శక్యం కానట్టు చూస్తోంది జయ.

"నేనే! జయా!" అతని గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయింది.

"నువ్వు..? నిజంగా సూర్యానివేనా? !"

"అవును!"

వెంటనే ఆమె ముఖం సంతోషంతో దీప్తిమంతమయింది. "నాన్నా! సూర్యం చచ్చిపోలేదు! బతికే వున్నాడు!" అంది.

"అవునమ్మా!" అన్నాడాయన.

"సూర్యం! పద! మనమిద్దరం ఇక్కడ నుంచి పారిపోదాం! లేకపోతే మా అమ్మ మనల్ని చంపేస్తుంది!" భయంగా తల్లి

వైపు చూస్తూ అతని చేతిని పట్టుకుంది.

"శకుంతలా! నువ్వు లోపలికి వెళ్ళు!" లోగొంతుతో హెచ్చరించాడు.

ఆవిడ ఏడుస్తూ వెళ్ళిపోయింది. వున్నట్టుండి జయ, సూర్యం వైపు తిరిగింది.

"నాకు సూర్యంతో ఎప్పుడో పెళ్ళయిపోయింది! నేను కడుపుతో వున్నాను కూడా!" అని నవ్వసాగింది.

బలరామశాస్త్రి మందు బిళ్ళ తెచ్చి ఆమె చేత మింగించాడు.

"నాకు పుట్టిన పాపని విజయవాడలో హాస్పిటల్లో వదిలేశాను. వెళ్ళి నా పాపని తెచ్చుకోవాలి! డబ్బులివ్వవా? " అలా ఒక దానికొకటి పొంతన లేకుండా ఏదో ఒకటి మాట్లాడుతూనే నిద్రలోకి జారుకుంది.

సూర్యం ముఖంలో బాధ.. వేదన ప్రతిఫలిస్తున్నాయి. "ఇలా అయిపోయావేమిటి జయా!" అస్పష్టంగా అన్నాడు ఆమె తల నిమురుతూ.

"బాధపడకు బాబూ! కొన్నాళ్ళు మందులు వాడితే జయ మామూలు మనిషి అవుతుందని డాక్టరు చెప్పారు" ఓదార్పుగా అన్నాడు బలరామశాస్త్రి.

"అంకుల్! నేను రోజూ మీ ఇంటికి రావచ్చా? " సంకోచిస్తూనే అడిగాడు.

"తప్పకుండా రా బాబూ! నువ్వు కళ్ళ ముందుంటే జయ త్వరగా మామూలు మనిషవుతుంది" అన్నాడాయన, అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

★ ★ ★

"అరె! మా వదిన చెల్లెలు శిరీష!" అన్నాడు ప్రభాత్.

అమృత అతను చూస్తున్న వైపు చూసింది.

అప్పుడు వాళ్ళిద్దరూ రెస్టారెంట్‌లో వున్నారు. తామిద్దరూ కూర్చున్న టేబిల్‌కి కుడివైపు వరసలో మధ్య టేబిల్ దగ్గర కూర్చున్న ఆ అమ్మాయిని మరోసారి చూశాడతను. ఆమెలో విరజ పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె అత్యంత ఆధునికంగా అలంకరించుకుని వుంది. ఆమె పక్కనే కూర్చున్న యువకుడు అందంగా.. హుందాగా వున్నాడు.

"కచ్చితంగా శిరీషే! మా వదిన చెప్పనే లేదు, తను ఇక్కడికొస్తున్నట్టు" అన్నాడు. "ఒక్కనిమిషం! వెళ్ళి తనని పలకరిద్దాం! రా!" అన్నాడు.

అమృత అతన్ని అనుసరించింది.

"హాయ్ శిరీషా! వాట్ ఎ ప్లజెంట్ సర్ప్రయిజ్ ? !" అన్నాడు చిరునవ్వుతో.

అతనెవరో తనకి తెలియదన్నట్టు ఆమె ప్రశ్నార్థకంగా చూసింది.

"నన్ను గుర్తుపట్టలేదా? నేను మీ అక్క మరిదిని! నన్ను ప్రభాత్ అని పిలుస్తారు. తను నా వైఫ్ అమృత!" తమాషాగా అన్నాడు.

"హాయ్!" అంది అమృత చిరునవ్వుతో.

"ఐ యామ్ సారీ! మీరెవరో నాకు తెలియదు. మీరనుకుంటున్నట్టు నేను శిరీషని కాదు. నా పేరు నీరజ!" అందామె.

"ఓ! ఐయామ్ సారీ!" అన్నాడు ప్రభాత్.

చేసేదిలేక ఇద్దరూ వచ్చి టేబిల్ దగ్గర కూర్చున్నారు.

అమృత నవ్వుతూ అంది. "మనిషిని పోలిన మనుషులుంటారు! ఈ అమ్మాయిని విరజక్క చూస్తే 'చెల్లీ!' అని అమాంతం కౌగిలించుకునేది!

ప్రభాత్ కూడా నవ్వేడు. ఇంటికొచ్చాక విరజతో అన్నాడు "వదినా! ఇవాళ రెస్టారెంటులో ఒక అమ్మాయిని చూశాను. తను అచ్చం మీ చెల్లి శిరీషలా వుంది. శిరీషే అనుకుని ఆమెని పలకరించాను. తన పేరు శిరీష కాదని, నీరజ అని చెప్పింది"

"అవునా!" నవ్వింది విరజ. నువ్వు రెస్టారెంట్‌లో చూసింది వేరే అమ్మాయిని కావొచ్చు! కానీ, శిరీష ప్రాజెక్టువర్కు కోసం ఇక్కడికి వచ్చింది"

"అదేమిటి? మరి తనని మన ఇంటికి రమ్మని పిలవలేదా నువ్వు? "

"పిలిచాను! ప్రాజెక్టువర్క్ పూర్తయ్యాక వస్తుందిలే!" అని చెల్లెలికి ఫోను చేసింది. ఆమె సెల్ స్విచాఫ్ వస్తోంది.

★ ★ ★

హైదరాబాదు వెళ్ళొచ్చిన విరజని అడిగింది కృష్ణవేణి. "ఏమ్మా! మీ వాళ్ళంతా బాగున్నారా? "

"బాగున్నారండీ! మా అమ్మ నాకు డైమండ్ గాజులు చేయిస్తోంది. నాకు నచ్చిన డిజైన్ చూసుకోడానికి రమ్మంది!" గొప్పగా చెప్పింది.

కృష్ణవేణికి పట్టరాని సంతోషం కలిగింది. "బాగుందమ్మా!" అంది.

నిజానికి విరజ హైదరాబాదు వెళ్ళిన కారణం అది కాదు! వారం రోజుల కిందట తల్లి 'అర్జెంటుగా ఇక్కడికి రా' అని పిలిస్తే వెళ్ళింది.

ఆమె వెళ్ళేప్పటికి ఇల్లంతా గొడవ గొడవగా వుంది. తల్లి చెప్పిన విషయాలు విని నిర్ఘాంతపోయింది.

శిరీష విజయవాడ.. ప్రాజెక్టువర్కు కోసం వెళ్ళలేదు! తమ కారు డ్రైవర్ సలీమ్‌తో వెళ్ళింది. ఆమె విజయవాడ వెళ్ళొచ్చిన రెండు నెలల తరువాత బయటపడిందా విషయం. శిరీష నెలతప్పడంతో అసలు కథ బయటకొచ్చింది. సలీమ్ చాలా అందగాడు, మాటకారి. శిరీష అతని ఆకర్షణలో పడిపోయింది. ప్రాజెక్టు వర్క్ అని ఆమె అబద్ధం చెప్పింది. సలీమ్ తన తల్లికి ఒంట్లో బాగాలేదని చూసొస్తానని సెలవు అడిగాడు. ఇద్దరూ విజయవాడ వచ్చి హోటల్‌లో రూమ్ తీసుకున్నారు.

విరజ తల్లిదండ్రులు నెత్తినోరు బాదుకుని సలీమ్‌ని పనిలో నుంచి తీసేసి, శిరీషకి అబార్షన్ చేయించారు. విరజ ఈ విషయం భర్తకి కూడా చెప్పకుండా గుండెలో గుట్టుగా దాచుకుంది.

రెండు నెలల తరువాత ఒకరోజు సంతోషంగా చెప్పింది. "మా శిరీష పెళ్ళి నిశ్చయమయింది అత్తయ్యగారూ! వచ్చేనెల పదో తారీఖున పెళ్ళి" అంటూ వివరాలు చెప్పింది. "పెళ్ళివారిది హైదరాబాదే! అబ్బాయి అమెరికాలో మంచి ఉద్యోగంలో వున్నాడు. ఇద్దరూ వీడియో కాల్‌లో మాట్లాడుకున్నారు, చూసుకున్నారు. అతని తల్లిదండ్రులు వచ్చి శిరీషని చూశారు"

"తండ్రి ఏం చేస్తుంటాడు? " అడిగింది కృష్ణవేణి, స్టేటస్ తెలుసుకోడానికి.

"వాళ్ళకి ఇన్నోవా కార్ల బిజినెస్ వుంది" అంది విరజ అతిశయంగా!

కృష్ణవేణి ముఖం విప్పారింది.

విరజ తల్లిదండ్రులు స్వయంగా వచ్చి ఆహ్వానించడంతో ప్రభాత్, అమృత, కృష్ణవేణి శిరీష పెళ్ళికి వెళ్ళారు.

రాత్రి పదకొండు గంటలకి ముహూర్తం. ఏడున్నరకి రిసెప్షన్ మొదలయింది. అతిథులంతా ఒక్కొక్కళ్ళే వస్తున్నారు. చూస్తుండగానే ఫంక్షన్ హాలంతా ఆహ్వానితులతో నిండిపోయింది. హోటల్ బాయ్స్ డ్రింక్స్. స్టార్టర్స్ సర్వ్ చేస్తున్నారు. ఇంతలో పదిహేనేళ్ళ కుర్రాడొకడు అక్కడకొచ్చి భుజానికి వేలాడుతున్న సంచీలో నుంచి కొన్నికవర్లు తీసి అక్కడున్న వాళ్ళందరికీ పంచిపెట్టడం మొదలుపెట్టాడు.

"ఏమిటిది? " అని ఎవరో అడిగిన దానికి "చూస్తే తెలుస్తుంది" అని చెప్పాడు.

'ఏమిటా..? ' అని కుతూహలంగా కవరు ఓపెన్ చేసిన వాళ్ళ ముఖాల్లో ఆశ్చర్యం! అందరూ పక్కనున్న వాళ్ళ చెవుల్లో గుసగుసలాడుతున్నారు. అందరితోబాటు ప్రభాత్, అమృత కూడా ఆ కవరుని ఓపెన్ చేశారు. అందులో కార్డుసైజు ఫొటో వుంది. ఆ ఫొటోలో శిరీష..! ఆమె పక్కనే ఒక యువకుడు! ఇద్దరూ ఒకరి భుజాలపై మరొకరు చేతులు వేసుకుని పక్కపక్కనే నిలబడి వున్నారు. అతడు ఆ

అ
క్ష
రం

నీవు ఎగరలేకపోతే పరిగెత్తు
పరిగెత్తలేకపోతే నడువు
నడవలేకపోతే పాకు
కానీ ఏది చేసినా కదలిక ముందుకే సాగాలి!

– మార్టిన్ లూథర్ కింగ్



రోజు రెస్టారెంటులో శిరీషని పోలిన అమ్మాయి పక్కన వున్నతను. ప్రభాత్ షాకింగ్‌గా ఆ ఫొటోనే చూస్తున్నాడు.

'తను రెస్టారెంటులో చూసింది శిరీష నేనా? ఈ ఫొటోలో వున్నది శిరీషేనా?' అతను దిగ్గున లేచి ఆ ఫొటోలు పంచిపెడుతున్న కుర్రాడికోసం వెతికాడు. అప్పటికే ఆ అబ్బాయి జనంలో కలిసిపోయాడు.

విరజ.. ఆమె తల్లిదండ్రులు, మగపెళ్ళి వారితో బాటు వేదికపై వున్న వధూవరులకి కూడా ఆ కవర్లు అందాయి.

కవరు ఓపెన్ చేసి ఫొటోని చూసిన శిరీష ముఖంలో రంగులు మారాయి. 'ఎలాగూ పెళ్ళి చేసుకుంటాం కదా!' అనే ధైర్యంతో సలీమ్‌తో కలిసి ఫొటో తీయించుకుంది. అతన్ని పెళ్ళిచేసుకుంటే ఆస్తిలో చిల్లిగవ్వ కూడా ఇవ్వబోమని, అతనికొచ్చే జీతం రాళ్ళతో రెండు గదుల అద్దె ఇంట్లో బతకవలసి వస్తుందని తల్లీ తండ్రీ భవిష్యత్తుని భయంకరంగా చూపించారు. తనకి కూడా వాళ్ళమాటల్లో నిజముందనిపించింది. వాళ్ళు చెప్పినట్టు విని తన భవిష్యత్తుని సుందరంగా తీర్చిదిద్దుకోవాలనుకుంది! కానీ సలీమ్ ఈ ఫొటోలని అందరికీ చూపించి తన పెళ్ళి చెడగొట్టాలనుకుంటున్నాడా? ఆమె ఆ ఫొటోని చించి ముక్కలు చేసేసింది.

వరుడు ఆ ఫొటోని చూసి షాకయిపోయాడు. తేరుకుని తన చేతిలోని ఫొటోని శిరీషకి చూపిస్తూ అడిగాడు.

"ఈ ఫొటోలో నీతో వున్నతను ఎవరు? అతనితో అంత సన్నిహితంగా నిలబడి ఫొటో తీయించుకున్నావంటే మీ మధ్య ఏదో వుంది? !"

"నాకు తెలియదు!" అమాయకత్వాన్ని ముఖంలో ప్రతిఫలింపచేస్తూ అంది.

"ఆ ఫొటోలో వున్నది నేను కాదు! ఎవరో నా ఫొటోని మార్ఫింగ్ చేశారు"

"కాదు.. నువ్వే!"

"నువ్వు నన్ను అనుమానిస్తున్నావా? "

"నా అనుమానం నిరాధారమైంది కాదు! ఎదురుగా ఫొటో వుంది"

"మన పెళ్ళయ్యాక ఈ ఫొటోని చూసినా నన్ను అనుమానించేవాడివే!"

"అవును! నా అదృష్టం బాగుండి పెళ్ళికి ముందే నువ్వెలాంటిదానివో తెలిసింది!" అతను అంతకుముందు శిరీష తన మెడలో వేసిన దండని విసిరికొట్టాడు. "మన పెళ్ళి జరగదు!"

"పెళ్ళికి ముందే నువ్వెలాంటి వాడివో నాకూ తెలిసింది. థాంక్యూ!" శిరీష కూడా మెడలోని పూలదండని తీసి విసిరేసింది.

వరుడి తండ్రి సీరియస్‌గా శిరీష తండ్రి దగ్గరకొచ్చాడు. "మీరు మర్యాదస్తులనుకున్నాం! మీ అమ్మాయి కేరెక్టర్ లేని మనిషని తెలియలేదు. మేం ఈ పెళ్ళి కేన్సిల్ చేసుకుంటున్నాం!" అని అరిచాడు.

"శిరీష అమాయకురాలని, ఆ ఫొటోని ఎవరో మార్ఫింగ్ చేశారని" ఆమె తండ్రి ఎంతగా బతిమాలినా వరుడి తండ్రి వినిపించుకోలేదు.

క్షణాల్లో ఫంక్షన్ హాలు అంతా ఖాళీ అయిపోయింది. ఆడపెళ్ళివారొక్కరే మిగిలారు. విరజ, ఆమె తల్లి ఏడుస్తున్నారు.

శిరీష కన్నీళ్ళు పెట్టుకుంటూనే వాళ్ళిద్దరినీ ఓదార్చసాగింది.

"ఎందుకమ్మా ఏడుస్తారు? పెళ్ళయ్యాక ఆ ఫొటో చూసినా వాడు నన్ను వదిలేసే వాడే! అలాంటి వాడితో పెళ్ళి తప్పిపోయి నందుకు సంతోషించండి" అంది కసిగా.

ఫొటోలని పంచిపెట్టిన ఆ కుర్రాడిని హోటల్ బయట పట్టుకున్నారు ప్రభాత్, శ్రీకాంత్‌లు.

"నీకు ఎవరిచ్చారీ ఫొటోలని? " అడిగేడు శ్రీకాంత్.

"సలీమ్ అన్న"

"సలీమ్ ఎవరు? "

"వీళ్ళ ఇంట్లో కారు డ్రైవర్‌గా పనిచేసే వాడు. ఫొటోలో వున్నది అతనే. శిరీష, అతను ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకో వాలనుకున్నారు"

"నోర్ముయ్! ఏం వాగుతున్నావురా వెధవా!" అంటూ శ్రీకాంత్ ఆ అబ్బాయిని కొట్టబోయాడు.

ప్రభాత్ వారించాడు. "వద్దన్నయ్యా! కొట్టకు! జరిగినదాంట్లో వాడి తప్పు వుంది. కానీ, అసలు కారకుడు సలీమ్. అతను శిరీష పెళ్ళి చెడగొట్టాలని ఇదంతా చేశా డు. ఒకరోజు రెస్టారెంటులో శిరీష పక్కన సలీమ్‌ని చూశాను" అన్నాడు ఇంగ్లీషులో.

శ్రీకాంత్ షాకయ్యాడు. అతని ముఖం పాలిపోయింది.

★ ★ ★

"పాపం! ఎంత డబ్బు ఖర్చు! ఎంత శ్రమ! జరగవలసిన పెళ్ళి ఆగిపోయింది. అవమానం మిగిలింది. అయినా ఎవరో ఫొటో మార్ఫింగ్ చేస్తే ముందూ వెనుకా ఆలోచించకుండా పెళ్ళి కేన్సిల్ చేసుకు న్నారు. సంస్కారం లేని మనుషులు" అంది కృష్ణవేణి.

"ఆ ఫొటోలోని అబ్బాయితో శిరీషని.. రెస్టారెంటులో అమృత, నేను చూశాం! అతని పేరు సలీమ్. వదిన వాళ్ళ నాన్న గారి దగ్గర కారు డ్రైవర్‌గా పనిచేస్తుం టాడు" నిదానంగా చెప్పాడు ప్రభాత్.

కృష్ణవేణికి నోట మాట రాలేదు. కొన్ని క్షణాల తరువాత ఎలాగో గొంతు పెగల్చు కుని అడిగింది.

"శిరీష డబ్బున్న అమ్మాయి. ఆమెని పెళ్ళిచేసుకుంటే లైఫ్‌లో సెటిలయిపోవ చ్చని సలీమ్ ఆలోచించి వుంటాడు. ఎలా గైనా శిరీష పెళ్ళి చెడగొడితే గత్యంతరం లేక ఆమెని తనకిచ్చి పెళ్ళిచేస్తారని ఆశప డ్డాడేమో! మళ్ళీ ఇంకో సంబంధం చూసినా వీడు చెడగొడతాడేమో రా!"

"డబ్బు.. పలుకుబడి వున్న వదిన నాన్నగారిలాంటి వాళ్ళకి సలీమ్‌ని అడ్డు తొలగించుకోడం పెద్దపనేమీ కాదు. డబ్బుతో ఎన్ని తప్పులయినా కప్పి పుచ్చు కోవాలనుకుంటారు చాలామంది. నీతిని యమాలున్న వాళ్ళు తాము ప్రేమించిన వాడినే పెళ్ళిచేసుకుంటారు. మరికొందరికి ప్రేమ ఒకరితో.. పెళ్ళి మరొకరితో! చేసిన తప్పులని దాచిపెట్టి డబ్బుతో పరువు నిల బెట్టుకోవాలనుకునే వాళ్ళకి శిరీష ఉదంతం ఒక హెచ్చరిక!" క్షణం ఆగి అన్నాడు. "వదిన ఇక్కడికి వచ్చాక సూటీపోటీగా ఆమెని ఏమీ అనకమ్మా! నువ్వు అనవులే! కానీ, అనాలనిపిస్తుంది. అది సహజం"

కృష్ణవేణి ముఖంలో రంగులు మారాయి. "నేనేమీ అననురా! అయినా ఎవరినైనా ఏమైనా అంటే అది మనకే తగులుతుంది!"

"ఆ విషయం వదినకీపాటికి అర్థమయ్యే వుంటుంది. ఆవిడ అందరి జీవితాల్లోకి తొంగి చూడాలనుకుంటుంది. ఎవరి బతు కులు వాళ్ళవి అనుకోదు!"

తనని కూడా ఏమీ అనొద్దని పరోక్షంగా తల్లిని హెచ్చరిస్తున్న భర్తని మెరుస్తున్న కళ్ళతో చూసింది అమృత. 'ప్రభాత్‌లాంటి మంచి వ్యక్తి భర్తగా లభించిన తనెంత అదృష్టవంతురాలు!' అనుకుంది. ©

# సాహితీవేత్తల చమక్కులు



లార్డ్ టెన్నిసన్ ప్రఖ్యాత ఆంగ్లకవి. బామ్మ బతికుండగానే "బామ్మా! నీవు చచ్చిపోయాక నా ఈ కవితను నీ సమాధిపై చెక్కిస్తా" అన్నాడు చిన్నారి టెన్నిసన్. బామ్మకు ఆ కవిత వెంటనే నచ్చి "ఒరే భడవా! ఈ పది షిల్లింగులు నీకు బహుమతిగా ఇస్తున్నా! ఇదే నా మొదటి, ఆఖరి గిఫ్టురా.. ఎప్పుడు హరీ అంటానో నాకు తెలీదు కదా? " అంది. కానీ ఆమె భవిష్యవాణి నిజం కాలేదు. ఎంచక్కాగా బతికి బట్టకట్టింది. మనవడు మంచి పేరు ప్రఖ్యాతులు, డబ్బు దస్కం సంపాదించటం చూసిందామె.



★ సస్పెన్స్ కథలు రచించటంలో ఘటికుడు సర్ ఆర్థర్ కానన్ డాయల్‌కి పునర్జన్మపై విశ్వాసం ఉంది. ఆత్మల్తో మాట్లాడాలని మహా ఉబలాటపడేవాడు. అతని ఒక మిత్రుడు చనిపోయాక ఎవరో అడిగారు- "ఏమయ్యా! నీ చచ్చిన మిత్రుడితో మాట్లాడావా? " "ఊహూం" "మరి ఆత్మలు, ప్రేతాత్మలు ఉన్నాయని నమ్ముతావుగదయ్యా? " "కానీ నా ఫ్రెండ్ ఆత్మ నాతో మాట్లాడుతుంది అని నేను అనుకోవటం లేదు" "ఎందుకని? " వెటకారంగా అడిగాడా వ్యక్తి. "ఎందుకా? " అతను ఇంక చస్తాడనగానే బోలెడంతసేపు ఇద్దరికీ బోర్ కొట్టేంతగా మాట్లాడుకున్నాం, అందుకు" తాపీగా అన్నాడు కానన్.

★ ప్రసిద్ధ పంజాబీ రచయిత్రి అమృతా ప్రీతమ్ ఒక అమెరికా నవలని అనువాదం చేస్తున్న రోజులవి! కొన్ని పదాలకు అర్థం తెలీక, డిక్షనరీ అంతా గాలించింది. అందులోనూ దొరక్క అమెరికా రాయబారి కార్యాలయానికి లేఖ రాసింది. శ్రీ హరివంశ్ అనే ఆయన ఆమెకో డిక్షనరీ పంపుతూ, తొలిపేజీలో "టు అమృతా ప్రీతం, విత్ ఆల్ గుడ్ వర్డ్స్ ఫ్రమ్ దిస్ డిక్షనరీ" అని రాశాడు. ఆ విషయాన్ని చెప్తూ అమృత ఇలా కితాబిచ్చారు- "నా సమకాలిక ప్రజలు డిక్షనరీలో చెడు పదాలన్నీ ఏరుకుని నాపై ప్రయోగిస్తున్నారు. ఒక్క మంచి పదం పొరపాటున చెవినపడ్తే చెవులు రిక్కించి వింటాను"

ఆమె ఇంకో సంఘటనను ఇలా చెప్పింది- "మా నాన్న అన్న మాటల్ని నేను జీవితాంతం మర్చిపోలేను. 1936లో నా తొలి పుస్తకం అచ్చు అయింది. కపుర్తలా మహారాజు దాన్ని చదివి మెచ్చుకుని, రెండొందల రూపాయలు పంపారు. కొన్ని రోజుల తర్వాత మహారాణి ఆ పుస్తకాన్ని ప్రశంసిస్తూ ఒక చీరె పంపింది. ఆ రెండు పోస్టు ద్వారా రావటంతో నా ఆనందం ద్విగుణీకృతమైంది. ఒకరోజు పోస్ట్‌మాన్ మా తలుపు తట్టగానే, ఏదన్నా బహుమతి వచ్చి ఉంటుందని ఆత్రంగా పరుగెత్తాను. మా నాన్న నా వంక కోపంగా చూస్తూ -ఇలాంటి వాటికోసం రచయిత

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, కాలాతీతం, నవలావలోకనం ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ.116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ 17.

– సంపాదకులు

*నిబంధనలు :* ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

*చిరునామా :* సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
*ఫోన్ :* 040 -23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

---

కక్కుర్తి పడకూడదు- అన్నారు. అంతే, నా తప్పు తెలుసుకున్నాను. చిన్న చిన్న ప్రలోభాలకు రచయిత లొంగిపోకూడదని నేను గ్రహించాను"

★ బెంగాలీ కథాకారుడైన సుకుమార్ ఛటర్జీ ప్రసిద్ధ హిందీకవి వీరేంద్ర మిశ్రని ఏడ్పిస్తూ ఇలా ఉడికించాడు. వేదపాఠశాల బ్రాహ్మణుడ్ని వేది అన్నారు. అలా ద్వివేది, త్రివేది, చతుర్వేది అని పేర్లు 2, 3, 4 వేదాలు చదివిన వారిని అంటున్నాం. చదువు చెప్పేవారు ఉపాధ్యాయ అనే పేరు తగిలించుకుంటున్నారు. ఇక సరిగ్గా చదవలేని వారు, చదువు చెప్పలేనివారు "మిశ్ర" అంటే ఎలాగోలా కలగల్పి అన్నీ మిశ్రమం చేస్తారు కాబట్టి మిశ్ర అనే పేరు తగిలించుకున్నారు.

వీరేంద్ర మిశ్ర కూడా తక్కువ తినలేదు. వెంటనే వ్యంగ్యాస్త్రాన్ని ఇలా సంధించాడు.- "అవునవును. మొదట్లో బ్రాహ్మలు తమ ఇష్టదేవతలకి ప్రతులు లేక అర్జీలు సమర్పించేవారు. అందుకే తులసీదాసు వినయ పత్రిక రాశాడు. అర్జీలు రాసేవారు బెనర్జీలుగా మారారు.. రాయకుండా, మొహాన చెప్పేవారు ముఖర్జీలుగా, చటుక్కున చెప్పేవారు ఛటర్జీలుగా మారారు. అంతే, వారి మాటల హాస ప్రతిహాసాలకి చుట్టూ ఉన్న వారంతా ఘొల్లున నవ్వారు.



★ ఒకసారి న్యూస్‌పేపర్‌లో రుడ్‌యార్డ్ కిప్లింగ్ చనిపోయిన వార్త వచ్చింది. తాను చావు వార్తను చదివి అతను ఆలోచించి చల్లగా ఎడిటర్‌కి ఫోన్ చేసి "సార్! ఈ రోజు పేపర్‌లో నా చావు వార్త వచ్చింది. ఇవ్వాల్టి నుంచి మీ పేపరుకి నేను చందా కట్టను" అన్నాడు.

★ హిందీ రచయిత అజ్ఞేయ అసలు పూర్తి పేరు సచ్చిదానంద హీరానంద వాత్సాయన్. అజ్ఞేయ అనే పేరు రావటానికి వెనకాల ఓ కథ ఉంది. జైనేంద్ర కుమార్, ప్రేమ్‌చంద్ దీనికి సూత్రధారులు. సచ్చిదానంద్ జైల్లో ఉన్న రోజులవి. తన రచనల్ని రెండు మూడు కాపీలు తయారుచేసి వేర్వేరు ప్రాంతాలకి పంపేవాడు. కొన్ని కథల్ని జైనేంద్రకి పంపితే, ఆయన వాటిలో

రెండు కథలు ప్రేమ్‌చంద్ దగ్గరికి పంపాడు. ప్రేమ్‌చంద్‌కి ఆ రెండు కథలు నచ్చి ప్రచురిస్తానన్నాడు. కానీ అసలు రచయిత పేరు తెల్పమని ప్రేమ్‌చంద్ కోరాడు. జైలు నుంచి దొంగతనంగా కథలు పంపటంతో సచ్చిదానంద పేరును బహిర్గతం చేసే వీలులేదు. అందుకే జైనేంద్ర, ప్రేమ్‌చంద్‌తో "అతని పేరు చెప్పలేను, అజ్ఞేయ (అజ్ఞాత) అనుకోండి" అన్నాడు. "ఇంకేం, అజ్ఞేయ అనే పేరుతోనే ఆ కథలు పబ్లిష్ చేస్తాను' అని ప్రేమ్‌చంద్ ప్రకటించాడు.



★ ప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మ ఒకప్పుడు బౌద్ధ సన్యాసిని కావాలనుకుంది. లంక బౌద్ధ విహారానికి లేఖ రాసింది. బదులుగా "మేము భారత్‌కి వస్తున్నాం. నైనిటాల్‌లో మమ్మల్ని కలువు" అని ఆ మఠం వారు రాశారు. మహాదేవి తన ధనాన్నంతా దానం చేసింది. నైనిటాల్‌లో సింహాసనంపై కూచున్న బౌద్ధ గురువుని సమీపించింది. ఆయన తన మొహాన్ని విసనకర్రతో కప్పుకున్నాడు. ఆమె ఇంకోవైపు నుంచి అతన్ని చూడాలనుకుని అటు మరలగానే, ఆ గురువు వేరే దిక్కుకి తన మొహాన్ని తిప్పుకుని తన మొహం కనపడకుండా కప్పుకున్నాడు. "ఆయన స్త్రీ మొహాన్ని చూడరమ్మా" అని అతని శిష్యులు చెప్పారు. "అలాంటి దుర్బల మనస్కుడైనవాడు నాకు గురువుగా పనికిరాడు. ఆత్మకి స్త్రీ పురుష భేదం ఉండదు. ఈ మట్టి శరీరానికి ప్రాధాన్యతనిచ్చే వాడిదగ్గర నేను దీక్ష తీసుకోను" అని దృఢంగా నిర్ణయించుకొని హాయిగా ఇంటికొచ్చేసింది. ఆపై "దీక్ష తీసుకోవటానికి రా తల్లీ!" అని ఉత్తరాలు రాసినా, తిరస్కరించి సాహితీ క్షేత్రంలో మెరిసింది ఆమె.

★ బెంగాలీ కవి, నాటకకర్త గిరీష్ చంద్రఘోష్‌కి ఓ ధనిక మిత్రుడున్నాడు. అతనికి కాస్త అహంభావం. తాను ఎవరింటికెళ్లినా, తన నౌకరు చేత వెండి చెంబుని పట్టించుకుని వెళ్లి తన దర్పం ప్రదర్శించేవాడు. ఆ రోజుల్లో ఎవరింటికైనా భోజనానికెళ్తే ఇంట్లోంచి చెంబు, గ్లాసు పట్టుకునే వెళ్లేవారు. అతనికి గుణపాఠం నేర్పాలని ఒకరోజు తనింటికి భోజనానికి పిలిచారు చంద్రఘోష్. మిత్రుడు వెండి చెంబుతో సహా వస్తే అతనికి అందరితోపాటు ఆకులో భోజనం వడ్డించాడు. ఆ తరువాత చెంబులో వంటకాలు నింపి "మీ ఇంటి వారి కోసం వెండి చెంబు తెచ్చారని అంతా అనుకుంటున్నారు. అందుకే ఇది తీసుకెళ్లండి" అనగానే ఆ మిత్రుడు సిగ్గుతో తల దించుకున్నాడు.

★ ప్రసిద్ధ హిందీ కవి సూర్యకాంత త్రిపాఠీ నిరాలా సహృదయుడు, దానధర్మ పరాయణుడు. ఒక సేఠ్ ఆయనకి ఒక శాలువాను బహూకరించాడు. చలికాలం రాత్రి ఆ దారిన పోతున్న ఆయన కళ్లకు ఒక బిచ్చగాడు కనపడితే నిరాలా వెంటనే అతనికి కప్పాడు దాన్ని. ఇదంతా సేఠ్ నౌకరు చూసి వెంటనే ఆయనకి చెప్పాడు. "నిరాలా!" అని అరుస్తూ వచ్చిన అతన్తో "పోన్లే వయ్యా.. పాపం! చలికి ఒంటిపై బట్టలేదు అతనికి!" అని నవ్వుతూ నిరాలా అనేటప్పటికి నోట మాటరాక నిలబడ్డాడు సేఠ్. చాలా నిష్కపటి. మనసులోదే చేసేవాడు. దీనదళితుల కవి. ఒక పబ్లిషర్ నుంచి మూడొందల రూపాయలు తీసుకుని వస్తుంటే చౌరస్తాలో ఓ ముష్టిది "బాబూ! ధర్మం" అనగానే "నన్ను కొడుకా అని పిలిచావు గదా? నా తల్లి అడుక్కోగూడదు" అని ఆ డబ్బు ఆమె చేతిలో పెట్టాడు. ఎవరో ఆయన్ని "మీరు ఇదివరకు లక్నోలో ఉండేవారు కదా? అలహాబాద్ ఎందుకొచ్చారు?" అని అడిగితే "కర్మ కోసం లక్నోలో ఉన్నా. ఇప్పుడు ధర్మం కోసం ఉంటున్నా" అన్నాడు.



★ ఐవన్ హాజిను రచించిన ప్రఖ్యాత లేఖకుడు సర్ వాల్టర్ స్కాట్ ఏదో ఫండ్ కోసం విరాళాలు సేకరిస్తున్నాడు. ముందుగా బ్రహ్మాండంగా ఉపన్యాసం దంచాడు. విరాళం ఎందుకివ్వాలో ఉద్బోధించాడు. చెప్పటం అయ్యాక తన నెత్తిపై ఉన్న టోపీని డబ్బు సేకరించటానికి పంపాడు. కానీ ఒక్కరు కూడా చిల్లిగవ్వను విదిలించలేదు. ఆఖరికి ఖాళీ టోపీ ఆయన చేతికి తిరిగి వచ్చింది. 'థ్యాంక్స్! కనీసం నా టోపీని సురక్షితంగా నా దగ్గరకు చేర్చారు. ఇందులో గుడ్డిగవ్వ పడకపోయినా, మళ్లీ టోపీ కొనే ఖర్చు తప్పింది' అని చమత్కరించాడు.

సేకరణ: **అచ్యుతుని రాజ్యశ్రీ**

# కాలాతీతం



మారియో వార్గస్ జోసా



# కాన్వర్జేషన్ ఇన్ ది కెథడ్రల్

'నవలలన్నీ దేశాల అనధికారిక చరిత్రలే' అన్న ఫ్రెంచి రచయిత బాల్జాక్ వాక్యం ఈ నవలకు ప్రేరణ. పెరూ దేశ అనధికార చరిత్ర రాయాలనుకున్నాడు జోసా. చరిత్ర అనుకున్నాక, మరి పుస్తకం సైజు కూడా పెరగక తప్పదు. ఉన్నవాళ్లకూ, లేనివాళ్లకూ మధ్య పోరాటం ఈనాటిది కాదు. ఈ రెండు వర్గాల సామాజిక పరిణామ క్రమాన్ని వివరించడంతో ఓ పట్టాన కొలిక్కిరాని కథ, టీవీ సీరియల్‌ను తలపిస్తుంది.

అనుకోకుండా ఒకరోజు సాంటియాగోకు వీధిలో తారసపడతాడు ఆంబ్రోసియో. ఇద్దరూ కలిసి పేదవాళ్ల 'దాహార్తి'ని తీర్చే 'ది కెథడ్రల్' బార్‌లో కబుర్లు చెప్పుకుంటారు. అవును, ఆ కబుర్లే కథ. అలా ప్రారంభమవుతుంది దేశ చరిత్ర. సాంటియాగోకు భార్యతో తృప్తిలేదు. ఎక్కడో పొరబాటు జరిగింది. మంచి ఉద్యోగమే వుంది. సంసారం ఒడుదొడుకుల్లో లేదు. అంతా సజావుగానే సాగిపోతున్నది. ఆమెను తప్పు పట్టవలసిన అవసరం లేదు. వెరసి మధ్యతరగతి కుటుంబం. చెప్పుకోవలసిన కష్టాలు లేవు. ఆరువందల పేజీల తర్వాత కూడా పరిస్థితి మారదు. అయితే, సాంటియాగో, ఆంబ్రోసియో, మరికొందరు పాత్రల గురించి మరింత లోతుగా తెలుస్తుంది. సాంటియాగోను వేధిస్తున్న సమస్య ఏమిటో అర్థమవుతుంది. మార్పులేదు, ఆశలేదు, కాలం భారంగా గడిచిపోయింది. ఇకముందూ ఇంతే! అవినీతి, సామాజిక అసమానతలూ పెరూవియన్ సమాజానికి పట్టిన పీడ. వీటిని నిర్మూలించనంత

# మారియో వార్గస్ జోసా

పెరూవియన్ నవలా రచయిత, నోబెల్ బహుమతి గ్రహీత (2010) హోర్హె మారియో పేద్రో వార్గస్ జోసా (జననం: 1936) లాటిన్ అమెరికాకు ప్రాతినిధ్యం వహించిన ముఖ్య రచయితల్లో ఒకరు. రాజకీయ విషయాలను కథా వస్తువుగా తీసుకొని రాయటంలో అనేకమంది రచయితలకు ప్రేరణ. 'అధికార వర్గాలు, నియంతృత్వాలు కప్పుకున్న ప్రజాసంక్షేమమనే ముసుగును తొలగించాడు' అంటూ ఈయన్ను ప్రశంసించింది నోబెల్ కమిటీ.

పధ్నాలుగేళ్లప్పుడు లిమా(పెరూ రాజధాని)లోని మిలిటరీ అకాడమీలో కొంతకాలం చదివిన జోసా రెండేళ్ల తర్వాత 'ది ఫ్లైట్ ఆఫ్ ది ల్యూకా' నాటకం రాసి ప్రదర్శించాడు. 1958లో సాహిత్యంలో డిగ్రీ తీసుకొని మరుసటి సంవత్సరం తొలి కథాసంకలనం 'ది లీడర్స్' ప్రచురించాడు. ఆసక్తికొద్దీ అనువాదకుడిగా, ఇంటర్‌ప్రిటర్‌గా, టెలివిజన్ వ్యాఖ్యాతగా పారిస్‌లో పనిచేశాడు. 1963లో తొలి నవల 'ది టైమ్ ఆఫ్ ది హీరో'తో మరింత ప్రతిష్ఠను పెంచుకున్నాడు. విమర్శకుల అభిప్రాయంలో 1964 నాటి 'ది గ్రీన్ హౌస్' నవల (వేశ్యాగృహమే ఇందులోని కథావస్తువు) ఈయన రచనలన్నింటిలోనూ అత్యుత్తమమైనది. విప్లవంతో సంఘీభావం ప్రకటించటానికి 1965లో క్యూబాను దర్శించాడు. 1969లో 'కన్వర్జేషన్ ఇన్ ది కెథడ్రల్' రెండు సంపుటాలుగా వెలువడింది. 1971లో తన డాక్టరేట్ కోసం తొలి విమర్శ 'గార్షియా మార్కెజ్: దైవ భావనను నాశనం చేసిన రచయిత' ప్రచురించాడు. ఆ తర్వాత కొలంబియా యూనివర్సిటీలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేశాడు. కొంతకాలం పెన్ ఇంటర్నేషనల్(కవులు, వ్యాసకర్తలు, నవలా రచయితలు)సంస్థకు అధ్యక్షుడిగా ఉన్నాడు. 1975లో ఒక హాస్యనవల 'కెప్టెన్ పాంటోజాస్ అండ్ ది స్పెషల్ సర్వీసు' ప్రచురించాడు. 1977లో 'ఆన్నెట్ జూలియా అండ్ ది స్క్రిప్ట్ రైటర్' అనే ఆత్మకథాత్మక నవల ఆయన కీర్తిని మరింత పెంచింది. 1981లో 'ది వార్ ఆఫ్ ది ఎండ్ ఆఫ్ ది వరల్డ్', 1984లో 'ది రియల్ లైఫ్ ఆఫ్ అలెగ్జాండ్రో మేయత',

వరకూ ఈ పరిస్థితి ఇంతే.

గతం గురించి చెబుతున్నట్టనిపించినా నిజానికి ఇదంతా ఆ దేశ ఆధునిక/ సమకాలిక చరిత్రే. సమస్యకు పరిష్కారం వెదికే ప్రయత్నం జరగదు. కథకు ముగింపూ వుండదు. ఇది కేవలం సంభాషణ. నవల చివరన సాంటియాగోకు కాస్త మత్తెక్కినట్టుగా వుంటుంది. ఆంబ్రోసియో పెద్ద మాటకారి కాదు. అతడు స్పందించకపోవటంతో సంభాషణ పలుసార్లు కొత్త మలుపులు తిరుగుతుంది.

సాంటియాగో తల్లిదండ్రులు సంపన్నులే. కొడుకు పెద్ద చదువులు చదివి పేరుప్రతిష్ఠలు సంపాదించాలనుకుంటారు. అతడు అందరిలా ప్రభుత్వ యూనివర్సిటీ శాన్‌మార్కోస్‌లో కాక, ప్రైవేట్ కాథలిక్ యూనివర్సిటీలో చేరితే బాగుంటుంది. కాని సాంటియాగో మతవిశ్వాసాల జాడ్యం ఎప్పుడో వదిలించుకున్నాడు. శాన్‌మార్కోస్‌లో చేరి మార్క్సిస్టు చర్చాబృందంతో పరిచయం పెంచుకుంటాడు. త్వరగానే ఈ గ్రూపును అరెస్టు చేస్తారు పోలీసులు. సాంటియాగో తండ్రి తనకున్న పలుకుబడి, రాజకీయ సంబంధాలు ఉపయోగించి కొడుకును విడుదల చేయించుకుంటాడు. సాంటియాగో యూనివర్సిటీ వదిలి కుటుంబంతో సంబంధాలు తెంచుకొని 'లా క్రానికా' అనే పత్రికలో పని చెయ్యడానికి వెళ్ళిపోతాడు.

రచయిత ఈ నవలను దక్షిణ అమెరికా చరిత్రను విస్తృతంగా చర్చించటానికి వేదికగా ఉపయోగించుకున్నాడనిపిస్తుంది.

1986లో ఓ డిటెక్టివ్ నవల 'హు కిల్డ్ పాలో మినో మోలెరో?' ప్రచురించాడు. కేవలం సాహిత్య కృషితో తృప్తి చెందక, రాజకీయాల్లోకి ప్రవేశించి 1990లో పెరూ అధ్యక్ష పదవికి పోటీ చేశాడు. ఆ సంవత్సరం మరో నవల 'ది డిసెంట్ ఆఫ్ హీరో' వెలువడింది. 1991లో తన నవలల నేపథ్యాన్ని వివరించిన 'ఎ రైటర్స్ రియాల్టి' రచయితలకు హ్యాండ్‌బుక్ లాంటిది.

పెరూలోని సామాజిక, రాజకీయ పరిస్థితులు.. ముఖ్యంగా అవినీతిలో కూరుకుపోయిన నియంత మానుయెల్ ఓడ్రియా అధికారంలో వున్న 1948-1956 మధ్యకాలంలో ప్రజల దుర్భరజీవనాన్ని చిత్రించిన నవల 'కన్వర్జేషన్ ఇన్ ది కెథడ్రల్'. విద్యార్థి దశలో జోసాకు యిది ప్రత్యక్ష అనుభవమే. దేశంలో సర్వే సర్వత్రా వ్యాపించిన భయం, హింస, మాయ మాటలతో ప్రజల్ని మభ్యపెట్టాలని ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు పాఠకుల మనసుల్ని కలచివేసే ఈ నవలలోని కథా వస్తువు. ఇంతకూ, ఇందులో కెథడ్రల్ అంటే ప్రార్థనా మందిరం కాదు. అది లిమాలోని ఒక మద్యశాల పేరు. తాగటానికీ, వాగటానికీ, కళ్లముందు కనిపించే ఘోర వాస్తవాలను కాసేపు మరచిపోవటానికే జనం అక్కడ గుమిగూడతారు. జర్నలిస్టు సాంటియాగో, అతడి తండ్రి దగ్గర ఒకప్పుడు పనిచేసిన కారు డ్రైవర్ ఆంబ్రోసియోల మధ్య జరిగిన సంభాషణ కథను నడిపిస్తుంది. వీళ్ల ద్వారా రచయిత, ఓడ్రియా గురించి తను చెప్ప దలచుకున్నదంతా చెబుతాడు. కేవలం ఓడ్రియా గురించి మాత్రమే కాదు, నియంతల మనస్తత్వాన్ని, వాళ్ల ప్రజావ్యతిరేక విధానాలను ఎండగట్టిన నవల కన్వర్జేషన్. 'రాజకీయాల గురించి నేను నవలలు రాశాను. కన్వర్జేషన్ వాటిలో ఒకటి. నియంతల గురించి, ప్రజల గురించి చెప్పటం నా ఉద్దేశం. అందులో కొన్ని రాజకీయ అభిప్రాయాలు కూడా లేకపోలేదు. కానీ కేవలం అభిప్రాయాలు వ్యక్తపరచటం కోసం ఎవరూ నవల రాయకూడదు. రాజకీయ ప్రకటననే చెయ్యదలచుకుంటే వ్యాసాలు ప్రచురించటం మంచిది. ఎందుకంటే నవలలో మనుషులుంటారు. వాళ్లు తిక్కపనులు చేస్తుంటారు. అసలు, నవలా నిర్మాణంలోనే పెద్దగా హేతుబద్ధత వుండదు' అంటారు జోసా.

మరో సందర్భంలో, ఓ యువ రచయిత 'పేరు తెచ్చుకోవటం ఎలా?' అని అడిగినప్పుడు 'పేరు రావటానికి అనేక కారణాలుంటాయి. కాని ఒక ముఖ్యకారణం అకుంఠిత శ్రమ. అందులో సందేహం లేదు' అని జవాబిచ్చాడు.

కుటుంబంతో సంబంధాలు తెంచుకున్నప్పుడే ఆ రాజకీయాలతో కూడా తెగదెంపులు చేసుకొన్నాడు సాంటియాగో. కొత్త పాత్రల ప్రవేశంతో పేదల, ధనికుల జీవితాలలో వున్న వ్యత్యాసం గురించిన విశ్లేషణ ప్రారంభమవుతుంది. అధికారవర్గాల దోపిడీ కొన్నిసార్లు బహిరంగంగా కొనసాగుతుంది. కొన్నిసార్లు పేదలకు మత్తుమందు యిచ్చినట్టు దురలవాట్లలో, మూఢవిశ్వాసాలలో ముంచి, వాళ్లను నిర్వీర్యం చేసి, సామాజిక ప్రయోజనాల కన్న వ్యక్తిగత ప్రయోజనాలే ముఖ్యమని భ్రమ కల్పించి తమ దోపిడీ కొనసాగిస్తాయి అధికార, బూర్జువా వర్గాలు. సంఘటిత పోరాట పటిమ కోల్పోయిన సామాన్యులు కబుర్లు చెప్పుకుంటూ, తమ దురదృష్టాన్ని నిందించుకుంటూ, శుష్క విమర్శలతో కాలం వృథా చేసుకుంటారు. 'సాంటియాగో' తండ్రి డాన్ ఫెర్మిన్ వద్ద కారు డ్రైవర్‌గా పనిచేసిన ఆంబ్రోసియో, అంతర్గత భద్రతా వ్యవహారాల మంత్రి డాన్ కాయో బెర్మెడెజ్ దగ్గర డ్రైవర్‌గా చేరతాడు. డాన్ కాయోను అంతం చెయ్యడానికి కుట్ర జరుగుతుంది. అయితే ఆ కుట్ర వెనక వున్నది పేదలూ, వామపక్షాల వాళ్లూ కాదు. ధనిక భూస్వాములే కూటమిగా ఏర్పడి ఈ పని చేశారు. డాన్ ఫెర్మిన్ కూడా అందులో ఒకడు. కుట్ర విషయం బహిర్గతం కాగానే డాన్ కాయో దేశం వదిలి వెళ్లిపోతాడు. ఆయన ఉంపుడుకత్తె హోర్టెన్సియా అనే వేశ్యను ఎవరో హత్యచేస్తారు. మొదట ఇదో మిస్ట

రీగానే వుంటుంది గాని తరువాత ఈ పని చేసింది ఆంబ్రోసియోనే అని తెలుస్తుంది.

అయితే, పాఠకులను ఇక్కడో సందేహం వేధిస్తుంది. సైనిక నియంతకు వ్యతిరేకంగా తనతండ్రి ప్రాణత్యాగానికి కూడా సిద్ధపడినప్పుడు సాంటియాగో ఇల్లు వదిలి పోవాల్సిన అవసరమేమిటి? నవలలో ఈ ప్రశ్నకు సమాధానం దొరకదు. రచయిత పాక్షికంగా యిచ్చిన వివరణ ఏమిటంటే.. డాన్ ఫెర్మిన్‌కూ, డాన్ కాయోకు వున్న వైరానికి కారణం రాజకీయాలో, నియంతృత్వమో కాదు. ఇద్దరిమధ్యా వున్న కొన్ని ఆర్థిక లావాదేవీలే అతణ్ణందుకు ప్రోత్సహించి వుంటాయి. పెరువియన్ రాజకీయవ్యవస్థను శాసిస్తున్న వేశ్యలు, దొంగలు, అవినీతి రాజకీయ నాయకులతో డాన్ ఫెర్మిన్‌కు సత్సంబంధాలున్నాయి. నిజానికి ఇతడో హోమోసెక్సువల్. అయితే సాంటియాగో కుటుంబంతో సంబంధం తెంచుకోవటానికి యివేవీ సరైన కారణాలు కావు.




అతడు, ఒకప్పుడు మార్క్సిస్టులతో చెట్టాపట్టాలేసుకుని తిరిగినా, తరువాత మార్క్సిజాన్ని నిరసించాడు. అంటే కుటుంబాన్ని వదిలినప్పుడే అతడు రాజకీయాలనుండి కూడా విరమించాడు.

అంటే, మార్క్సిజానికి, రాజకీయాలకూ సంబంధం వుంది. ఒకటి లేకపోతే మరొకటి లేదు. రాజకీయ (మార్క్సిస్టు) నేపథ్యం లేకుండా కేవలం నికార్సయిన జీవితం గడపాలనుకొన్నాడు సాంటియాగో. ఎవరితోనూ సంబంధం పెట్టుకోదలచుకోలేదు. కాని అవినీతికి వ్యతిరేకం. సాంటియాగో రాజకీయ వ్యవస్థకు వెలుపల వుండాలనుకొన్నాడు. తండ్రి ఆత్మగౌరవం పోగొట్టుకోకుండా వ్యవస్థలో భాగమై పనిచేయాలనుకున్నాడు. పెరూవియన్ బూర్జువా వర్గంలో క్యాన్సర్‌లా వ్యాపించిన అవినీతి, దిగజారిన విలువలకు నిదర్శనమా డాన్ ఫెర్మిన్ (జవాలిటా) కుటుంబం? సాంటియాగో, తన కుటుంబంతో సంబంధాలు తెంచుకోవటానికి ఇదే ముఖ్యకారణమా? కథలో అనేక నాటకీయమైన మలుపులుంటాయి. సాంటియాగో సందిగ్ధతను పాఠకులూ అనుభవిస్తారు. జీవితంలో రెడీమేడ్ జవాబులుండవు. ఎవరికివాళ్లను సొంతంగా ఆలోచించమంటాడు రచయిత.

వ్యక్తుల సందిగ్ధతను చిత్రించడం ఆధునిక రచయితల ధోరణిగా కనబడుతున్నది. అన్నీ తెలుసు కాని ఏ నిర్ణయమూ తీసుకోలేరు. అంటే ఆచరణ నుంచి దూరంగా వుంటారు. లాభమే పరమావధిగా వ్యాపార సామ్రాజ్యాలను విస్తరించుకుంటున్న బహుళ జాతి సంస్థలు, తమ వద్ద ఊడిగంచేసే నియంతల ద్వారా దేశాన్ని దోపిడీ చేస్తున్నాయి. పేదల జీవితాలు చితికిపోతున్నాయి. కానీ లౌక్యం తెలిసినవాడు తనూ ఓ దోపిడీదారుగా మారితే తప్ప ఈ పరాన్నభుక్కుల సమాజంలో బతికిబట్టకట్టలేడు. యూనివర్సిటీ దశలో మార్క్సిస్టుగానో, మార్క్సిస్టు సానుభూతిపరుడిగానో వున్న సాంటియాగో 'సత్యం గ్రహించి' బహుశా అలాంటి నిర్ణయమే తీసుకొనివుంటాడు. సమసమాజమెట్లాగూ అందని ద్రాక్ష. నెరవేరని కల. ఈలోగా అందరూ 'చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష' అనుకొని బతకాల్సిందే. దేశ పరిస్థితి దారుణంగా, నిరాశా జనకంగా ఉందని గ్రహించాడు వార్గస్ జోసా. కాని పరిష్కారం చూపించే ధైర్యం చెయ్యలేకపోయాడు. అంటే పెరూ వెనకబాటుతనం కొనసాగా

ల్సిందే. దోపిడీ, అవినీతి, బంధుప్రీతి అనే 'మానవులు సృష్టించిన మానవాతీత శక్తులు' సంపద సృష్టికర్తలను పీల్చిపిప్పి చేయాల్సిందే. నిజానికి ఉత్తర అమెరికా, యూరోప్‌లకు వర్తించిన 'మధ్యతరగతి' అనే మాట పెరూకు అంతగా వర్తించదు. కాకపోతే వాళ్ల బతుకులు పేదలకన్నా రవ్వంత మెరుగు. ఈ ఆర్థిక అసమానతలే సాంస్కృతిక వివక్షతకు కూడా ప్రధాన కారణమన్నారు జోసా మరోచోట. స్థానిక ఇండియన్ (తెగ)లనూ, నల్లవాళ్లనూ సంకరజాతి వాళ్లంటారు ధనికులు. అంత ర్యుద్ధానికి ముందర ఉత్తర అమెరికా, దక్షిణాది రాష్ట్రాల తెల్లవాళ్లు, నల్లవాళ్ల పట్ల యిలాంటి వివక్షనే ప్రదర్శించారు.




సాంటియాగోలాగ, జోసా కు కూడా ధనిక వర్గం జలగ లాంటిదనీ, పేదల నెత్తురుతాగుతున్న డ్రాకులా లాంటిదనీ.. అసహ్యం, ద్వేషం. కానీ ఈ దోపిడీ వ్యవస్థకు ప్రత్యామ్నాయాన్ని వహించటానికి ఇష్టపడలేదు. తన హీరోలాగా, జోసాకు కూడా మార్క్సిజం ఈ సమస్యలన్నింటికీ పరిష్కారం చూపిస్తుందని తెలుసు- కాని, ఆచరణలో అదీ ఓ మతంలాగా మారిపోయింది. అక్కడా అవిశ్వాసులను వెలేస్తారు. సైబీరియాకు పంపిస్తారు. దేశ బహిష్కరణ చేస్తారు. లేదా కాన్‌సంట్రేషన్ క్యాంపుల్లో కుక్కి సజీవ సమాధి చేస్తారు. అన్ని మత విశ్వాసాలకూ వ్యతిరేకం జోసా. నియంతృత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటుని ఇష్టపడ్డాడు గాని, తిరుగుబాటుదార్లు తరువాత అధికారంలోకి వస్తే జరిగే పరిణామాలకు సిద్ధపడలేదు. క్రైస్తవమూ, కమ్యూనిజమూ ఏదో ఒక రకంగా దోపిడీ వ్యవస్థకు పునాదులుగా ఉన్నాయి. ప్రశ్నించటాన్ని ఈ 'కులాలు' ఒక నేరంగానే పరిగణిస్తాయి. అది నిర్హేతుకమైన బానిసత్వం. పోలిష్ నోబెల్ బహుమతి గ్రహీత చెస్లామిలోస్ కూడా ఇలాంటి పరిస్థితినే ఎదుర్కొన్నాడు. సమసమాజం కోసమని విప్లవంలో పాల్గొన్నాడు. తరువాత కమ్యూనిస్టు ప్రభుత్వంలో చేరాడు. కాని అక్కడా భ్రమలు తొలగి వాళ్లతో విడిపడ్డాడు. మొదట క్యూబాను, క్యాస్ట్రోను సమర్థించిన జోసా 1971లో క్యూబన్ విప్లవం వల్ల మంచి జరగలేదని స్వతంత్ర పత్రిక లిబర్ (ఫ్రీ)ను ప్రారంభించాడు. రైటిస్టులు, లెఫ్టిస్టులిద్దర్నీ వ్యతిరేకించాడు. ఐడియాలజీ కాదు. సామాజిక న్యాయం ముఖ్యమన్నాడు. కాల్పనిక రచనల్లో రాజకీయ నిబద్ధత ఉండకూడదని వాదించాడు. రాజకీయ వధ్యశిల మీద కళను బలి చెయ్యొద్దన్నాడు. ఇంచుమించు ఈ అభిప్రాయాలన్నీ ఈ నవలలో సాంటియాగో ద్వారా మనకు తెలుస్తాయి. అయితే బాల్జాక్ ప్రభావంతో కాబోలు, కథాకథన పద్ధతి పందొమ్మిదో శతాబ్ది రచనా శైలిని తలపిస్తుంది. గేబ్రియెల్ గర్సియా మార్క్వెజ్ గురించి పరిశోధనా పత్రం సమర్పించిన జోసా పాత పద్ధతిలో రాయాలనుకోవటం సాహసమే. కాని, ఈ శైలీ విన్యాసాలు లేకపోవటమే ఈ నవల ప్రాచుర్యానికి కారణం.

జోసా రాసిన తొలి రాజకీయ నవల కాన్వర్జేషన్. ఈ ఒరవడిలోనే వచ్చిన ఈయన నవలలు 'ది రియల్ లైఫ్ ఆఫ్ అలెంగ్జాండ్రో మేటా, ది వార్ ఆఫ్ ది ఎండ్ ఆఫ్ ది వరల్డ్' మొదలైనవి.

**– ఎం. వసంత**




అరవింద

# జీవనది

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**భారతదేశ స్వతంత్రపోరాట కాలాన్ని తెలిపే నవలలు తెలుగులో తక్కువ. కొన్ని ఉన్నా, వాటిలో చాలావరకూ తేదీలు, ఉద్యమ వివరాలు, ఉపన్యాసాల్లాంటివే ఎక్కువ. దేశభక్తి, స్వతంత్ర పోరాట ప్రభావం, సామాన్య కుటుంబాల మీద కలిగించిన ఒత్తిడి, తద్వారా అనుభవించిన కష్టసుఖాల్ని విపులంగా చూపించిన నవల 'జీవనది'. ఈ నవల 2002లో వచ్చింది. తన చిన్ననాటి అనుభవాలని జోడించి గాంధీజీ మీద వున్న భక్తికి ప్రతిరూపంగా దీన్ని రాశానని రచయిత్రి అరవింద 'ముందుమాట'లో చెప్పారు.**

'జీవనది' నవలలో కథ చిన్నదే అయినా, విషయ వివరణ విస్తృతమైంది. జీవితానికి మౌలికమైన ధర్మం, నీతి, దేశభక్తి, త్యాగం, నిస్వార్థం లాంటి పలు సాంఘిక ధర్మాల ప్రభావం ఎలా వుంటుందో? వ్యక్తుల ప్రవర్తన ఎలా మారుతుందో? చూపింది. వ్యక్తిగత జీవితంలోని కష్టసుఖాలను నిశితంగా చిత్రించటం వల్ల ఆ కాలం నాటి జనజీవితాన్ని కళ్ళ ముందు నిలిపింది.

అరవింద తమ గత జీవితాన్ని పునశ్చరణ చేసుకుంటున్నట్టుగానే ఈ నవల రాశారు. ఈ నవలా శిల్పం కూడా అదే తీరులో వుంది.

'జీవనది' సూర్యప్రకాశరావు జీవనగాథ. వృద్ధాప్యంలో కూతురి దగ్గరకి అమెరికా వెళ్లటం దగ్గర నవల ఆరంభమవుతుంది. అమెరికా, భారతదేశాల సంస్కృతుల్నీ, జీవన రీతుల్నీ బేరీజు వేసుకుంటూ సాగిన ఆలోచనల్లో ఆయనకి తన గత జీవితం గుర్తొస్తుంది. చివరికి నూతన నిర్ణయాలతో, నిబద్ధతతో భారతదేశం తిరిగి వస్తాడు. ఈ నవలలో స్థూలంగా కథ ఇదే అయినా.. అరవై, డెబ్బై ఏళ్ల జీవితం వుంది. జీవితంలోని పలు సందర్భాల్లో కలిగిన భావనలు, తీసుకున్న నిర్ణయాలు, సంఘర్షణల ఫలితాలు చిన్నచిన్న వ్యాక్యాల రూపంలో ఎన్నో ఉన్నాయి. అవే ఈ నవలకి ప్రత్యేకతని సంతరించిపెట్టాయి.

ఈ నవల కథానాయకుడు సూర్యప్రకాశరావు లక్ష్మీనారాయణగారి రెండో అబ్బాయి. పెద్దకొడుకు శ్రీనివాసరావు. ఇంకా అప్పటికి స్వాతంత్ర్యం రాలేదు. కాంగ్రెసు కార్యకలాపాలు ముమ్మరంగా సాగుతున్న రోజులవి. సూర్యప్రకాశరావు కాంగ్రెస్ కార్యకర్త.. నిజాతీపరుడు. పార్టీ అంటే ప్రాణం. రాజమండ్రిలో కాంగ్రెసు సేవలో వుంటున్నాడు. బావమరిది తిలక్ పెళ్ళికి తప్పనిసరయి స్వగ్రామం తూర్పుగోదావరి జిల్లాలోని మానేపల్లికి వచ్చాడు.

సూర్యప్రకాశరావుకి అంతకుముందే పెళ్ళయింది. భార్య దుర్గ.. మేనరికం. పెళ్ళయి చాలాకాలమే అయినా కార్యం జరగలేదు. అది కాస్తా జరిపించేసి, కొడుకుతో కాపురం పెట్టించాలని సూర్యప్రకాశరావు తల్లి మాణిక్యాంబగారి తాపత్రయం. ఈసారీ ఆ వివరాలతోటే ఆవిడ ఉత్తరం రాసింది.

భార్యతో కాపురం పెట్టి, స్వసుఖం చూసుకోటం ఓ రకంగా దేశద్రోహం అన్న విశ్వాసం సూర్యప్రకాశరావుది. అందుకే ఆ కార్యాన్ని వాయిదా వేస్తున్నాడు.

'తిలక్ పెళ్ళికి ఎలాగైనా వీలు చేసుకుని తప్పకుండా రావలసింది. గుళ్ళో దీపం వెలిగిస్తే, ఇంట్లో దీపం వెలిగించనవసరం లేదనుకోకు! పరీక్షలని, మీటింగులని వంకలు చెప్పకు. పునస్సంధానం ముహూర్తం పెట్టించాను. ఈ శుభ కార్యం ఆపటం ఇంక మంచిది కాదు' తల్లిరాసిన

## కథాకథనంలో కొత్త ఒరవడి



అన్నంరాజు సుగుణమణి 'అరవింద' అన్న కలం పేరుతో సుప్రసిద్ధులు. అనేక కథలు, నవలలు రచించి ఎన్నో పురస్కారాలు పొందారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి 2001లో 'అరవింద కథలు' అన్న గ్రంథానికి 'రచయిత్రి ఉత్తమ గ్రంథం' పురస్కారం అందుకున్నారు. ఇందులో ఇరవై కథలున్నాయి. మరో పదహారు కథలతో 'అరవింద కథలు- 2' అనే పుస్తకాన్ని ప్రచురించారు.

అరవింద గాంధీజీ భక్తురాలు. ప్రధానంగా ఆ ప్రేరణతోనే 'జీవనది' నవల రచించారు. 'గాంధీజీ మీద తనకున్నది భక్తి అని, భక్తులు తమ దేవుడిలో తప్పులు ఎంచరని వివరణా ఇచ్చారు.

తన గత జీవితాన్ని పునశ్చరణ చేసుకుంటున్నట్లు 'జీవనది' నవలలో అద్భుతమైన శిల్పాన్ని ప్రదర్శించారు. సజీవ పాత్ర చిత్రణతో స్వాతంత్ర్యపోరాట ఘట్టాల్ని నవలీకరించి సాహిత్య జగత్తులో కొత్త ఒరవడి దిద్దారు అరవింద. చిన్నచిన్న వాక్యాల్లో జీవిత తత్వాన్ని ఆవిష్కరించడంలో ఈ రచయిత్రి సిద్ధహస్తులు. అందుకు 'జీవనది' నవలే ఒక ఉదాహరణ. కేవలం చరిత్రను ఎక్కించడం కాక అద్భుతమై కథతో నాటి ఘట్టాల్ని విలీనం చేసి పాఠకుల హృదయానికి హత్తుకునేలా చెప్పడంలో విజయం సాధించారు.

ఉత్తరం గుర్తొచ్చింది సూర్యానికి. దేశం తర్వాతే ఇలాంటివన్నీ.. అని అతని దృఢనిర్ణయం.

ఇది దేశానికి, సమాజానికి సంబంధించినంత వరకూ పెద్దసమస్య కాదు. ఆ స్థాయిలో దాన్ని గణించరు కూడా. కానీ వ్యక్తిగత స్థాయిలో, కుటుంబస్థాయిలో ఇది ఎంత తీవ్రమైందో రచయిత్రి అరవింద చాలా లోతుగా చూపించారు 'జీవనది' నవలలో.

కాంగ్రెస్‌లో చేరి సేవ చెయ్యటం, దేశవిముక్తికి పోరాడటం తప్పని ఎవరూ అనరు. బాహాటంగా పొగుడుతారు కూడా! పెళ్ళయి చాలాకాలమైనా, పెళ్ళికానిదానిలా దూరంగా ఉంచడం వల్ల ఆ భార్య ఎంతటి మానసిక హింసకు గురవుతుందో ఎవరూ పట్టించుకోరు! భర్త చేస్తున్న ఆ చర్యని ఖండించరు. పరస్పర విరుద్ధమైన విలువలివి. ఈ ద్వంద్వనీతిలో వ్యక్తులు నలిగిపోతారు.

భార్యాభర్తల మానసిక ఘర్షణను ఎంతో విపులంగా చిత్రీకరించారు అరవింద. భర్తంటే దుర్గకి ప్రాణం. అతని చర్యలు ఆమెకి తప్పుగా అనిపించవు. తనంటే భర్తకి అంతగా ఇష్టం లేదేమో అన్నది ఆమె అనుమానం. భార్య దుర్గంటే బాగా ఇష్టం సూర్యానికి. ఆమె పట్ల అభిమానంతో పాటు, సంసారం పట్ల కాంక్షా వుంది. కానీ దేశభక్తికి అది అవరోధమన్న విశ్వాసం.

ఈ సంఘర్షణ సమాజపరమైంది. కానీ బాధ వ్యక్తిగతమైంది. 'జీవనది' నవలలో ఇలాంటి సున్నితాంశాలు, విభిన్న సంఘర్షణలూ చాలా వున్నాయి. ఉద్యమ ఆవేశంలో ఊగిపోవటమే వ్యక్తి లక్షణంగా వచ్చిన నవలలకి ఇది భిన్నమైంది.

తిలక్ పెళ్ళికి హాజరై, కార్యం చేసుకోకుండానే సూర్యం తిరిగి రాజమండ్రి వెళ్ళిపోయాడు. ఒకవైపు కాంగ్రెసు ఉద్యమం.. మరోవైపు సూర్యం కుటుంబంలో మార్పులు.. ఇలా సమాంతరంగా 'జీవనది' నవల సాగుతుంది.

స్వాతంత్ర్య పోరాటంలోని ముఖ్యఘట్టాలు, మహాత్మాగాంధీజీ వ్యవహార దక్షత, తెలుగుదేశానికి ఆయన వచ్చినపుడు పెల్లుబికిన ఉత్సాహం ఇలా ఈ నవలలో అప్పటి సంఘటనలన్నీ వున్నాయి. అలా అని 'జీవనది' ఓ చరిత్రాత్మక నవల అనిపించదు. నూరుపాళ్ళు సాంఘిక నవలలాగే వుండటం దీని ప్రత్యేకత.

మానేపల్లి నుంచి చదువు కోసం సూర్యం రాజమండ్రి వెళ్ళాడు. అక్కడే దేశభక్తి గురించి, గాంధీజీగారి గురించి చాలా విషయాలు గ్రహించాడు. అప్పటి చాలామంది యువకుల్లాగే బాగా ప్రభావితుడు అయ్యాడు. చదువు మానేసి కాంగ్రెసులో చేరాడు. కొడుకుని పెద్దచదువులు చదివించి పెద్ద అధికారిని చెయ్యాలన్న లక్ష్మీనారాయణగారికి ఆశాభంగం కలిగింది. అయినా ఆయన కొడుకుని ఏమీ అనలేదు.

అంతరాంతరాల్లో దేశభక్తి ఆయనకీ వుంది.

ఎటొచ్చీ ఈ గొడవల్లో తనవాళ్ళకేం కష్టం జరగకూడదు. కానీ దేశం విముక్తం కావాలి. ఇది ఆనాటి ప్రజల్లోని పరస్పర వైరుధ్యాలలో మరొకటి. సూర్యం వేరేచోట.. భార్య దుర్గ మానే పల్లిలో! వీరేకాదు, ఆ రోజుల్లో చాలామంది కుటుంబాలకి దూరమయ్యారు. ఇల్లూవాకిలి, సంసారం కన్నా దేశభక్తినే మిన్నగా భావించారు.

బ్రహ్మసమాజం, ఉప్పుసత్యాగ్రం లాంటి మహత్తర విషయాలు సూర్యంలో బాగా జీర్ణించుకుపోయాయి. బసవరాజుగారి ఆశ్రమంలో సేవా కార్యక్రమాలని మించి ఇంకా ఏదేదో చెయ్యాలని, గ్రామగ్రామాన గాంధీజీ పిలుపు ప్రచారం చెయ్యాలని అనుకున్నాడు.

తండ్రి లక్ష్మీనారాయణ మరణంతో ఆయన కోరిక తీర్చాలని తిరిగి చదువు ఆరంభించాడు. రకరకాల ప్రభావాలు.. అటో అడుగు, ఇటో అడుగు వేశాడు సూర్యం. అయినా దేశభక్తి, స్వతంత్ర పోరాటం అతని వెన్నంటే ఉన్నాయి.




ఈ నవలలో 1857 విప్లవం, 1907లో తిలక్ నాయకత్వం, స్వదేశీ ఉద్యమం, 1930 ఉప్పు సత్యాగ్రహం, రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడటం, వివిధ పోరాటాల ఫలితాలు.. చివరికి దేశ స్వాతంత్ర్యం వరకూ వివిధ ఘట్టాల ప్రసక్తి.. వర్ణనలూ ఉన్నాయి. సమాంతరంగా సూర్యం కథా ఉంది. ఆనాటి సాంఘిక ఉద్యమాల ప్రభావం, భావజాల తీవ్రతతో వ్యక్తులలో వచ్చిన మార్పుల్ని పాత్రల పరంగా భిన్నభిన్న సంఘటనల్లా.. వ్యక్తీకరణల్లా చిత్రీకరించటం ఈ నవలలోని విశేషం.

సూర్యం తల్లీ మరణించింది. అతని దుఃఖం అంతా ఇంతా కాదు. ఆవిడ బతికుండగా జరగని ఆ దంపతుల పునస్సంధానం, ఏ ముహూర్తం లేకుండానే ఆ దుఃఖంలో అసంకల్పితంగానే జరిగిపోయింది. అలా దగ్గరైన ఆ దంపతులు కొన్ని ఒడిదుడుకుల్లో తిరిగి దూరమైనా, గాంధీజీగారి ఆశ్రమంలో ఆయన ఆశీర్వాదంతో చేరువయ్యారు. సూర్యం గుంటూరులో ఉద్యోగంలో చేరాడు. వారికి సంతానం కలిగింది.

దేశ స్వాతంత్ర్యానంతరం గాంధీజీ హత్య జరిగింది. దేశమంతా దుఃఖించింది. పదిహేను సంవత్సరాల కాలంలో దేశంలో.. రాజకీయాల్లో.. ప్రభుత్వంలో చాలా మార్పులొచ్చాయి. దేశభక్తి నామమాత్రం అయింది.

సూర్యం పిల్లలందరికీ పెళ్ళిళ్ళు అయ్యాయి. రెండో కూతురు కళ్యాణి అమెరికాలో ఉంటే అక్కడికి వెళ్లాడు. అతనిలో కొన్ని సందేహాలున్నాయి. తాము సర్వస్వం త్యజించి పాల్గొన్న పోరాట ఫలితం ఇంతేనా? గాంధీజీ కలలు కన్న స్వతంత్రం ఇదేనా? అసంతృప్తి తెలుస్తూనే ఉంది.

అమెరికాలో తెలుగువారి భావనల్ని, తన ఆలోచనల్ని, కొత్త అనుభవాలని రంగరించి నూతనోత్సాహంతో తిరిగి గ్రామసేవకి సూర్యం మానేపల్లి ప్రయాణం అవటంతో 'జీవనది' నవల ముగుస్తుంది. పలు రకాల భావజాలాల్ని ప్రతిబింబించే సజీవ పాత్రలు.. మనసుకి-ఆదర్శాలకి మధ్య సంఘర్షణల్లోని సహజత్వం 'జీవనది' నవలని సహజ సుందరం చేశాయి.

'మనుషులు సుఖంగా జీవించాలనే నీతిశాస్త్రాలు, ధర్మశాస్త్రాలు పుట్టాయి'

'1947లో దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది. కానీ స్వరాజ్యం రాలేదు'

'గాంధీజీని ఆధునిక యుగపు 'డెవలప్‌మెంట్ థింకర్' అంటారు. సృజనాత్మక ఆర్థిక తత్త్వవేత్త'

ఇలాంటి ఎన్నో గాఢ భావనల సమాహారం 'జీవనది' నవల.

అప్పటి జీవితంలోని పలు అంశాలు, స్త్రీవిద్య, గృహహింస, ఉమ్మడి కుటుంబంలోని ఆనందం లాంటి ఎన్నింటినో చక్కగా ప్రతిబింబించిన రచన ఇది. పెద్దవాళ్ళు మరణించినప్పుడు, బతికుండగా వారిని సరిగ్గా పట్టించుకోలేదని బాధపడతారు చిన్నవాళ్ళు. మాణిక్యాంబ మరణ సమయంలో ఈ విషయాన్ని చక్కగా చిత్రించారు అరవింద. విజయలక్ష్మి, జానకీదేవి, ఉష పాత్రలు ఈ నవలలో మరీ ప్రత్యేకమైనవి.

గత జీవిత పర్యావలోకనం 'జీవనది' నవల. ప్రస్తుత విలువల్ని పునర్మూల్యాంకనం చేసుకోవటానికి ఉపయోగపడే రచన. ©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ప్రవచన వాచస్పతి,
అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్
సమాధానాలు

ప్ర. భాగవతంలోను, భారతంలోనూ శ్రీకృష్ణు డున్నాడు. ఇద్దరి వ్యక్తిత్వంలో వైవిధ్యం కనిపిస్తోంది. ఎవరిని ఆదర్శంగా తీసుకోవాలి?

– బోడపాటి కృష్ణవేణి, చెన్నై

జ. ఒకాయన పోలీసు ఉద్యోగి అనుకుందాం! కరుడుకట్టిన దొంగలు, నేరగాళ్ల మధ్య ఉన్నపుడు ఆయన చాలా మొరటుగా ఉంటాడు. ప్రవర్తన భయంకరంగా ఉంటుంది. భాషతీరు వేరుగా ఉంటుంది. అదే వ్యక్తి ఇంటికి రాగానే భార్య, పిల్లలు, తల్లిదండ్రులు, తోబుట్టువులు, బంధువులు వీరందరితో సౌమ్యశీలిగా ఉంటాడు. ఈ రెండు సన్నివేశాలూ చూచినవారు అతని వ్యక్తిత్వం నాకు అర్థం కావడంలేదు అంటే ఏమనుకోవాలి! భారతంలో కృష్ణుడు, భాగవతము దశమస్కంధములో కృష్ణుడు ఒక్కరే! వేరువేరు పాత్రలు కావు. తత్త్వాలూ వేరుకావు. భాగవతములో కృష్ణుని భగవత్‌తత్త్వము, భక్తుల పట్ల వాత్సల్యము ఇవన్నీ కనిపిస్తాయి. కేవలము భక్తుల చరితకి సంబంధించినదది. భారతంలో కృష్ణపాత్ర విశ్లేషణవేరు. రాజవంశాల మధ్య, ధర్మాధర్మాలమధ్య ఘర్షణ జరిగినపుడు సమాజంలో అందరికీ కావలసిన వ్యక్తి ఎలా ప్రవర్తించాలో చూపింది. నాయకుడు, రాజు అన్నవాడు ఎలా రూపుదిద్దుకోవలసి ఉంటుందో నిరూపించిన వైనం కనిపిస్తుంది. రెండు వ్యక్తిత్వాలకి ఐక్యము కనిపించేది భగవద్గీతలో గమనించండి!

ప్ర. సుబ్రహ్మణ్యా స్వామిని సర్పరూపంలో ఆరాధించడంలో ఆంతర్యమేమిటి? ఆయన ఏ సందర్భంలో సర్పరూపాన్ని పొందాడు?

– తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్

జ. దీనికి ఇదమిత్థముగా ఫలానా అంటూ ఏ పురాణమూ చెప్పలేదు. విష్ణుపురాణంలో సూచన ఉంది. వామనపురాణంలో ఉందీ అని అనడం తప్ప ప్రామాణిక ఆధారంలేదు. బాలుని రూపంలో, షడాననునిగా పరమశివుని పరివారములో ఉన్న రీతిలో పూజలున్నాయి. శ్రీమద్రామాయణం అరణ్యకాండలో అగస్త్యాశ్రమంలో వివిధ దేవతల స్థానాలు వివరంగా ఉన్నా - సుబ్రహ్మణ్యునికి వానిలోనూ లేదు. తరువాతి కాలాలలో తంత్రప్రక్రియ, నవగ్రహాల ఆరాధన ప్రారంభమైన తరువాత, సంతాన విషయక దోషాలకి 'సర్పదోషము' కారణము కనుక, రాహుకేతువులను ఆరాధించాలని తెలిపి, సుబ్రహ్మణ్యుని ఆ రూపంలో ఆరాధించే విధానం వచ్చిందని తాంత్రికులు వివరిస్తారు. సంతానానికి సంబంధించినది విస్తారమైన గాథ. సుబ్రహ్మణ్య స్వామికి తల్లి కావలసి ఉండీ కాలేకపోయింది పార్వతీ అమ్మవారు. తాము కనకుండానే కుమారునికి తల్లులు అయ్యారు కృత్తికలు. జన్మకారణానికి మరెన్నో దశలు. ఇంత చిత్రమైన గాథ ఇది. అదీగాక శంకర, సంకర్షణుల అంశ 'స్వామి' అని వాఖ్యలున్నాయి. 'ప్రతిమా లక్షణము' అంటూ అగ్ని విష్ణుధర్మోత్తరాలలో గాథలు స్వామి గురించి సూచించి వదలిపెట్టాయి. మూలము ప్రాచీన తమిళ గ్రంథాలలో లభ్యపడవచ్చును.

ప్ర. ఉన్నతమైన మానవజన్మలో వాగ్భూషణం అతిశ్రేష్ఠం. మరి వాక్కును ఇతరులను దూషించడానికి ఎందుకు వాడుతున్నారు? దివ్యజ్ఞాన రూపుడైన పరమాత్మను గురించి ఎందుకు విని యోగించడం లేదు?

– టి.వి.డి.ఎస్. సీతారామారావు,
కొత్తగూడెం, ఖమ్మం జిల్లా

జ. అగ్నిః వాక్ భూత్వా ముఖం ప్రావిశన్- అని వేదవాక్యం. శరీరం అంతా దేవతామయం.

# చతుర ప్ర.జ. 11

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు..పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జత పరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

మొదటగా ప్రవేశించే దేవత అగ్ని. నాల్కమీద ఉంటాడు. నాలుక చేసే పనులు రెండు. 'అనుట' 'తినుట'. రెండవ దానిమీదే మొదటిది ఆధారపడుతుంది. ఆహారం పరిశుద్ధమైనప్పుడు, మనసు పరిశుద్ధం అవుతుంది. సత్త్వగుణం కలిగి ఉంటుంది. అప్పుడు సంకల్పశుద్ధి ఉంటుంది. 'యద్ధి మనసా ధ్యాయతి తత్ వాచా వదతి' అని శ్రుతి.

మనసు సంకల్పానికి ప్రతిరూపం. తిండికి మనసుకి సంబంధం ఏమిటి? అనే ప్రశ్నకి ప్రహ్లాదుడు మంచి ఉదాహరణ చెప్పాడు. పాత్రలో పాలుంచి, పాత్రని నిప్పు మీద పెడితే పాలు వేడెక్కుతాయిగదా! మరి పాలకి ప్రత్యక్షంగా అగ్నితో సంబంధం లేకపోయినా, అగ్నివలన వేడెక్కిన పాత్రవల్ల ప్రభావితం అవుతోంది కదా! శరీరము పాత్ర, తిండి అగ్ని. మనసు పాలు. మరి వేడెక్కించే పదార్థాల వలన మనసు చెదురుతుంది. పలికే మాట చెడుతుంది. అందువల్లనే పూర్వీకులు ఆహార నియమాలు ఏర్పరచారు. చిలుక, కోకిల, ఆవు పలుకులకి- కాకి, గద్ద, పులి ధ్వనులకి తేడా ఇందుకే! సత్త్వగుణం కలిగిన వ్యక్తి పలికే సాధారణమైన పదాలు కూడా పరమాత్మని ఆరాధించే వేదమంత్రాలే అవుతాయని పూర్వాచార్యులు చెప్పారు.

*ప్ర. 'పాపి చిరాయువు' అన్నారు కదా! మరి బలి, అశ్వత్థామ మొదలైన సప్తచిరంజీవులూ పాపాత్ములేనా?*

**– బిక్కునూరి రాజేశ్వర్,**
ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా

**జ.** విపర్యయ సిద్ధాంతాలు (రివర్స్ హైపోథీసిస్) అన్నిచోట్లా పనిచేయవు. చిరాయువులు అందరూ పాపులు కారు. నృగమహారాజు అని భాగవతంలో వస్తాడు. వేలాది సత్కార్యాలు చేశాడు. తనకి తెలియకుండా చిన్నపొరపాటుకి కారణం అయ్యాడు. నీవు దేని ఫలం ముందుగా అనుభవిస్తావు? అని అడిగితే, పాపం చిన్నదే గదా, తక్కువ ఫలం ఉంటుందని భ్రమపడి, ఇదే అనుభవిస్తానన్నాడు. వేలాది (పోనీ వందలాది) సంవత్సరాలు ఊసరవెల్లిగా పాడుపడిన బావిలో బతకాల్సివచ్చింది. తరువాత కృష్ణుని స్పర్శతో బయటపడ్డాడు. అయ్యా పాపానుభవం ఎక్కువ కాలం తీసుకొంటుంది. పుణ్యాల ప్రభావం తక్కువ కాలం అనుభవానికి ఉన్నట్లుంటుంది. తీపి తిన్న నోరు మరుక్షణంలో తీపిని మరువగలదు. మిరపకాయ తింటే నోటిమంట ఎంతసేపు ఉంటుందో అనుభవించిన వారికి తెలిసిందే! మరొకటి పాపులు చిరంజీవులుగా ఎక్కువ కాలం ఉండవలసి రావడానికి వారు పుణ్యాత్ములు కావడానికి భగవంతుడిచ్చే అవకాశమని పురాణగాథలు వివరించాయి. పాపానుభవం పోయేంతవరకు గజేంద్రుడు మొసలితో పోరాడాడు అన్ని సంవత్సరాలు. శ్రీహరి దర్శనంతో క్షణకాలంలో పుణ్యం పొందలేదా? భగవంతునికి ప్రీతి కలిగించే కర్మ పుణ్యం, విపరీతమైనది పాపం అని ఒక నిర్వచనం.

*ప్ర. శివుడ్ని లింగ రూపంలోనే ఎందుకు పూజిస్తారు? శివముఖ ప్రతిమ ఉన్న దేవాలయాలు ఉన్నాయా?*

**– నేమాన సుభాష్‌చంద్రబోస్,** విశాఖపట్నం

**జ.** 'లింగ రూపం బ్రహ్మ ద్వారానే ఏర్పడిందట. 'లింగ శబ్దమునకు 'దేనివలన జన్మించును, దేనియందు లీనమగునో అదే'- అని వ్యుత్పత్తి. సంప్రదాయ పద్ధతిలో 'లింగ' రూపానికే ఆరాధనలు. ఆగమ విధానంలో 'లింగార్చన' మాత్రమే

# రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. శ్రీరాముడు సీతాదేవిని అడవులకు పంపడం ధర్మబద్ధమే అయినప్పుడు ఆమెకు నిజం చెప్పి పంపవచ్చుగదా! ఏమార్చి పంపడ మెందుకు?

– వి. ఛాయాదేవి, నాగారం, రంగారెడ్డి జిల్లా

జ. మనలాంటి 'ఆధునిక భావవ్యక్తీకరణ' కల వారికోసం శ్రీనివాసశాస్త్రి అనే స్వాతంత్ర్య సంగ్రామ యోధులు (బహుశా 1946-48 మధ్య) శ్రీమత్ రామాయణముపై మద్రాసులో ఉపన్యాసములు చేస్తూ ఒక మాటన్నారు. వేల సంవత్సరాల గాథలని, పాత్రలని, జీవనరీతులని - ఇరవయ్యో శతాబ్దమును 'మితి' గా ఎంచుకొని మంచి చెడులు బేరీజు వేయకూడదు అని. సీతను ఏమార్చి పంపాడు, మోసం చేశాడు అని మన భావన. శ్రీరాముడు భార్యని వదులుకోలేదు. రాజ్యానికి మహారాణిని మాత్రమే వదులుకొన్నాడు. తేడా ఏమిటి అంటారా? 'భార్యగా' దూరం చేసుకొంటే, యజ్ఞయాగాదులకు అర్హత కలగడానికి మళ్లీ వివాహం చేసుకొని ఉండేవాడు. బంగారుసీత(ల) రూపంలో భార్యనూ నిలుపుకొన్నారు. రాణిస్థానమూ నిలిపారు.

సరే, జరిగింది చెప్పవచ్చు గదా! భార్యాభర్తల సంబంధమైన గొడవలు, అనుమానాలు, వాదాలు, తీర్పులు, సున్నితాంశాలైతే ఈనాటి న్యాయాధికారులు కూడా 'అంతరంగికంగా' నే నడిపిస్తారు గదా! కోర్టులలో అందరి మధ్యా జరిపించరు కదా! 'సీతాపరిత్యాగము'నకు దారి తీసిన సంఘటన బహిరంగ పరచవలసిన అవసరం రామునికి లేదు.

ఉంది. బ్రహ్మ వరుసగా కొండలు, కోనలు వగైరా సృష్టించి- చివరికి సనకాదులని, నారదుని సృష్టించినా సృష్టి ఇబ్బడి ముబ్బడిగా జరగని కారణం చేత క్రోధము కలిగింది. దాంతో కనుబొమలు ముడిపడగా ఆవిర్భవించిన రూపం 'రుద్రుడు'. అర్ధనారీశ్వరునిగా ఆవిష్కరింపబడ్డాడు. సృష్టికొనసాగడానికి 'మిథునసృష్టి' కి అవసరమైన గుర్తు అది అని తెలిసింది. ప్రకృతి, పురుషులు అవిభాజ్యములు. ఒకరు గొప్ప, ఒకరు తక్కువ కారు. ఇద్దరితోనే సృష్టి జరుగుతుంది.. కొనసాగుతుంది అనే భావం ఈ రూపానిది. 'ఆదిదంపతులు' అనే పదం వినగానే మనకి పార్వతి పరమేశ్వరులే మనసుకి వస్తారు. భక్తి ఉత్కటమై తరువాతి కాలాలలో శిల్పుల చేత మహారాజులు, ప్రభువులు లింగాకృతికి ఇతర ఆకృతులు జోడించిన దాఖలాలు మన పొరుగు రాష్ట్రాలలో ఉన్నాయి.

పరమశివుని అవతార రూపాలలో ఇతరరూపాలు ఆరాధించడం రెండవ భాగం! శివపురాణములో, విద్యేశ్వర సంహిత 5వ అధ్యాయంలో వివరించారు.

ప్ర. వాలివధ తరువాత ఆయన భార్య తార 'నువ్వు నీ భార్యను ఎడబాసి ఉందువు గాక!' అని శ్రీరాముని శపించిందంటారు. ఆమెకు శ్రీరాముడ్ని శపించేంత శక్తి ఎలా వచ్చింది?

– యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, హైదరాబాద్

జ. అలా అన్నవారెవరో బహుశా మూలగ్రంథమైన వాల్మీకి రామాయణం చదివినట్లు లేదు. చదివినా, ముందు కథని దృష్టిలో పెట్టుకొని, తారమీద సానుభూతితో, రాముడు అన్యాయంగా ప్రవర్తించాడన్న భావనతో మార్పుచేసి కథలు పలికి ఉండవచ్చు. తార పాతివ్రత్యం 'అగ్గించడానికి' (ప్రముఖంగా చెప్పడానికి) రాసి ఉండవచ్చు. ఇలాంటి కాగితపు పూలకి చాలా ఆదరణ ఉంది.. అసలు పువ్వుల కంటే!

వాలి యుద్ధానికి బయలు దేరే వేళ తార విశదీకరించింది రామతత్త్వాన్ని 'నివాసవృక్షః సాధూనాం, ఆపన్నానాం పరాంతతిః' -మంచివారికి నీడ యిచ్చే చెట్టు, ఆపదలోని వారికి కాపు దల! రామునికి ఇలా శాపాలు పెట్టడం లాంటివి కొన్ని ప్రమాణాలకి అందని ఉపపురాణాలు, అనువాదాలలో కలిసిపోయాయి. సరే జానపదులు వారి పద్ధతిలో ఆయాపాత్రలని మలచుకొని గానం చేశారు.

ఆధునికులలో కూడా ఆంగ్లభాషాప్రాభవము పొంది, ఆ ప్రభావం చేత దుష్టపాత్రలని ఉదాత్త పాత్రలుగా, సహాయక పాత్రలని ప్రధాన పాత్రలుగా చేసి ప్రచారం చేయడం ప్రముఖంగా 19వ శతాబ్దంలోనే ప్రారంభం అయింది. ఏతావాతా తార రాముని శపించిన దాఖలాలు లేవు. వాల్మీకి రామాయణమే ప్రమాణము. ©

22

# భామనే.. సత్యభామనే..!

రియాలిటీ షో 'బిగ్ బాస్'తో తనని తాను పరిచయం చేసుకుంది. అలా కథానాయిక అవకాశాలనూ సొంతం చేసుకుంది. 'జిస్మ్ 2'తో బాలీవుడ్‌లోకి అడుగుపెట్టి 'రాగిణి ఎమ్మెమ్మెస్ 2'తో ప్రేక్షకుల హృదయాల్లో పదిలమైన స్థానాన్ని సంపాదించుకుంది. భర్త శిక్షణలోనే జిమ్, యోగా వంటి వ్యాయామాలు చేస్తూ అందం, ఫిట్‌నెస్‌లను మెరుగుపరుచుకుంటోంది. ఇంతకీ ఎవరా నాజూకు చిన్నది.. అంటున్నారా? ఇంకెవరు.. హాట్‌హాట్ సన్నీ లియోన్! ఆమె తన సొగసు రహస్యాలిలా వివరిస్తోంది..

## సొగసు చూడతరమా...



జిమ్‌కు వెళ్లడమంటే చాలా ఇష్టం. కుదిరితే ప్రతిరోజూ లేదంటే వారానికి కనీసం రెండుమూడు సార్లైనా జిమ్‌కు వెళ్తాను. అందుకు ఒకటి నుండి రెండు గంటల సమయం వెచ్చిస్తాను. ఆరోగ్యం, ఫిట్‌నెస్ కావాలనుకుంటే జిమ్‌కు వెళ్లడం చాలా అవసరమని నా అభిప్రాయం.. అది కూడా క్రమం తప్పకుండా. ఇతర ప్రదేశాల్లో షూటింగ్ ఉన్నపుడు జిమ్‌కు వెళ్లడం కుదరదు కాబట్టి యోగా చేస్తుంటాను. స్క్వాట్స్ కూడా చేస్తుంటాను. ఇది కాళ్లను సన్నబరిచి దృఢపరుస్తాయి. సెటప్స్, పుషప్స్, బుటప్స్ వంటి వ్యాయామాలూ చేస్తుంటాను. ఇవన్నీ నా శరీరానికి భిన్నత్వాన్ని కల్పించి నాజూగ్గా కనబడేలా చేస్తాయి. ప్రతిరోజూ 20 నుండి 30 నిమిషాలు వాకింగ్ తప్పనిసరిగా చేస్తాను. ప్రయాణ సమయాల్లో యోగా చేస్తుంటాను.

చక్కని శరీరాకృతి కోసం తక్కువ తినడం లేదంటే ఉపవాసాలుండడం సరికాదు. అలాగని ఏది పడితే అది లాగించడమూ మంచిది కాదు. కొన్ని సూత్రాలు పాటిస్తూ సరైన మోతాదులో ఆహారం తీసుకోవడం వల్ల అందంతో పాటు చక్కని శరీరాకృతి మన సొంతమవుతుంది. నా ఆహారం విషయంలో కచ్చితమైన ప్రణాళిక పాటిస్తాను.

ప్రతిరోజూ కొబ్బరినీళ్లు తాగుతాను. నూతనోత్సాహం పొందడమేకాక ముఖంలో చక్కని కాంతి వస్తుంది. అల్పాహారం తరువాత పాలు తప్పనిసరి. రాత్రి భోజనం తర్వాత పాలు తీసుకుంటే ఒక్కోసారి జీర్ణ సమస్యలు తలెత్తే అవకాశముంది. ఎక్కువగా తాజా కూరగాయలు, పండ్లు తింటాను. నా



స్నాక్స్‌లో ఎక్కువగా సలాడ్ ఉంటుంది. పీచుప దార్థం, ప్రోటీన్లు ఎక్కువగా కలిగి ఉండడం వల్ల అవి సన్నబరుస్తాయి. స్నాక్స్‌లో వంద క్యాలరీలు మించకుండా జాగ్రత్తపడతా. చల్లబరిచిన పదార్థాలు, ప్యాకింగ్ పదార్థాలకు దూరంగా ఉంటాను. బ్లాక్ కాఫీ అంటే చాలా ఇష్టం. మంచినీళ్ల బాటిల్ ఎపుడూ పక్కనే పెట్టుకుంటా. ఎక్కువగా నీరు తాగడం వల్ల ఒంట్లోని విషపదార్థాలు తేలికగా బయటికి వెళ్లిపోతాయి.

ఆత్మవిశ్వాసం, సానుకూల దృక్పథం, ముఖంలో చిరునవ్వు మనిషిని మానసికంగా దృఢపరుస్తాయి. అవి శారీరక ఆరోగ్యానికీ దోహదం చేస్తాయి.

సేకరణ : సంధ్యారాణి

## మహిళా శక్తి



**జీవితంలో రిస్కు తీసుకోకపోతే మరింత రిస్కులో పడతాం**

– ఎరికా జాంగ్



**మన గురించి ఏదో ఒకటి మాట్లాడుకునే ప్రతి ఒక్కరినీ ఆపుతూ పోతే లక్ష్యానికి దూరం అవుతాం.**

– జాకీ జాయ్‌నర్ కెర్సె

## టెక్ గురూ!

### గూగుల్ ట్రాన్స్‌లేట్

మనకు కావలసిన సమాచారం కోసం ఇంటర్‌నెట్‌లో వెతుకుతుంటాం. అది కూడా మనకు తెలిసిన భాషల్లోనే. అయితే ఇపుడు ఇతర భాషల్లో నుంచి కూడా మనకు కావలసిన సమాచారాన్ని సేకరించవచ్చు! ఇతర భాషల వార్తలనూ చదవొచ్చు! భాష తెలియకుండా ఎలా సాధ్యం? అనుకుంటున్నారా? గూగుల్ ట్రాన్స్‌లేట్ యాప్‌తో! అవును ఇపుడు ఇతర ఏ భాషలో ఉన్న విషయాన్నైనా ఈ యాప్‌తో మనకు తెలిసిన భాషలోకి మార్చుకోవచ్చు. అలా తొంభై భాషల్లో ఏ భాషలో ఉన్న విషయాన్నైనా మరో భాషలోకి మార్చుకోవచ్చు. పత్రాలు, కాగితాల రూపంలో ఉన్న విషయాలను, ఆడియోలను కూడా ఇతర భాషలోకి మార్చే సౌకర్యముంది!




### మై నేమ్ రింగ్‌టోన్ మేకర్

మనకిష్టమైన పాటలు లేదా మ్యూజిక్‌ను రింగ్‌టోన్‌గా పెట్టుకుంటున్నాం. దానికి బదులు మన పేరే రింగ్‌టోన్‌గా పెట్టుకుంటే.. అన్న ఆలోచన వచ్చిందా మీకెపుడైనా? అయితే మీ ఆలోచనను పసికట్టారు కాబోలు అందుకు వీలుగా ఓ యాప్‌ను తయారు చేశారు. అదే మై నేమ్ రింగ్‌టోన్ మేకర్! మీకు ఎవరైనా ఫోన్ చేసినపుడు మిమ్మల్ని పిలుస్తున్నట్లు మీ పేరుతో రింగ్‌టోన్ వస్తుంది. ఈ యాప్‌తో మీకిష్టమైన పేర్లతో రింగ్‌టోన్ చేసుకుని ఉపయోగించుకోవచ్చు.

ఈ యాప్‌లను గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

# సౌ
# య
# గం



## శీతాకాలంలో.. చర్మసౌందర్యం!

చలికాలంలో వాతావరణం పూర్తి భిన్నంగా ఉంటుంది. చాలామందికి చర్మంపై పగుళ్లు ఏర్పడి దురద వస్తూ ఉంటుంది. ఈ కాలంలో పగుళ్లు లేకుండా మృదువుగా ఉండే చర్మం కోసం ఇంట్లో లభించే వస్తువులు, పదార్థాలతో కొన్ని చిట్కాలు..

★ బాగా పండిన బొప్పాయి, అరటి గుజ్జులను తీసుకుని అందులో రెండు టేబుల్ స్పూన్లు తేనె వేసి బాగా కలిపిన మిశ్రమాన్ని ముఖం, శరీరానికంతటికీ రాసుకోవాలి. తరచూ ఇలా చేయడం వల్ల చర్మం మృదువుగా ఉండడమే కాదు, ముడతలు పడకుండా ఉంటుంది.

★ ఒక టేబుల్ స్పూను బాదంపొడి, రెండు టేబుల్ స్పూన్లు పాలు కలిపిన ముద్దను ముఖానికి రాసుకోవాలి. పదినిమిషాల తర్వాత నెమ్మదిగా మసాజ్ చేసి నీటితో కడుక్కోవాలి. బాదమ్‌లో విటమిన్ ఇ పుష్కలంగా ఉంటుంది. పాలు సహజ మాయిశ్చరైజర్‌లా పనిచేస్తాయి.

★ పెరుగు, మజ్జిగ సమభాగాల్లో తీసుకుని బాగా కలిపి శరీరానికి పట్టించాలి. ఇరవై నిమిషాల తర్వాత నీటితో కడగాలి. మజ్జిగలో ఉండే లాక్టిక్ ఆమ్లం చర్మంపై ఏర్పడే పగుళ్లను నివారిస్తుంది.

★ గ్లిజరిన్ సహజ మాయిశ్చరైజర్. నిర్జలీకరణను అదుపు చేసి చర్మాన్ని మృదువుగా ఉంచుతుంది.

★ పగిలిన పెదాలు, చర్మానికి, పాదాలకు చక్కని మందు పెట్రోలియం జెల్లీ. చక్కని మాయిశ్చరైజింగ్ గుణం కలది.

★ రెండు కోడిగుడ్లలోని పసుపుపచ్చ సొనలు తీసుకుని అందులో రెండు చుక్కల ఆలివ్ ఆయిల్ వేసి బాగా కలపాలి. ఈ మిశ్రమాన్ని ముఖానికి రాసుకుని ఇరవై నిమిషాల తర్వాత నీటితో కడుక్కోవాలి. ఆలివ్ ఆయిల్‌లో యాంటి ఆక్సిడెంట్స్, విటమిన్ ఇ, కెలు పుష్కలంగా ఉంటాయి. గుడ్డులోని మధ్యభాగం చర్మాన్ని మృదువుగా చేస్తుంది. వారానికి రెండు సార్లు ఇలా చేయడం వల్ల చలికాలంలోనూ చర్మం కాంతిమంతంగా ఉంటుంది.

★ అవకాడా(పండు)లో సగభాగాన్ని గుజ్జుగా చేసి దానిలో రెండు టేబుల్ స్పూన్లు తేనె కలపాలి. ఆ మిశ్రమాన్ని ముఖానికి రాసుకుని ఇరవై నిమిషాల పాటు ఉంచుకోవాలి. తర్వాత నీటితో కడిగేసుకోవాలి. పొడి చర్మానికి చక్కగా పనిచేస్తుంది.

★ ప్రతిరోజూ రాత్రి పడుకునే ముందు కొబ్బరినూనె రాసుకోవడం వల్ల చర్మం పొడిబారకుండా ఉంటుంది. కొబ్బరినూనెలో ఉండే ఫ్యాటీ ఆమ్లాలు శరీరంలోని తేమ బయటికి పోకుండా నియంత్రిస్తాయి.

★ పొద్దుతిరుగుడు నూనె పొడిచర్మానికి చక్కని మందు. దీనిలో ఉండే విటమిన్లు, ఫ్యాటీ ఆమ్లాలు చర్మం మృదువుగా ఉండేందుకు తోడ్పడతాయి.

# జతపరచండి

ఇక్కడ జాతీయ అవార్డు పొందిన కొన్ని తెలుగు సినిమాలు వాటికి
దర్శకత్వం వహించినవారి పేర్లు ఉన్నాయి.
ఏ సినిమా ఎవరి దర్శకత్వంలో వచ్చిందో చెప్పగలరేమో చూడండి..

| | |
|---|---|
| 1. బంగారు పాప | ఎ. బి. నర్సింగ్‌రావు |
| 2. మాంగల్యబలం | బి. కె. విశ్వనాథ్ |
| 3. జయభేరి | సి. కృష్ణవంశీ |
| 4. మనుషులు మమతలు | డి. ఎస్. ఎస్. రాజమౌళి |
| 5. మట్టిలో మాణిక్యం | ఇ. ప్రకాశ్ కోవెలమూడి |
| 6. రంగుల కల | ఎఫ్. బి.ఎన్. రెడ్డి |
| 7. స్వాతి ముత్యం | జి. పి. పుల్లయ్య |
| 8. సిందూరం | హెచ్. బి.వి. ప్రసాద్ |
| 9. బొమ్మలాట | ఐ. ఆదుర్తి సుబ్బారావు |
| 10. ఈగ | జె. ప్రత్యగాత్మ |

జవాబులు ఈ సంచికలోనే..




### అమ్మ దగ్గరికే!

భర్త: బట్టలు సర్దుకుంటున్నావు ఎక్కడికెళ్తున్నావు?

భార్య: మా అమ్మ దగ్గరకి.

భర్త కూడా బట్టలు సర్దుకోవడం మొదలు పెట్టాడు..



భార్య : మీరెక్కడికి బయలుదేరారు?

భర్త: మా అమ్మ దగ్గరికెళ్తున్నాను.

భార్య: మరి పిల్లలు?

భర్త: నువ్వు మీ అమ్మ దగ్గరికెళ్తున్నావు, నేను మా అమ్మ దగ్గరికెళ్తున్నాను. అలాగే వాళ్లూ వాళ్ల అమ్మ దగ్గరికే వెళ్తారు!

### ఎందుకు?



భార్య: పెళ్లిలో ఎడమ పక్కన పెళ్లికూతురు, కుడిపక్కన పెళ్లికొడుకు కూర్చోవాలంటారు ఎందుకని?

భర్త: లాభనష్టాల సూత్రం ప్రకారం ఆదాయం కుడిపక్కన, ఖర్చులు ఎడమపక్కన ఉంటాయి.. అందుకే!

### నాక్కూడా..!



రవి: ఐ లవ్ యు.. నువ్వంటే నాకు చాలా ఇష్టం!

ప్రియ: అవునా! మనిద్దరి ఇష్టాలూ ఒకటే. నాకు కూడా నేనంటే చాలా ఇష్టం!

## చిటికెలో రుచిగా..!

# చాక్‌లెట్ కేక్

### కావలసిన పదార్థాలు

- మైదా - 200 గ్రాములు
- నెయ్యి లేదా వెన్న - 60 గ్రాములు
- పంచదార పొడి - 100 గ్రాములు
- కండెన్స్‌డ్ మిల్క్ - 200 గ్రాములు
- చాక్లెట్ పౌడర్ - 50 గ్రాములు
- బేకింగ్ పౌడర్ - 1 టీ స్పూను
- ఉప్పు - 1/4 టీ స్పూను

### తయారుచేసే విధానం

ముందుగా కేకు తయారుచేసే పాత్రకు లోపల నెయ్యి లేదా వెన్న రాసి ఒక టీ స్పూను మైదా పాత్ర అంతటా చల్లాలి. మైదా జల్లించి అందులో ఉప్పు, బేకింగ్ పౌడర్, కలపాలి. ఒక గిన్నెలో పాలు, నెయ్యి, పంచదార తీసుకుని బాగా కలపాలి. తర్వాత దానిలో మైదా, చాక్లెట్ పౌడర్ వేసి ఉండలు కట్టకుండా బాగా కలపాలి. ఇందులో జీడిపప్పు, బాదం పప్పు పలుకులు కలుపుకోవచ్చు. ఇపుడు కేకు మిశ్రమాన్ని నెయ్యి రాసిన పాత్రలో వేయాలి.



కుక్కర్‌లో ఒక కప్పు ఉప్పు వేసి సమం చేయాలి. రెండునిమిషాలు కుక్కర్‌ను ఎక్కువ మంట మీద ఉంచి ఆ తర్వాత కేకు పాత్రను కుక్కర్‌లో పెట్టాలి. విజిల్ లేకుండా కుక్కర్ మూత పెట్టి సిమ్‌లో నలభై నిమిషాల పాటు ఉంచాలి. ఉప్పు వేయడం వల్ల కేకు మాడకుండా ఉండడమే కాదు, కుక్కర్‌లో వేడి సమంగా ఉంటుంది. నలభై నిమిషాల తర్వాత కేకులో చాకు గుచ్చినపుడు దానికి ఏమీ అంటకుండా ఉంటే కేకు పూర్తిగా ఉడికినట్లే. బయటకు తీసిన కేకును కావలసిన పరిమాణంలో, ఆకారంలో కోసుకుని ఆరగించడమే!

---

**జతపరచండి జవాబులు :** 1. ఎఫ్, 2. ఐ, 3. జి, 4. జె, 5. హెచ్, 6. ఎ, 7. బి, 8. సి, 9. ఇ, 10. డి

## చిట్కాలక్ష్మి

- హారతి కర్పూరం డబ్బాలో నాలుగు మిరియపు గింజలు వేస్తే బిళ్లలు కరిగిపోకుండా ఉంటాయి.
- కొత్తబియ్యం వండేపుడు కొద్దిగా ఉప్పు వేస్తే ముద్దగా అవకుండా పొడిగా ఉంటుంది.
- కూరగాయలను పాలిథీన్ కవర్‌లో వేసి ఫ్రిజ్‌లో పెడితే ఎక్కువరోజులు తాజాగా ఉంటాయి.



## చతురంగం - 56 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప | 2 రో | ప | 3 కా | 4 ర | ము | | 5 శా | 6 స | నం |
| 7 రా | జా | | 8 య | త్నం | | 9 శి | ఖ | రం | |
| శ | | 10 ప | ము | | 11 సా | రో | | 12 గు | 13 డి |
| 14 రు | ధి | రం | | 15 లా | లా | జ | లం | | పి |
| డు | | 16 ప | లా | స | | ము | | 17 ప | రా |
| | 18 చె | ర | | 19 కు | 20 క్క | | 21 సా | ర | |
| 22 న | వ్వ | | 23 ని | | 24 తి | 25 లో | ద | కా | లు |
| | 26 వి | 27 నో | ది | ని | | కా | | ల | |
| 28 వి | లో | మ | ము | | 29 మ | యు | డు | | 30 తే |
| 31 తా | పు | | 32 కు | రు | | క్త | | 33 పూ | జ |

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**లోకె పుష్పలత**
C/o లోకె గణపతి,
7-64, మార్కెట్ రోడ్,
మంథని,
కరీంనగర్ జిల్లా

## సరైన సమాధానాలు రాసిన వారు

1. అడపా సత్యనారాయణ బాబ్జి, కూకట్‌పల్లి, 2. ఎస్.టి.పి జ్యోతీకృష్ణ, నాగోలు, 3. సముద్రాల సంతోష్‌కుమార్, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 4. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 5. రాంపల్లి శ్రీవర్ధని, సరూర్‌నగర్, 6. యు. జాన్సీలక్ష్మి, న్యూ పాల్వంచ, 7. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్. 8. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 9. ధరణి పద్మాసన, నల్లకుంట, 10. డా.సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 11. ఎస్. నాగశ్వేత, బెంగళూరు, 12. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 13. ఎస్. ప్రేమలత, ప్రగతినగర్, 14. చింతలపాటి శివశంకరశాస్త్రి, బి.హెచ్.ఇ.ఎల్., 15. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 16. కె. ప్రభావతీదేవి, నెల్లూరు, 17. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 18. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 19. పెనుమచ్చ నాగేశ్వరి, తుని, 20. ఎల్. రేణుక, చందుపట్ల, నల్గొండ జిల్లా, 21. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 22. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 23. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనందబాగ్, 24. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 25. పొన్నపల్లి వెంకటప్పయ్య, సరూర్‌నగర్, 26. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 27. మండ సూర్యకుమారి, అరసపల్లి, 28. ఎల్.వి. రమణమూర్తి, హిమాయత్‌నగర్, 29. జి. ముత్తుమారన్, హెచ్.సి.ఎల్., 30. మద్దూరి లక్ష్మిరాజ్యం, ఎర్రగడ్డ, 31. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 32. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 33. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 34. సోంపాక సీత, భద్రాచలం, 35. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 36. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 37. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 38. సి. రాజేశ్వరి, ఎ.ఎస్.రావు నగర్, 39. పి.బి. సీతాదేవి, నరసాపురం, 40. అన్నంరాజు పూర్ణచంద్రరావు, విశాఖ, 41. ఇ.ఎస్. నరసింహారావు, మధిర, 42. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 43. దొడియం లక్ష్మీప్రసన్న, మల్లాపూర్, 44. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 45. వానపల్లి వెంకట సత్యగంగరాజు, విశాఖ, 46. ఎ.వి. రామకృష్ణ, కాత్రేనికోన, 47. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 48. పప్పు శ్రీదేవి, అమలాపురం, 49. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 50. మల్లిడి శ్యామలారెడ్డి, కొంకుదురు, తూ.గో. జిల్లా, 51. శివలెంక శాండిల్య, హైదరాబాద్, 52. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 53. గోగాడ రూప్‌శ్రీచరణ్, మహారాష్ట్ర, 54. నియాజ్ అలి, హైదరాబాద్, 55. ఎం. కృష్ణ, కాకినాడ, 56. ఎం. శ్రీవాణీ గిరిజాదేవి, రాజమండ్రి, 57. యు. సావిత్రి, మహబూబ్‌నగర్, 58. షేక్ హిదయతుల్లా షరీఫ్, విశాఖ, 59. పక్కి శ్రీదేవి, గంట్యాడ, 60. నోరి శివప్రకాశం, నెల్లూరు, 61. కె. సోహన్, తిరుపతి, 62. తొయ్యేటి వెంకటసూర్యం, విశాఖపట్నం, 63. టి.ఎస్. లత, మంచిర్యాల, 64. జి. శోభ, తిరుపతి, 65. సి. నిర్మల, తిరుపతి, 66. వి. మురళీకృష్ణ, పుంగనూరు, 67. శ్రీపాద హరిత, కాప్రా, 68. వి. ఇందిరా సుబ్రహ్మణ్యం, సోమాజిగూడ, 69. తాడేపల్లి సుభద్రాదేవి, కాకినాడ, 70. దేవరకొండ లక్ష్మీ విమల, విశాఖ, 71. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 72. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 73. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 74. ఎం. లక్ష్మీసుజాత, గుడివాడ, 75. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణా జిల్లా, 76. డా. ధరణి పార్థసారధి, నల్లకుంట, 77. పేర్వేల దేవీపవన్‌కుమార్, మణికొండ, 78. వెల్మల రాంరెడ్డి, హూడూరు, కరీంనగర్ జిల్లా, 79. శ్రీదాస్యం లక్ష్మయ్య, హుస్నాబాద్, 80. గరికిపాటి సూర్యశ్రీ, కాకినాడ, 81. ఎస్. జయరామ్ మోహన్, చెన్నై, 82. టి. సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 83. సి. భారతి, మన్సూరాబాద్, 84. బి. అరుణశ్రీ, కరీంనగర్, 85. ఓలేటి కస్తూరి, పార్వతీపురం, 86. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 87. వడ్డి సుశీల, టెంపుల్ అల్వాల్, 88. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 89. డా. సి.కె. శాస్త్రి, గుంటూరు, 90. కె. వెంకుబాబు, గుంటూరు, 91. డి. గోపి పద్మజ, విశాఖ, 92. కోలా సత్యనారాయణ, విశాఖ, 93. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 94. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 95. కొత్తపల్లి కళావతి, టెక్కలి, 96. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 97. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, 98. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 99. ఎ. రంగనాథం, బెంగళూరు, 100. సౌదామినీ నాగరాజన్, వైజాగ్, 101. ధఫ్వూరి సుధాదేవి, సీతారాంబాగ్, 102. వి.వి. సుబ్బారావు, బెంగళూరు, 103. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 104. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 105. ఉ. నరసింహమూర్తి, లాలాపేట, 106. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 107. బి.వి. నరసింహారావు, పేరాల, 108. టి. మహాలక్ష్మి, బెంగళూరు, 109. కరి అమ్మయ్యచౌదరి, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 110. ఎస్.వి.వి.ఎస్. పద్మావతి, కాకినాడ, 111. డా.కె. శివభూషణం, కర్నూలు, 112. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 113. కరణం

(..128లో)

# చతురంగం - 57 ఆధారాలు

## అడ్డం

1. అంగీకారం (3)
3. దుఃఖం (3)
6. గుంపు (2)
7. కవిత్రయంలో రెండోవాడు (7)
9. భక్షించం (2)
11. ఎక్కువ (2)
12. సుషుప్తి, పడుకోవడం (2)
14. నిలువు 8కి జోడు, రెండో మంత్రి (3)
18. జాంపళ్లు కుశలమడిగిన నటి (3)
19. తామర కొలను (5)
21. కలపడం (3)
23. 'రావయ్యా ముద్దుల మామ నీకు రాసిస్తా రాయలసీమ' అంటూ బాలయ్యని కవ్వించిన నటి (3)
26. ఇతరులు అటునించి (3)
28. శాకాహారులకిష్టమైనవి, నలుపు, ఆకుపచ్చ కాయలు (4)
30. దాక్కోవడం (2)
32. భూమి (3)
34. కాగితపు సంచి (3)
35. సముద్రం (3)
36. కిరీటంలో పెట్టే రంగుల ఈకలు (3)
37. పని, తెలుగు వ్యాకరణంలో కర్తతో పాటు ఉండేది అటునుంచి (2)
38. రావణుడి తల్లి (3)
39. రమ్మనడం, పిలవడం (3)

## నిలువు

1. ఆజ్ఞ (3)
2. ఏనుగు (2)
3. విజ్ఞప్తి (3)
4. ఉత్తరాంధ్రకు చెందిన ప్రసిద్ధ కథారచయిత (2)
5. విసనకర్రే కిందనుంచి (3)
6. సూర్య, అసిన్ సినిమా (3)
8. గోల్కొండ నవాబుల వద్ద మంత్రుల్లో ఒకడు తడబడ్డాడు (3)
10. తెలుగు 'ఇన్‌సల్ట్' కింద నుంచి (4)
13. పలచగా ఉండేది, ఘనం కానిది (2)
15. అణచివేతకు గురయినవారు (4)
16. త్రిగుణాల్లో ఒకటి, రాక్షసత్వానికి, అజ్ఞానానికి కారణమైంది (3)
17. చెల్లాచెదరు తిరగబడింది (5)
20. సునాయాసం, నైపుణ్యం (3)
22. పుండు, వ్రణం (3)
24. 'బాలికలు'కు వ్యతిరేకం (3)
25. 'హార్ట్ ఎటాక్' సినిమా నాయిక (4)
27. స్త్రీని ఇలా కూడా అనొచ్చు (4)
29. 'తురుష్కులు'కు.. మరో రూపం (4)
31. అడ్డం 12 కు ఫలితం (3)
33. పారంపర్యంగా సంక్రమించే ఆస్తి.. హక్కు (3)

*(127వ పేజీ తరువాయి...)*

సుధీంద్రరావు, కర్నూలు, 114. తటవర్తి రామలక్ష్మి, తాళ్లగడ్డ, 115. వై. శివశంకర్‌రెడ్డి, తిరుపతి, 116. కె. లక్ష్మీకమల, విజయవాడ, 117. పి.సి. అలేయమ్మ, హనుమకొండ, 118. ఎన్.కె. అరవెల్లి, మహారాష్ట్ర, 119. ఎస్. హైమారాణి, విజయవాడ, 120. కె. సరోజ, అనంతపురం, 121. పి.వి. రంగాచార్యులు, ఎల్.బి. నగర్, 122. బందెల ప్రణవ్, ఉయ్యూరు, 123. పెదిరెడ్ల జనార్దనరావు, పార్వతీపురం, 124. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 125. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 126. లింగబత్తుల భవ్యశ్రీ, ఆర్.సి. పురం, 127. కనకల అప్పారావు, విజయవాడ, 128. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 129. ఎం.వి. రాఘవరాజు, మోతీనగర్, 130. పి. శారదాదీప్తి, బొమ్మూరు, తూ.గో. జిల్లా, 131. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్, 132. ఏకా సావిత్రి, బాపట్ల, 133. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 134. నేలటూరి యశోద, ఆల్వాల్, 135. నున్న లక్ష్మీవెంకట సత్యనారాయణమూర్తి, యర్రవరం, తూ.గో. జిల్లా, 136. ఆర్. మనోజ్‌కుమార్, శ్రీకాకుళం, 137. పి. సీతారత్నం, నరసాపురం, 138. టి. వెంకాయమ్మ, ఒంగోలు, 139. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 140. పి.వి. రవికుమార్, తిరుపతి, 141. ఆర్.వి.వి. సుబ్బారావు, ఏలూరు, 142. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 143. కె. విమలాదేవి, జనగాం, 144. కొల్లూరు వేంకటరమణమూర్తి, పర్లాకిమిడి, ఒడిశా.

# చతురంగం - 57

రూ.150/- బహుమతి

గడువు తేది : డిసెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 | 5 | ■ | 6 | |
| | ■ | 7 | 8 | | | | | | ■ |
| 9 | 10 | ■ | 11 | | ■ | బా | ■ | 12 | 13 |
| ■ | 14 | 15 | | ■ | 16 | ■ | 17 | ■ | |
| 18 | | | ■ | 19 | | 20 | క | | ■ |
| ■ | 21 | | 22 | ■ | 23 | | | ■ | 24 |
| 25 | ■ | 26 | | 27 | ■ | 28 | | 29 | |
| 30 | 31 | ■ | 32 | | 33 | ■ | 34 | | |
| 35 శ | | | ■ | 36 | | | ■ | | ■ |
| 37 | | ■ | 38 | | సి | ■ | 39 | | |

పంపినవారి పేరు: ---------------------------------------

వయసు (      ) చిరునామా : --------------------------------

---------------------------------------------------------

---------------- పిన్ : ----------- ఫోన్ : ----------------

## నిబంధనలు

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# హోటల్ బాయ్ ప్రేమలో సినీనటి!?

నవజ్యోతి హోటల్ మూడో అంతస్తులో దిగిన సినీస్టార్ సుగుణతో లెటర్ రాయించుకోవడానికి వెళ్లాడు చదువురాని వెయిటర్ బాయ్ పాండియన్. అప్పటికే ఆమెను మూగగా ప్రేమిస్తోన్న పాండియన్ ఉన్నట్టుండి ఆమెకు తన మనసులో మాట చెప్పేశాడు. మరి ఆమె సమాధానం? చదవండి సుప్రసిద్ధ కథకులు
**జయకాంతన్** తమిళ కథ **నువ్వేమంటావ్ సార్?**

భార్యకు ప్రేమగా ఇచ్చిన కానుక అతడికి శాపమైంది. ఆ శాపాన్ని తప్పించుకునేందుకు చేసిన ప్రయత్నం యమపాశమై మెడకు చుట్టుకుంది. దాన్నుంచి బయటపడ్డాడా? చదవండి **రెండి లోర్డన్** ఆంగ్లో ఇటాలియన్ కథ **భస్మం**

శీతాకాలం కావడంతో భర్తకు పని దొరకలేదు. ఆమె ఉద్యోగమే కుటుంబానికి జీవనాధారం. అయితే ఆమె సంగతి యాజమాన్యానికి తెలిస్తే ఉద్యోగం పోవడం ఖాయం. ఇంతకీ ఆ విషయమేంటి?
చదవండి **మొరిత్స జిగ్మొండ్** హంగేరీ కథ
**మూడోవాడు**




క్లీన్‌షేవ్‌తో పెళ్లికి వచ్చిన శ్రీవారి చుట్టూ మరదళ్లు చేరి, హీరోలా ఉన్నావంటూ కితాబులివ్వడంతో శ్రీమతి గారికి అసూయ లావాలా ఎగిసింది. దాంతో వీరప్పన్‌లా మీసాలు పెంచమని హుకుం జారీ అయింది. అదే ప్రమాదం తెచ్చింది. ఏమిటది? చదవండి **రాజేంద్రప్రసాద్** ఉత్తరాంచల్ కథ **మీసాలు**

ఇంకా.. జగమెరిగిన కథకులు
**జెఫ్రీ ఆర్చర్** ఇంగ్లండ్ కథ **సంస్కరణ**,
**గైడీమపాసా** ఫ్రెంచ్ కథ **అనాథ**..
డిసెంబరు విపులలో మీకోసం!

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# వెలుగునీడలు పడుగుపేకలు

అంతరించిపోతున్న కళకు
ఆయువు పోయాలన్న తపనతో ఒకరు..!
కడుపు నింపని కళనే నమ్మి
కాలం చేతిలో బందీయై బక్కచిక్కినదింకొకరు..!
చదువుకోవాలన్న ఆశతో
సంక్షేమ హాస్టల్లో చేరి కామపిశాచి
కరాళ దంష్ట్రలకు చిక్కి గాయపడింది మరొకరు!
ఈ ముగ్గురి జీవితాలను పడుగుపేకలా కలిపి నేసిన కలనేతే
కన్నెగంటి అనసూయ ప్రయోగాత్మక నవల
**కొత్తగా రెక్కలొచ్చెనా!**
చతుర నూతన సంవత్సర కానుక!

## బోనస్‌గా...

* **నవలావలోకనం**లో..
  సరదా ప్రేమకథలా సాగే నేపథ్యంలో గాఢమైన
  మనస్తత్వ చిత్రణ, సాంద్రమైన సంఘటనలతో పాఠకుల
  మనసుకు హత్తుకునే రుద్రాభట్ల నరసింగరావుగారి నవల
  **ఆదర్శశిఖరాలు**

* **చమత్'కారం'**లో..
  తమకు ప్రీతికరమైనవి సమర్పిస్తే తప్ప భక్తుల వంక
  కన్నెత్తి చూడని దేవుళ్లకు వారసులమైన మాది
  ఆది నుంచీ లంచాల జాతే అంటూ
  కవిగారి చమత్కార సమర్థన!



